# తెలుగులో విజ్ఞాన సర్వస్వాలు

డా॥ గుంజి వెంకటరత్నం









నాలుగవ ప్రపంచ తెలుగు మహాసభల ప్రచురణ




ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
రాష్ట్ర సాంస్కృతికశాఖ, సాంస్కృతిక మండలి

తెలుగు అకాడమి, హైదరాబాదు



తెలుగు అకాడమి ప్రచురణ
లఘు గ్రంథం (మోనోగ్రాఫ్)

# తెలుగులో విజ్ఞాన సర్వస్వాలు

రచయిత
**డా॥ గుంజి వెంకటరత్నం**, ఎం.ఎ., ఎం.లిట్., పిహెచ్.డి.
విశ్రాంతాచార్యులు
వరంగల్

**4వ ప్రపంచ తెలుగు మహాసభలు**
**27,28,29 డిశంబరు, 2012**

**ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం**



రాష్ట్ర సాంస్కృతిక శాఖ, సాంస్కృతిక మండలి



తెలుగు అకాడమి, హైదరాబాదు

***teluguloo vignaana sarswaalu***

*a monograph published on the occasion of 4th World Telugu Conference*

***Author***

Dr. Gunji Venkataratnam

First Edition : 2012

Pages : Pp. xviii + 110 + iv



Copies : 5000

Price : Rs. 30/-

Published by TELUGU AKADEMI, Hyderabad- 500 029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional Languages at the University level of the Goverment of India in the Ministry of Human Resource Development, New Delhi.



***Published, Printed & Distributed by***

**Telugu Akademi**
**Hyderabad**

***Laser Typeset at***

Telugu Akademi, Hyderabad

***Printed in India***

Printed at M/s. Padmaja Printers Pvt. Ltd., Hyderabad

యన్. కిరణ్ కుమార్ రెడ్డి



హైదరాబాదు

# ముఖ్యమంత్రి
## ఆంధ్రప్రదేశ్

---

## సందేశం

ప్రపంచవ్యాప్తంగా ఉన్న తెలుగువారిని ఒక్క వేదికపైకి తీసుకువచ్చేందుకు, తెలుగు ప్రభలను దశదిశలా వ్యాపింపజేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం డిశంబరు 27 నుంచి 29 వరకు ఏడుకొండలవాడి ఆవాసమైన తిరుపతి పుణ్యక్షేత్రంలో అత్యున్నత స్థాయిలో తెలుగు మహాసభలను ఏర్పాటు చేసింది. రాష్ట్రంలోనూ, దేశంలోనూ, ఇతర దేశాల్లోనూ ఉన్న తెలుగువారందరూ పరస్పరం భావ వినిమయం చేసుకోవడానికీ, తెలుగువారు తమ గత చరిత్రను సంస్మరించుకొంటూ, ఉత్కృష్టమైన భవిష్యత్తును నిర్మించుకోవడానికీ ఈ మహాసభలు ఎంతోగానో దోహదం చేస్తాయని మేము విశ్వసిస్తున్నాం.

తొలి ప్రపంచ తెలుగు మహాసభలు జరిగి 37 సంవత్సరాలు గడిచాయి. అయితే ఇంతవరకూ ఏ రాష్ట్ర ప్రభుత్వమూ ప్రపంచ సభలను నిర్వహించడానికి చొరవ చూపలేదు. మా ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన నాటి నుంచీ ప్రజాజీవితాల్ని ఎలా మెరుగుపరచాలీ తెలుగు వారి వైభవాన్ని ఎలా పరిరక్షించాలి అనే దృష్టితో పనులు చేపడుతోంది. తెలుగువారి నిర్వహణ సామర్థ్యాన్ని ఇటీవల జరిగిన జీవవైవిధ్యసదస్సులో కూడ ప్రభుత్వం నిరూపించింది. ఈ నేపథ్యంలో ప్రపంచ తెలుగు మహాసభలను నిర్వహించడానికి సమాయత్తమైంది.

ఇటీవలి కాలంలో ప్రపంచవాప్తంగా ఎన్నో రాజకీయ, సామాజిక, సాంస్కృతిక పరిణామాలు సంభవించాయి. వీటి నేపథ్యంలో బహుభాషా దేశమైన మన భారతదేశంలో తెలుగు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన

విషయాల్లో జరిగిన కృషి గురించి, జరగవలసిన కృషి గురించి మనం చర్చించవలసింది ఎంతో ఉంది. ప్రపంచీకరణ నేపథ్యంలో మన తెలుగు భాష ఉనికిని కోల్పోకుండా పరిరక్షించేందుకు, తెలుగు ఔన్నత్యాన్ని పలుదిశలా చాటేందుకు రాష్ట్ర ప్రభుత్వం కృత నిశ్చయంతో ఉంది. నిత్యం ప్రజల హితం కోరి, ప్రజల అభీష్టాలను నెరవేర్చేందుకు, తెలుగు జాతి దేశవిదేశాల్లో తలెత్తుకు తిరిగేలా చేసేందుకు అవిరళ కృషి చేస్తున్న మా ప్రభుత్వం, తెలుగు తేజం కాంతులు వెదజల్లేలా ఈ మహోజ్వలమైన సభల నిర్వహణకు సమాయత్తమైంది. ఈ సభలలో సదస్సులు, తెలుగువారి కళా ప్రదర్శనలు, చేతివృత్తుల ప్రదర్శనలు, లలితకళా వైభవాన్ని చాటే కార్యక్రమాలు, రాష్ట్రేతర, విదేశాంధ్రుల సమావేశాలు మొదలైన ఎన్నో అంశాలతో పాటు, పుస్తక ప్రచురణ కూడ పెద్ద ఎత్తున చేపడుతున్నాం. అందులో భాగంగానే ఈ లఘుగ్రంథాల ప్రచురణ జరుగుతున్నది.

ఎంతో ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తున్న ఈ సమావేశాల సందర్భంగా ప్రచురించే లఘుగ్రంథాలు పాఠకుల ఆదరణ పొందగలవని ఆశిస్తున్నాము.

కిరణ్ రెడ్డి

(యన్. కిరణ్ కుమార్ రెడ్డి)

సి. దామోదర రాజనరసింహ



# ఉపముఖ్యమంత్రి
## ఆంధ్రప్రదేశ్

---

## అభినందన

**ఏ దేశమేగినా, ఎందుకాలిడినా**
**పొగడరా నీతల్లి భూమి భారతిని**
**నిలపరా నీజాతి నిండు గౌరవము**

అన్న మహాకవి రాయప్రోలు వాక్కులు ప్రపంచవ్యాప్తంగా ఉన్న తెలుగువారు నిత్యం స్మరించుకోతగినవి. దేశంలోని అన్ని రాష్ట్రాలలోనూ, ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ తెలుగు ప్రజలు తమ ప్రతిభా పాటవాలను నిరూపించుకుంటూ ప్రశంసలు పొందుతున్న ఈ సమయంలో నాల్గవ ప్రపంచ తెలుగు మహాసభలు ప్రపంచ ఆధ్యాత్మిక క్షేత్రమైన తిరుపతిలో మన రాష్ట్ర ప్రభుత్వం నిర్వహిస్తున్నది. ఇది తెలుగు భాషాభిమానులకూ, కళా సాంస్కృతిక రంగాలలో కృషి చేస్తున్నవారికీ ఒక పండగ.

ప్రపంచీకరణ నేపథ్యంలో మాతృభాషలను, మాతృసంస్కృతిని పరిరక్షించుకోవడం మనందరి బాధ్యత. ఈ సందర్భంలో తెలుగు భాష, జాతి వికాసం కోసం నిరంతరంగా కృషిచేస్తున్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర తెలుగు భాషా సంస్థ అయిన తెలుగు అకాడమికి 150 లఘుగ్రంథాలను(మోనోగ్రాఫ్‌లను) రాయించి పుస్తకాలుగా తెచ్చే అవకాశం కల్పించాం. తెలుగు భాష, సంస్కృతి, చరిత్ర, సంప్రదాయాలు, తెలుగుభాషోద్యమాలు, సాహిత్యకారులు, సంఘసంస్కర్తలు, కథ, నవల, వ్యాసం, కవిత్వం లాంటి వివిధ సాహిత్య ప్రక్రియలు, ఛందస్సు, ప్రకృతివైద్యం, ప్రాచీన ఆధునిక సాహిత్య సాంస్కృతిక విషయా లన్నింటిపై, సాహిత్యచరిత్రలపై పుస్తకాలు రాయించి ముద్రిస్తున్న తెలుగు అకాడమిని అభినందిస్తున్నాను. కొద్ది సమయంలో పుస్తకాలు రాయించి ముద్రించడం అనేది ఓయజ్ఞంగా భావించి చేస్తేనే తప్ప ఈ పని పూర్తి కాదు, ఆ పనిని తెలుగు అకాడమి విజయవంతంగా నిర్వహిస్తున్నది.

ఇప్పుడు నిర్వహిస్తున్న ప్రపంచ తెలుగు మహాసభలు, ఈ సందర్భంగా ప్రచురిస్తున్న పుస్తకాలు మన భాషను, జాతిని, సంస్కృతిని, చరిత్రను సమున్నతంగా నిలబెట్టే యజ్ఞంలో, తెలుగు భాషా పరిరక్షణలో ఎంతో ఉపయోగపడతాయని ఆశిస్తున్నాను. తెలుగు భాష పరిరక్షణకోసం, ఔన్నత్యం కోసం ప్రభుత్వం తీసుకుంటున్న చర్యల్లో భాగంగా జరుగుతున్న ఈ ప్రపంచ తెలుగు మహాసభలను ఆహ్వానిస్తూ, ఇన్ని పుస్తకాలు ముద్రిస్తున్న తెలుగు అకాడమి సంచాలకులకు, రచయితలకు మరియు అకాడమి సిబ్బందికి అభినందనలు తెలుపుతూ ప్రపంచంలో ఉన్న 18 కోట్ల మంది తెలుగు ప్రజల అభ్యున్నతి కోరుతూ.. మరోసారి అందరికీ నాహృదయ పూర్వక శుభాకాంక్షలు తెలుపుతున్నాను.

"తల్లి నుడికంటె పరమామృతంబుకలదె"

(సి. దామోదర రాజనరసింహ)

**V. VASANT KUMAR,** B.Sc.(Ag.): M.B.A
Minister for Tourism & Culture,
Archgology & Museums,
Archives & Youth Services & Sports, N.C.C.
Government of Andhra Pradesh



Room No. 501, 5th Floor,
J-Block, A.P. Secretariat
Hyderabad - 500 022
Phone : 040-23454168,
23450541
Fax :040-23450899

---

# ప్రస్తావన

తెలుగువారు తెలుగు నేలపై 37 ఏళ్ళ విరామం తరవాత చేసుకుంటున్న పండుగ ప్రపంచ తెలుగు మహాసభలు, మన సంస్కృతిని నలుదిశలా వ్యాపింపజేస్తున్న తెలుగు వారందరూ ఒక్కచోట చేరి, తెలుగు దనాన్ని పంచుకునేందుకు, తెలుగు పరిమళాలు వెదజల్లేందుకు ఉద్దేశించిన సన్నివేశం ప్రపంచ తెలుగు మహాసభలు, తెలుగు వారి సంస్కృతి బహుముఖీయమైంది. అందులో భాష, సాహిత్యం, చరిత్ర, లలితకళలు, జానపద, గిరిజన విజ్ఞానం వంటి ఎన్నో అంశాలున్నాయి. వీటన్నిటి గురించి విశ్లేషించుకొని, వాటిని పరిరక్షించడం, పోషించడం, పరివ్యాప్తి చేయడం ప్రభుత్వం తన విద్యుక్త ధర్మంగా భావిస్తున్నది.

ఈ బృహత్తరమైన బాధ్యతని నెరవేర్చే సంకల్పంలో భాగంగానే 'ప్రపంచ తెలుగు మహాసభల' నిర్వహణకు ప్రభుత్వం నడుము కట్టింది. అతి తక్కువ వ్యవధిలో అత్యంత సమున్నత స్థాయిలో తలపెట్టిన ఈ మహాసభలకు దేశ విదేశాల నుంచి తెలుగువారు స్వాగతం పలుకుతున్నారు. అత్యధిక సంఖ్యలో ఈ సభల్లో పాల్గొంటున్నారు.

తెలుగు వారందరూ ఒక్కచోట సమకూడి, తమ గురించి చర్చించుకుని, భవిష్యత్తుకు బాటలు వేసుకునే క్రమంలో మన గురించి మనం మరోసారి తెలుసుకునేందుకు, వివిధ రంగాల్లో మనం సాధించిన దాన్ని పునశ్చరణ చేసేందుకు ఈ సభల సందర్భంగా సదస్సులు, లఘుగ్రంథాల ప్రచురణ, ప్రత్యేక సంచికల పునశ్చరణ, వివిధ అంశాల్లో ప్రదర్శనలు, సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేయడం జరుగుతున్నది.

తెలుగువారిది ఘనమైన చరిత్ర, అత్యున్నత సంస్కృతి, అయితే కాలంతో పాటు అభివృద్ధి పథంలో నడుస్తున్న తెలుగువారు ఎప్పటికప్పుడు తమ సంస్కృతిలోకి కొత్త నీరును ఆహ్వానించడం సహజం. ఈ "పాతకొత్తల మేలు కలయికే"ఒక జాతిని నిత్యచైతన్యంతో నింపుతుంది. ఈ విధంగా కొత్త దనాన్ని ఆహ్వానిస్తూనే, మన గతవైభవాన్ని విస్మరించకుండా కాపాడుకోవలసిన బాధ్యత మన మీద ఉంది. ఇవన్నీ ఈ ప్రపంచ తెలుగు మహాసభల్లో చర్చకు రానున్నాయి. అందరం కలిసి, తెలుగుదనాన్ని పరిరక్షించుకునే ప్రయత్నం చేయవలసిన తరుణం ఆసన్నమైంది.

వీటన్నిటినీ దృష్టిలో ఉంచుకుని తెలుగువారి భాష, సాహిత్యం, సంస్కృతి పౌరజీవనం తదితర అంశాలపై లఘుగ్రంథాలను నిష్ణాతుల చేత రచింపజేసి ప్రచురించే గురుతర బాధ్యతను పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, తెలుగు అకాడమి, రాష్ట్ర సాంస్కృతిక శాఖ నిర్వర్తిస్తున్నాయి. తెలుగు ప్రజలు కలకాలం ఉపయోగించుకునే విధంగా ఈ పుస్తక ప్రచురణ జరుగుతోంది. వీటిని పాఠకులు, తెలుగు భాషాభిమానులు, పండితులు ఆదరిస్తారని విశ్వసిస్తున్నాను.

వ. వసంతకుమార్

**వట్టి వసంతకుమార్**

# భూమిక

1968లో ప్రభుత్వం అప్పటి విద్యాశాఖమంత్రి మాన్యశ్రీ పి.వి. నరసింహారావు గారు తొలి అధ్యక్షులుగా స్థాపించిన తెలుగు అకాడమి తెలుగు భాషా వికాసం కోసం చేస్తున్న కృషి అపరిమితం. పాఠ్యపుస్తకాలు, పోటీ పరీక్షల పుస్తకాలు, మోనోగ్రాఫ్‌లు, నిఘంటువులు, మాండలిక పదకోశాలతో పాటు భాష, సాహిత్యం, సంస్కృతికి సంబంధించిన అనేక పుస్తకాలు ప్రచురిస్తూ తెలుగుభాషకోసం అకాడమి చేస్తున్న సేవలు అద్వితీయం. తెలుగు భాష, జాతి, సంస్కృతి ప్రేమికుడయిన మాన్యశ్రీ సి. దామోదర రాజనరసింహ గారు అధ్యక్షులుగా తెలుగు అకాడమి తన పరిధిని మరింత విస్తరించుకొని తెలుగు భాషలో శాశ్వతంగా మిగిలిపోగల అనేక పుస్తకాలను తీసుకువస్తున్నది. మహాకవి గుర్రం జాషువా పరిశోధన కేంద్రం నెలకొల్పి తద్వారా ప్రతి ఏటా సాహిత్యరంగంలో విశిష్టసేవ చేసిన ముగ్గురిని ఎంపిక చేసి ఒక్కొక్కరికి రెండు లక్షల రూపాయల చొప్పున నగదు పురస్కారాలు ఇవ్వడం సాహిత్యవేత్తలకు, తెలుగు భాషకు చేస్తున్న సేవకు నిదర్శనం. తెలుగు వారి చరిత్రలోనే ఇది ప్రథమం. అకాడమి ప్రచురించే పుస్తకాలతో పాటు ఇటీవలి కాలంలో గురజాడ సాహిత్యసర్వస్వం, జాషువా పరిశోధన కేంద్రం తరపున పుస్తకాలు ప్రచురించింది. తన 45 సంవత్సరాల చరిత్రలో దాదాపు 3500 శీర్షికలతో వివిధ గ్రంథాలను ప్రచురించి భారతదేశంలోని అకాడమిలన్నింటిలో తెలుగు అకాడమి అగ్రస్థానంలో నిలబడటం తెలుగు వారి కృషికి గర్వకారణం. రాష్ట్రవ్యాప్తంగా సదస్సులు, సభలు, చర్చాగోష్ఠులు నిర్వహించడంతో పాటు ఇటీవల జాషువా జయంతి సందర్భంగా "శతకవితావసంతం" నిర్వహించి రాష్ట్రవ్యాప్తంగా కవితాచైతన్యానికి, కవులకు ప్రోత్సాహాన్నిచ్చింది తెలుగు అకాడమి.

2012 డిశంబర్ 27,28,29 తేదీల్లో తిరుపతిలో జరగనున్న నాలుగవ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ప్రభుత్వం అకాడమి పై ఉన్న నమ్మకంతో 150లఘు గ్రంథాలను (మోనోగ్రాఫ్‌లను)రాయించి ప్రచురించే బాధ్యతను అప్పగించింది. తెలుగు భాష, సాహిత్యం, చరిత్ర, సామాజిక శాస్త్రాలు, విజ్ఞాన శాస్త్రాలు, జాతి, సంస్కృతి ఒక్కటేమిటి తెలుగుకు సంబంధించిన వివిధ అంశాలను తీసుకొని పుస్తకాలు రాయించడం జరిగింది. తెలుగు భాషా, సాహిత్యాలలో లబ్ధ ప్రతిష్ఠులైనవారితో పాటు ఆయారంగాల్లో నిపుణులైన వాళ్ళతో పుస్తకాలు తయారు

చేయించి ప్రచురిస్తున్నాం. తెలుగు భాషను, సాహిత్య సంస్కృతులను, సమస్త విషయాలను సమున్నతంగా నిలబెట్టగలమన్న నమ్మకంతోనే ఈ కృషి చేస్తున్నాం. తెలుగు సాహిత్యంలో అనర్ఘరత్నాలనదగిన, జాతి సంపదనదగిన పుస్తకాలను ప్రచురించే ఈ సువర్ణ అవకాశం మాకు కల్పించడమేగాక ఆర్థిక వనరులను అందించి ప్రోత్సహించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారికి, సాంస్కృతిక శాఖ, సాంస్కృతికమండలివారికి కృతజ్ఞతలు. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి **మాన్యశ్రీ యన్. కిరణ్ కుమార్ రెడ్డి** గారికి; ఉపముఖ్యమంత్రి, ఉన్నత విద్యాశాఖా మంత్రి తెలుగు అకాడమి అధ్యక్షులు **మాన్యశ్రీ దామోదర రాజనరసింహ గారికి;** సాంస్కృతిక శాఖామాత్యులు **మాన్యశ్రీ వట్టి వసంతకుమార్ గారికి** కృతజ్ఞతాభివందనాలు.

4వ ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణకుగాను ప్రభుత్వం నియమించిన ఉన్నతస్థాయి సంఘం సభ్యులు :

**శ్రీ ఆర్. వి. రమణమూర్తి,** అధ్యక్షులు, సాంస్కృతిక మండలి

**శ్రీ మండలి బుద్ధప్రసాద్,** రాష్ట్ర అధికారభాషా సంఘం అధ్యక్షులు

**డా. జె. బాపురెడ్డి,** ఐ.ఎ.ఎస్.,(రి)

**శ్రీ కె.వి. రమణాచారి,** ఐ.ఎ.ఎస్.,(రి) సాంస్కృతిక శాఖ, సలహాదారులు

**శ్రీ వి. భాస్కర్,** ఐ.ఎ.ఎస్. ముఖ్య కార్యదర్శి, ఆర్థిక శాఖ, ఆం.ప్ర.

**శ్రీ ఎల్. వి. సుబ్రహ్మణ్యం,** ఐ.ఎ.ఎస్. కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం

**శ్రీమతి చిత్రా రామచంద్రన్,** ఐ.ఎ.ఎస్., ముఖ్య కార్యదర్శి, రెవెన్యూ శాఖ (దేవదాయ)

**ఆచార్య ఎల్లూరి శివారెడ్డి,** ఉపాధ్యక్షులు, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

**శ్రీ జి. బలరామయ్య,** ఐ.ఎ.ఎస్., ప్రభుత్వ కార్యదర్శి, సాంస్కృతిక శాఖ

**శ్రీ జి. ఎన్. రావు,** ఐ.ఎ.ఎస్.(రి) ప్రత్యేకాధికారి, శిల్పారామం

**ఆచార్య కె. యాదగిరి,** సంచాలకులు, తెలుగు అకాడమి

**డా. రాళ్లబండి కవితా ప్రసాద్,** సంచాలకులు, సాంస్కృతిక శాఖ

ప్రపంచ తెలుగు మహాసభల రూపకల్పనతో పాటు లఘుగ్రంథాల తయారీలో తమ సహాయ సహకారాలు అందించినందుకు ఈ కమిటీ వారికి ధన్యవాదాలు తెలుపుతున్నాం.

4వ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ప్రచురిస్తున్న ఈ మోనోగ్రాఫ్‌లను అత్యంత స్వల్ప వ్యవధిలో తయారుచేయించడం జరిగింది. ఈ గ్రంథాల్లో ఏవైనా దోషాలు, పొరపాట్లు దొర్లినట్లు పాఠకులు గమనిస్తే సహృదయంతో వాటిని మా దృష్టికి తీసుకొని వస్తే మలి ముద్రణలో సవరించగలమని తెలియజేస్తున్నాం.

**ధర్మమనుదు, తత్త్వమనుదు, యోగమనుదు**
**ప్రాణిసాధింపగల సకలపరమార్థములకు**
**తల్లిభాషప్రధాన సూత్రంబయగుట**
**భాషకంటె నవ్వులకు తపస్సులేదు**

ఆచార్య కె. యాదగిరి
సంచాలకులు

# తెలుగు అకాడమి సమన్వయ సంఘం

ఆచార్య కె. యాదగిరి

సంచాలకులు

డా॥ ఎం. మాణిక్యలక్ష్మి

ఉపసంచాలకులు

డా॥ ఎన్. యోగిబాబు

డా॥ టి. అరవింద

శ్రీ టి. రాజేందర్ కుమార్

శ్రీ ఎం. వెంకటేశం

శ్రీమతి సి. శ్రీవిద్య

శ్రీ ఎస్. భూపాల్‌రెడ్డి

శ్రీమతి కె. గీతాంజలి

డా॥ ఎం. శైలజ

శ్రీమతి ఎస్.ఎ.టి. రాజ్యలక్ష్మి

శ్రీమతి వి. అరుంధతి

శ్రీ ఎస్. వేదవ్యాస్

---

* *ఈ గ్రంథంలో ప్రచురితమైన విషయాలకు, వివరాలకు, అభిప్రాయాలకు ఆయా రచయితలు/రచయిత్రులే బాధ్యులు.*

# ప్రవేశిక

విజ్ఞాన సర్వస్వం లేదా విశ్వ విజ్ఞాన కోశం అనే సాహిత్య ప్రక్రియ-మన దేశ భాషల్లో కొత్తగా ఆవిర్భవించింది. ఆంగ్లేయుల పాలనలో వారి భాషా సాహిత్యాల ప్రభావంతో ఇది మన దేశ భాషల్లోను చోటు చేసుకున్నది. మొదట బెంగాలీలోను, ఆ తర్వాత హిందీలోను, అటు పిమ్మట తెలుగు తమిళాది దక్షిణ దేశ భాషల్లోను ఇవి అవతరించాయి. తెలుగులో దీనికి మూలాలు 1847లోనే కనిపిస్తున్నాయి. ఆ తర్వాత కూడా ఈ తరహా రచనలు కొన్ని వచ్చినా, పూర్తి స్థాయి విజ్ఞాన సర్వస్వాల నిర్మాణానికి మాత్రం పునాదులు 1915 ప్రాంతాల్లో పడ్డాయి. 1915లో ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ సమితి అనే సంస్థ మద్రాసులో ఏర్పడి, తెలుగులో ఒక సమగ్రమైన విజ్ఞాన సర్వస్వాన్ని నిర్మించేందుకు ప్రణాళికలు సిద్ధం చేసింది. ఆ సంస్థ కృషి ఫలితంగా ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం మూడు సంపుటాలు వెలువడి, తర్వాత అనేక కారణాలుగా దీని నిర్మాణం ఆగిపోయింది. అటు పిమ్మట కొన్ని సంస్థలు, కొంతమంది రచయితలు తెలుగులో రకరకాలు విజ్ఞాన సర్వస్వాలను ప్రచురిస్తూ వచ్చారు. ఇప్పటి వరకు ఇవి దాదాపు 60కు పైగా ఉంటాయి.

తెలుగు విజ్ఞాన సర్వస్వాలను గురించి తెలుసుకొనే ముందు, అసలు విజ్ఞాన సర్వస్వమంటే ఏమిటి? వాటి స్వరూప స్వభావా లెటువంటివి? వాటి లక్ష్యం, ప్రయోజనా లేమిటి? ఆవిర్భావ వికాసా లేమిటి? మొదలైన విషయాలు తెలుసుకోవడం అవసరం.

పై ప్రశ్నలకు సమాధానాల రూపంలో ఈ గ్రంథం, మొదటి ప్రకరణంలో ప్రపంచ వ్యాప్తమైన విజ్ఞాన సర్వస్వాలను గురించిన సమాచారం సంక్షిప్తంగా సమకూర్చడం జరిగింది.

విజ్ఞాన సర్వస్వమంటే-విజ్ఞాన ప్రసార సాధనమైన ఒక సాహిత్య ప్రక్రియ. ఇది మనకు 19వ శతాబ్దం చివర్లోనో, లేదా 20వ శతాబ్దం మొదట్లోనో వచ్చినట్లు మన సాహిత్య చరిత్ర చెబుతున్నది. అంతకు ముందు మన సాహిత్య ప్రక్రియలు ముఖ్యంగా కావ్యాలు మన విజ్ఞాన ప్రసార సాధనాలుగా ఉండేవి. మన కవులు రచయితలు తమ రచనల్లో ఆయా కాలాల్లో ప్రచురంగానున్న

వివిధ రంగాలకు చెందిన విజ్ఞానాన్ని ఎలా పొందుపరుస్తూ వచ్చారు, పూర్వ తరాల వారి విజ్ఞానం ఉత్తర ఉత్తర తరాల వారికి ఎలా అందుతూ వచ్చింది అనే విషయాలు రెండవ ప్రకరణంతో వివరించబడ్డాయి.

ఈ పరిస్థితి దాదాపు 19వ శతాబ్దం సగ భాగం వరకు కనిపిస్తుంది. 1847లో పెద్ద బాలశిక్ష రావడంతో మన విజ్ఞాన సర్వస్వాల నిర్మాణానికి పునాదులు పడ్డాయి. దీంతో మన విజ్ఞాన సర్వస్వాల చరిత్ర ప్రారంభమైంది. ప్రాశ్చాత్య దేశాల్లోను మొదట్లో వచ్చిన ఇలాంటి గ్రంథాలే నేటి విజ్ఞాన సర్వస్వాలకు పునాదులుగా ఆయా దేశాల సాహిత్య చరిత్ర చెబుతున్నాయి. ఆ తర్వాత విజ్ఞాన ప్రసారం లక్ష్యంగా అనేక గ్రంథాలు వెలువడినాయి. ఇవి నేటి విజ్ఞాన సర్వస్వాల్లాంటివి కాక పోయినా ఆ లక్షణాలున్న ఈ గ్రంథాలన్నీ మన విజ్ఞాన సర్వస్వాల చరిత్ర నిర్మాణానికి సాధనాలుగా ఉపయోగపడతాయి. ఇలా 165సంవత్సరాల్లో తెలుగులో వచ్చిన ఈ తరహా గ్రంథాలనన్నిటిని క్రోడీకరించి కాలానుసరణి (Chronological) గా మన విజ్ఞాన సర్వస్వాల చరిత్రను రేఖా మాత్రంగా చిత్రించడం జరిగింది. ఇది మూడవ ప్రకరణం.

నాల్గవ ప్రకరణం తెలుగు విజ్ఞాన సర్వస్వాల వర్గీకరణ, నిర్మాణ పద్ధతులు, సాహిత్య ప్రక్రియనైనా శాస్త్రీయంగా అధ్యయనం చేసేందుకు, ఆ ప్రక్రియలోని వివిధ రకాల గ్రంథాలను, వాటి వాటి రూపగుణ స్వభావాదులను బట్టి వర్గీకరించడం అవసరం. పాశ్చాత్య దేశాల్లో వచ్చిన విజ్ఞాన సర్వస్వాలను రకరకాలుగా వర్గీకరించి ఉన్నారు. వాటి ప్రభావంతో తెలుగులో వచ్చిన విజ్ఞాన సర్వస్వాల్లోను వైవిధ్యం కనిపిస్తుంది. పాశ్చాత్య విజ్ఞాన సర్వస్వాల వర్గీకరణ ఆలంభనంగా మన విజ్ఞాన సర్వస్వాలను వర్గీకరించి చూపడం జరిగింది. అదే విధంగా విజ్ఞాన సర్వస్వాల నిర్మాణ పద్ధతులు (Methodology) వివరించబడ్డాయి.

చివరి ప్రకరణం తెలుగు విజ్ఞాన సర్వస్వాల సమీక్ష. ఇప్పటి వరకు తెలుగులో వచ్చిన విజ్ఞాన సర్వస్వాల్లో ముఖ్యమైన వాటి వివరాలు ఈ ప్రకరణంలో సంక్షిప్తంగా ప్రదర్శించడం జరిగింది. ఈ విధంగా ఈ చిరు పొత్తం సామాన్యంగా విజ్ఞాన సర్వస్వాలను గురించి తెలుసు కోగోరే పాఠకులకు, ప్రత్యేకంగా తెలుగు విజ్ఞాన సర్వస్వాలను అధ్యయనం చేయగోరే పరిశోధకులకు తోడ్పడ గలదని ఆశిద్దాం.

# విషయసూచిక

# 1

# విజ్ఞాన సర్వస్వం

### విజ్ఞాన సర్వస్వమంటే...

ఆంగ్లంలో ఎన్‌సైక్లోపిడియా అనే పదానికి తెలుగులో వాడుకలోనికి వచ్చిన పదబంధమే విజ్ఞాన సర్వస్వం.

ఎన్‌సైక్లియో+పైడియ. అనే రెండు గ్రీకు ధాతుపదాల నుంచి ఎన్‌సైక్లోపిడియా అనే పదం ఏర్పడింది.

ఎన్‌సైక్లియో=సర్కిల్=చక్రరూపమైన
లెర్నింగ్=విద్య లేక విజ్ఞానం

అనే అర్థాలు చెప్పబడినాయి. దీనిని బట్టి గ్రీకులు ఎన్‌సైక్లోపిడియ అంటే ఒక క్రమ పద్ధతిలో కూర్చబడిన సమగ్ర విజ్ఞానంగా భావించి నట్లు తెలుస్తున్నది.

> "The Greeks seems to have understood by Encyclopaedia, instruction in the complete system or circle" (E.B. VIII-364)

ఆంగ్లంలోనిగానీ, ఇతర పాశ్చాత్య భాషల్లోగాని ఈ తరహా గ్రంథాలకు మొదట్లో ఎన్‌సైక్లోపిడియ అనే పేరు లేదు. వివిధ విజ్ఞానాంశాలను క్రోడీకరించిన ఇలాంటి ఆచూకి గ్రంథాలకు కాన్వర్‌జేషన్స్, మాజస్, కామెంటరీస్, లెక్సికాన్, డిక్షనరి, సైక్లోపిడి అనే పేర్లు ప్రచారంలో ఉండేవి. 1541లో రింగిల్‌బర్గ్ అనే

రచయిత తన ఆచూకి గ్రంథానికి సైక్లొపిడియ అనే పేరు పెట్టాడు. అది మొదలు క్రమక్రమంగా ఈ తరహా ఆచూకీ గ్రంథాలకు ఎన్‌సైక్లొపిడియ అనే పేరు పాశ్చాత్య దేశాల్లో ప్రచారం లోనికి వచ్చింది.

బ్రిటీష్ పాలనలో వారి భాషా సాహిత్యాలు ప్రభావం వలన మన దేశ భాషల్లోనూ కొన్ని కొత్త సాహిత్య ప్రక్రియలు ఆవిర్భవించాయి. అటువంటి వాటిలో విజ్ఞాన సర్వస్వం కూడా ఒకటి. అయితే ఇంగ్లీషులో మాదిరి గానే ఇటువంటి ఆచూకీ గ్రంథాలకు విజ్ఞాన సర్వస్వం అనే పేరుగాక మన దేశ భాషల్లో కూడా విజ్ఞానకోశం, విశ్వవిజ్ఞాన కోశం, విశ్వకోశం, మొదలైన పేర్లు వాడుకలో ఉండేవి.తెలుగులోనూ దీనికి సమాంతరంగా సర్వస్వం, విజ్ఞానకోశం, దర్శిని, దీపిక, విజ్ఞానం మొదలైన పేర్లు ప్రచారంలో ఉన్నాయి. ఇవి గాక ఈ తరహా గ్రంథాలకు తెలుగులో విజ్ఞాన సర్వస్వం అనే పేరు కూడా రూఢికెక్కి బహుళ ప్రచారంలో ఉంది. ఇది తెలుగులో మాత్రమే ప్రత్యేకంగా కనిపిస్తుంది. మరియే ఇతర దేశ భాషల్లోను ఈ పేరు కనిపించదు.

విజ్ఞానమ్, సర్వస్వమ్ అనే రెండు తత్సమ పదాలు కలిసి ఏర్పడిన పదబంధం విజ్ఞాన సర్వస్వం. భారతీయ భాషల్లో మాదిరి కోశం, విశ్వకోశం, విజ్ఞాన కోశం మొదలైన పదాలు తెలుగులోను ఉన్నాయి. కానీ విజ్ఞాన సర్వస్వం అనే పదమే నేడు స్థిరపడి బహుళ ప్రచారంలో ఉంది. ఎన్‌సైక్లొపిడియా (ఎన్‌సైక్లియో+పిడియ) అంటే ఒక క్రమపద్ధతిలో కూర్చబడిన సమగ్ర విజ్ఞానంగా గ్రీకు మేధావులు భావించారు. సమస్త విజ్ఞానాంశాల సమాహార స్వరూపం విజ్ఞాన సర్వస్వం అనే సమగ్ర భావ వ్యక్తీకరణ తెలుగులోని విజ్ఞాన సర్వస్వం అనే పదబంధంలోనే వ్యక్తమౌతున్నది. ఈ పదబంధాన్ని తెలుగులో రూఢి పరిచి, ప్రజలకందించి, ప్రచారానికి తెచ్చినవాడు కీ.శే. కొమర్రాజు వెంకట లక్ష్మణరావు పంతులు గారు.

సర్వ విజ్ఞానాంశాల సమాహార స్వరూపం విజ్ఞాన సర్వస్వంగా చెప్పుకున్నాం. అయినప్పుడు విజ్ఞాన మంటే ఏమిటి? విశేషమైన జ్ఞానం విజ్ఞానం. జ్ఞానమంటే ఏమిటి? జ్ఞానమంటే ఎరుక. అంటే ఏదైన ఒక వస్తువును మనం

చూచినప్పుడు లేదా ఒక శబ్దం విన్నప్పుడు మొట్టమొదట మనకు కలిగే తెలివిడే ఎరుక. అదే జ్ఞానం. దానికి సంబంధించిన సమగ్ర సమాచారం విజ్ఞానం. ఉదాహరణకు మనం గణగణ శబ్దాలు విన్నాం. అది గంట అని తెలిసింది. ఇదే ఎరుక లేదా జ్ఞానం. గంట రూపం, దాన్ని తయారు చేసే విధానం, దానికుపయోగించే లోహం, దానిలోని రకాలు, దాని ఉపయోగాలు మొదలైన గంట సమగ్ర సమాచారమంతా, దానికి సంబంధించిన విజ్ఞానం.

ప్రపంచ పర్యాప్తమైన ఈ విజ్ఞానం అనంతం, దినదిన ప్రవర్ధమానం. సమాజాభ్యుదయ సోపానం. సుఖదు:ఖాల ఆవృత్తి రూపమైన జీవితంలో మానవుడెప్పుడూ దు:ఖ నివృత్తి కోసం, సుఖప్రాప్తి కోసం గవేషణ సాగిస్తూనే ఉంటాడు. నిరంతర సాధనా శీలమైన ఈ గవేషణలో అతనెప్పుడూ కొత్త కొత్త విషయాలను తెలుసుకుంటూ ఉంటాడు. అలా తెలుసుకున్న విషయాలే మానవుల అనుభవాల్లో నిగ్గుతేలి, విజ్ఞాన రూపంలో విశ్వవ్యాప్తమై విలసిల్లుతున్నది. నేడు వివిధ రంగాల్లో జరుగుతున్న పరిశోధనలు మూలంగా ఎన్నో కొత్త విషయాలు వెలుగులోకి వస్తున్నాయి. ఈ విజ్ఞాన వికాసమే మానవాభ్యున్నతికి ముఖ్యహేతువౌతున్నది. దేశ, కాల,పాత్రల కతీతమై ప్రపంచ సౌభాగ్యానికి సాధనమౌతున్నది.

ఈ విజ్ఞాన వాహిని అనంతమై, అనుస్యూతంగా ప్రవహిస్తూనే వస్తున్నది. పూర్వపూర్వ తరాల వారి విజ్ఞానాన్ని ఉత్తరోత్తర తరాల వారికి అందిస్తూనే ఉన్నది. దీనికి ప్రాచ్య పాశ్చాత్యాలనే దేశ బేధంగానీ, ప్రాచీనం అర్వాచీనం అనే కాల భేదంగాని, నలుపు తెలుపు అనే జాతి భేదంగాని, స్త్రీలు పురుషులనే లింగ బేధాలుగాని లేవు. వీటన్నిటికి అతీతమైన విజ్ఞానం అవిచ్ఛిన్నంగా సాగుతూ మానవ సౌభాగ్యానికి సాధన భూతమౌతున్నది. అయితే ఆయా దేశాల్లోని విభిన్న సంస్కృతుల కనుగుణంగా విజ్ఞానం వ్యాప్తి చెందడం సహజం. ఈ దృష్టితో చూచినప్పుడు ప్రాచ్య దేశాల సంస్కృతీ వికాసంలో భావ ప్రవృత్తి అధికంగాను, పాశ్చాత్య దేశాల సంస్కృతీ వికాసంలో భౌతిక ప్రవృత్తి బలీయంగాను ప్రభావం చూపినట్లు కనిపిస్తుంది. ఈ కారణంగా

ప్రాచ్య సంస్కృతీ వికాసంలోని భావ ప్రవృత్తి వలన వైదిక, జైన, బౌద్ధ, మహమ్మదీయ, క్రైస్తవాది మతాలు ఆలంబనంగా సంగీతం, సాహిత్యం, నాట్యం, శిల్పం, చిత్రలేఖనాది కళా రంగాలు, రాజనీతి, న్యాయం, యోగం, గణితం, జ్యోతిషాది శాస్త్ర రంగాలు అభివృద్ధి చెంది ఇక్కడి విజ్ఞాన వికాసానికి ఎంతగానో దోహద పడ్డాయి. అదే విధంగా పాశ్చాత్య సంస్కృతీ వికాసంలో భౌతిక ప్రవృత్తి బలీయంగా ఉండటం వలన, భౌతిక శాస్త్రాలు, కళలు అభివృద్ధి చెంది, అక్కడి విజ్ఞాన వికాసానికి తోడ్పడినాయి.

ఏది ఏమైనా ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతీ వికాసాల్లో రూపుదిద్దుకున్న భావ ప్రవృత్తులు, భౌతిక ప్రవృత్తులు ఆధారంగా అభివృద్ధి చెందిన విజ్ఞానమంతా మానవుని దు:ఖ నివృత్తికి, సుఖ ప్రాప్తికి ఆలంబనంగా నిల్చి సమాజాభ్యున్నతికి తోడ్పడుతూనే ఉంది. సమాజాభివృద్ధిలో ఇంతటి ఉత్కృష్ట పాత్ర పోషిస్తున్న ఈ విజ్ఞానం సామాన్య ప్రజలకు సైతం అందుబాటులోకి తెచ్చి, వారిని చైతన్యవంతులుగా చేసే దిశగా సాగిన ప్రయత్నాలే విజ్ఞాన సర్వస్వాల నిర్మాణానికి బాటలను ఏర్పరచాయి.

పాశ్చాత్య దేశాల్లో క్రీస్తు పూర్వమే ఈ ప్రయత్నాలు జరిగాయి. గ్రీకు మేధావి ప్లాటో రచనల్లోని వివిధ విజ్ఞానాంశాలను సేకరించి అరిస్టాటిల్, స్ప్యూసెవెస్ అనే రచయితలు వాటిని సంక్షిప్త వివరణలతో సమకాలీన ప్రజలకందించే ప్రయత్నం చేశారు. ఈ ప్రయత్నాల ఫలితంగా వచ్చిన రచనలనే ఆ రోజుల్లో ఆచూకి గ్రంథాలుగా వ్యవహరించే వాళ్ళు. ఇవే తదనంతర కాలంలో పాశ్చాత్య దేశాల్లో విస్తరిల్లిన విజ్ఞాన సర్వస్వాలకు పునాదులైనాయి. అలా మొదలైన విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం అనంతర కాలంలో రకరకాల పద్ధతుల్లో రావడం మొదలైనాయి. ఈ పరిస్థితి దాదాపు 16వ శతాబ్దం వరకు కనిపిస్తుంది. 16వ శతాబ్ధంలో ఫ్రాన్సిస్, బేకన్, మాత్యూస్ మర్తిని అనే మేధావులు విశ్వ విజ్ఞాన్నంతా సమీకరించి, వింగడించి, విశ్లేశించి, వివిధ భాగ విభాగాలుగా వర్గీకరించి చూపారు. (చూ.అనుబంధాలు). ఈ విజ్ఞాన వర్గీకరణ, ప్రపంచ విజ్ఞానాన్ని సక్రమంగా అధ్యయనం చేసేందు

కెంతగానో దోహదపడింది. (ఇటువంటి విజ్ఞాన వర్గీకరణలు కూడా మన దేశంలో వచ్చిన దాఖలాలులేవు) అంతేగాదు ఈ విజ్ఞాన వర్గీకరణలు, అధ్యయనాలు ఆ తర్వాత వచ్చిన ఆధునిక విజ్ఞాన సర్వస్వాల రూపు రేఖలనే మార్చి వేసినాయి. విశ్వ విఖ్యాతమైన ఫ్రెంచ్ ఎన్‌సైక్లోపిడియా రూప కల్పనలో బేకన్, మర్తిని చేసిన విజ్ఞాన విభాగాలెంతగానో తోడ్పడినాయని వారు చెప్పుకున్నారు. ఆ తరువాత ఈ మార్గాన్నే అనుసరించి వచ్చిన ఎన్‌సైక్లోపిడియ బ్రిటానికా, ఎన్‌సైక్లోపిడియ అమెరికానా మొదలైన ప్రపంచ ప్రఖ్యాతిగన్న విజ్ఞాన సర్వస్వాలెన్నో ఇంగ్లీషులోనే గాక పాశ్చాత్య దేశ భాషలన్నింటిలోనూ విస్తృతంగా వెలువడినాయి. నేటికి విశ్వ వ్యాప్తమైన విజ్ఞానాన్నంతటిని సమీకరించి ప్రపంచ దేశాలు తమ ప్రజల విజ్ఞానావలోడనానికి అనువుగా విజ్ఞాన సర్వస్వాలను నిర్మిస్తూనే ఉన్నాయి.

విజ్ఞాన సర్వస్వం ప్రయోజనాత్మక సాహిత్యం. నేడు అది ఒక సాహిత్య ప్రక్రియగా కూడా గుర్తింపు పొంది ఉంది. ఏ రచనకైనా ఆశయం, లక్ష్యం, ప్రయోజనాలుంటాయి. ప్రయోజనాత్మక సాహిత్యమైన విజ్ఞాన సర్వస్వానికి కూడా నిర్ధిష్టమైన ఆశయ, లక్ష్య, ప్రయోజనాలున్నాయి.

ఎన్‌సైక్లోపిడియ అనే పద వ్యుత్పత్తిని బట్టి గ్రీకు మేధావులు దానినొక సమగ్ర విజ్ఞాన స్వరూపంగా భావించారు. అయినా ఆయా కాలాల్లో, ఆయా ప్రాంతాల్లో వ్యాప్తి లోనున్న విజ్ఞానాంశాలను సమీకరించడంలోను, క్రోడీకరించి చెప్పే విధానంలోను వచ్చిన తేడాలను బట్టి వాటి రూప, గుణ స్వభావాదుల్లో వైవిధ్యం కనిపిస్తున్నది. ఎన్‌సైక్లోపిడియా నిర్మాణంలోని ఈ వైవిధ్యం కారణంగా వాటికి అనేక నిర్వచనాలేర్పడి ప్రచారంలో ఉన్నాయి.

## నిర్వచనాలు

ఎన్‌సైక్లోపిడియాకు సంబంధించిన నిర్వచనాలు ఇంగ్లీషులో వందల కొలది కనిపిస్తాయి. ఈ నిర్వచనాలను పరిశీలిస్తే ఆయా విజ్ఞాన సర్వస్వాల నిర్మాణంలోని వైవిధ్యం కూడా తెలుస్తుంది.

"Encyclopaedias at encyclia the circle
or course of all doctrines" (EB. VIII.364)

ఇలియట్ చెప్పిన ఈ నిర్వచనం, ఎన్‌సైక్లోపిడియా పద వ్యుత్పత్తికి దగ్గరగా ఉంది. ఇది 16వ శతాబ్దపు ప్రాంతాల్లో పాశ్చాత్య దేశాల్లో వెలువడుతున్న విజ్ఞాన సర్వస్వాలను దృష్టిలో పెట్టుకొని చేసిన నిర్వచనంగా కనిపిస్తుంది.

"The work Encyclopeadia means instruction in the
whole circle of learning" (C.D.E.L.)

విశ్వవిజ్ఞానం సమగ్ర సమాహార స్వరూపం విజ్ఞాన సర్వస్వమని గ్రీకులు భావించిన తీరును ఈ నిర్వచనం తెలిపేదిగా ఉంది.

"A word containing information in all branches
of knowledge usually arranged systematically"

ఈ నిర్వచనం ఆనాటికి విజ్ఞాన సర్వస్వాల నిర్మాణంలో వస్తున్న విషయ విస్తృతిని తెలుపుతున్నది. అంతేగాదు usually arranged systematically అని చెప్పడం వలన ఆనాటికి విజ్ఞాన సర్వస్వల నిర్మాణంలోని పరిణామ దశను సూచిస్తున్నది.

"A work containing information some art or branch of
knowledge arranged systematically" (S.O.E.D.)

some art or branch of knowledge అని చెప్పడం వలన ఆనాటికి వెలువడిన, వెలువడుతున్న ప్రత్యేక విజ్ఞాన సర్వస్వాలను (special Encyclopaedias) ఈ నిర్వచనం సూచిస్తున్నది.

"A comprehensive, often multi volume reference work
containing articles on a wide range of a particular field
usually arranged alphabaticaly" (A.H.D.E.)

ఈ నిర్వచనంలో అనాటికి ప్రచారంలోనున్న విజ్ఞాన సర్వస్వాల్లోని మూడు లక్షణాలు తెలుస్తున్నాయి. (1) సామాన్య విజ్ఞాన సర్వస్వాల్లో ఉండే లక్షణం.

(General Encyclopeadia) అన్నిరంగాలకుచెందిన విజ్ఞానాన్ని సమీకరించి చెప్పేది సామాన్య విజ్ఞాన సర్వస్వం. (Multy volume reference work) (2) articles on a wide range of a perticular field. ప్రత్యేకంగా ఒక శాఖకు సంబంధించిన విజ్ఞానాన్ని సమీకరించి చెప్పేది ప్రత్యేక విజ్ఞాన సర్వస్వం (Special Encyclopaedia). సామాన్య, ప్రత్యేక విజ్ఞాన సర్వస్వాలనేవి, విజ్ఞాన సర్వస్వాల వర్గీకరణలో ముఖ్యమైనవి. వీటిలో విభాగాలు. అంతర్భాగాలు అనేకంగా ఉన్నాయి. (3) విజ్ఞాన సర్వస్వ నిర్మాణ పద్ధతిని సూచించడం. (usually arranged alphabatically)

ఈవిధంగా ఈ నిర్వచనం విజ్ఞాన సర్వస్వాల వర్గీకరణలో ముఖ్య విభాగాలైన సామాన్య, ప్రత్యేక విజ్ఞాన సర్వస్వాల ముఖ్య లక్షణాలను తెలుపుతున్నది. అంతేగాదు విజ్ఞాన సర్వస్వాల నిర్మాణ పద్ధతి (Methodology ని) కూడా ఇది సూచిస్తున్నది. విషయ క్రమ పద్ధతి. అక్షర క్రమ పద్ధతి అనే రెండు ప్రధాన మార్గాల్లో విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం సాగు తుంటుంది. అయితే పాఠకులు ఆయా విషయాలను సులభంగాను, శీఘ్రంగాను తెలుసుకునేందుకు విజ్ఞాన సర్వస్వాలు అక్షర క్రమ పద్ధతిలో నిర్మించడం ఉచితమని కూడా ఈ నిర్వచనం సూచిస్తున్నది.

ఆంగ్ల భాషా సాహిత్యాల ప్రభావంతో మనదేశ భాషల్లో విజ్ఞాన సర్వస్వాలు ఆవిర్భవించాయి. ఆకారణంగా ఇక్కడి భాషల్లో విజ్ఞాన సర్వస్వాల నిర్వచనాలు అంతగా వెలువడలేదు. దీనికి సంబంధించిన నిర్వచనాలు ఆంగ్లంలో అధికంగా వచ్చి ఉండటం కూడా ఒక కారణం కావచ్చును. అయినా మన మేధావులు కూడా వీటిని గురించి దీర్ఘంగా ఆలోచించారు. పరిశీలించారు. పరిశోధనలు చేశారు. వాటి ఫలితంగా తెలుగులో వచ్చిన విజ్ఞాన సర్వస్వాల రూప గుణ స్వభావాదులకు అనుగుణంగా తెలగులోను కొన్ని నిర్వచనాలు వెలువడినాయి.

**"విజ్ఞానం ఆనందం, విజ్ఞానం పురుషార్థం విజ్ఞానం పరమార్థం,**
**విజ్ఞానం పరబ్రహ్మం విజ్ఞాన తరంగాలు విశ్వ విలాసాలు శాస్త్రజ్ఞులు,**
**కవులు, గాయకులు, శిల్పులు మంత్రులు, యోధులు,**

**మతాధిపతులు, త్యాగ మూర్తులు, కార్మికులు,కర్షకులు
మొదలైన విజ్ఞానోపాసకులు, దేశ కాల పాత్రావరణకు అతీతమైన
విజ్ఞానారాధ నమూన మానవ ధర్మాభ్యుదయానికి చేస్తుండే
విధానాన్ని విజ్ఞాన ఉదంతం అనంత ముఖముల
విశదం చేస్తున్నది"** (ఆం.వి.స.1 పీఠిక)

విజ్ఞాన సర్వస్వాలను గూర్చి ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ పీఠికలో కొమర్రాజు వారు చెప్పిన అభిప్రాయమిది. ఇందులో విజ్ఞాన సర్వస్వాల ఆశయ ప్రయోజనాలు కూడా ఇమిడి ఉన్నాయి. విజ్ఞాన తరంగాలు విశ్వవిలాసాలు అని చెప్పడం వలన విజ్ఞాన సర్వస్వం విశ్వ విజ్ఞానానికి ఆకరంగా ఉండాలని, అందులో ప్రపంచంలోని వస్తువులు, వ్యక్తులు, ప్రదేశాలు మొదలైనవన్నీ చోటు చేసుకోవాలని చెప్పినట్లయినది. "విజ్ఞానం ఆనందం…" అనే విధంగా సాగిన మాటల్లో విజ్ఞాన సర్వస్వం విశిష్టత, దాని ప్రయోజనం, అది సమాజ సౌభాగ్యానికి, మానవాభ్యున్నతికి తోడ్పడే తీరు తెల్లమౌతున్నాయి.

**"మానవుని మనోవికాసానికి, నిత్య జీవితానికి అవసరమ్యే కళా
శాస్త్రాల, ప్రకృతి శాస్త్రాల ఆవృత్తియే విజ్ఞాన సర్వస్వం"**
(సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం-1. నివేదన)

ఖండవల్లి లక్ష్మీరంజనం గారు విజ్ఞాన సర్వస్వాలకు చెప్పిన పై నిర్వచనం కొండ వైశాల్యాన్ని అద్దంలో చూపినట్లున్నా, కొంత సమగ్రతను సంతరించుకున్నట్లుగానే కనిపిస్తుంది. ఎందుకంటే విశ్వ విజ్ఞానమంతా అటు కళా శాస్త్రాల్లోనో లేదా ఇటు ప్రకృతి శాస్త్రాల్లోనో అంతర్భవిస్తుంది. మానవుని సౌభాగ్యానికి, అభ్యున్నతికి ఇవి రెండు దోహద పడుతున్నాయి. ఈ విధంగా ఈ నిర్వచనంలో విజ్ఞాన సర్వస్వాల ఆశయం, లక్ష్యం, ప్రయోజనాలు కూడా వ్యక్తమౌతున్నాయి. కానీ విజ్ఞానాంశాల కూర్పు, నిర్మాణ పద్ధతి ఈ నిర్వచనంలో కనుపించదు.

**"సమాజ శాస్త్రాలు, ప్రకృతి శాస్త్రాలు, మానవ సంస్కృతీ విభాగాలకు
సంబంధించిన విజ్ఞానమంతా, అక్షర క్రమంలో ఒక
విజ్ఞాన సర్వస్వంలో రూపుదిద్దుకోవాలి"** (సం.ఆం.కో -I నివేదిక)

అని కొంత మంది పండితులు అభిప్రాయపడినారు. మరి కొంత మంది మేధావులు నిర్వచనాల రూపంలో గాక తమ అభిప్రాయాలను విజ్ఞాన సర్వస్వాల కుండవలసిన లక్షణాలుగా చెప్పారు.

ఆదర్శ ప్రాయమైన ఒక విజ్ఞాన సర్వస్వంలో ఉండదగిన లక్షణాలను హెచ్.జె. వాల్సు ఈ విధంగా చెప్పాడు.

1. విజ్ఞాన సర్వస్వమనే గ్రంథం ఎన్నో సంపుటాలుగా వెలువడాలి.
2. ఎక్కువగా వెదుక్కొనే అవసరం లేకుండా విషయాలు సులభ గ్రాహ్యంగా ఉండాలి.
3. భాష సులభమై, సుగ్రాహ్యమై ఉండాలి.
4. సాంఘిక వ్యవస్థ మూల భావాలు, విజ్ఞానం అన్ని రంగాలకు చెందిన అకర సూత్రాలు ముఖ్యాంశాలుగా ఉండాలి.
5. మనం నివసించే విశ్వాన్ని గురించి, నిర్దిష్టమై, సాధ్యమైనంత వివరణాత్మకమైన విజ్ఞానాన్ని సమకూర్చాలి.
6. ప్రపంచ దేశాల సామాన్య చరిత్రలను చేర్చాలి.
7. విజ్ఞానానికి మూలాధారమైన ప్రాతిపదిక సామాగ్రి ఉండాలి.
8. విజ్ఞానాంశాల క్రోడీకరణ విశ్వాసనీయమై క్రమ పద్ధతిని పాటించాలి.
9. సమాచార సమీకరణకు ఆకరాలైన పరామర్శ గ్రంథాలను చూపాలి.

ఈ విధంగా విజ్ఞాన సర్వస్వాల రూప, గుణ, స్వాభావాదులను బట్టి రకరకాల నిర్వచనాలు, అభిప్రాయాలు సాహిత్య లోకంలో బహుళ ప్రచారంలో ఉన్నాయి. వీటన్నింటిని పరిశీలించిన మీదట విజ్ఞాన సర్వస్వాన్ని గూర్చిన మరింత సమగ్రత, స్పష్టత కోసం విజ్ఞాన సర్వస్వమంటే..

"చరాచర సృష్టిలోని వివిధ జీవుల. పదార్థాల, ప్రదేశాదుల విషయ సంఘాతాన్నంతటిని, ప్రమాణ పూర్వకంగా సంగ్రహించి, ఏకత్ర సంఘటించి, క్రమ పద్ధతిలో ప్రజలకందించడమే విజ్ఞాన సర్వస్వం" అని నిర్వచించ వచ్చును.

ఈ నిర్వచనం విజ్ఞాన సర్వస్వాల, ముఖ్యంగా సామాన్య విజ్ఞాన సర్వస్వాల కుండవలసిన ప్రధాన లక్షణాలను స్పష్టంగా చెబుతున్నది. అంతేగాదు "విజ్ఞాన భాండాగారాన్ని అనంతర తరాల వారికందించడం కూడా విజ్ఞాన

సర్వస్వాల లక్ష్యమే" అని చెప్పిన ఫ్రెంచి విజ్ఞానసర్వస్వాల సంపాదకుల్లో ఒకరైన డెన్నీస్ డిడిరో అభిప్రాయాన్ని కూడా వ్యక్త పరుస్తున్నది.

ఇలాంటివే ఇంగ్లీషులోను, తెలుగులోను రకరకాల నిర్వచనాలు అభిప్రాయాలు వందల కొలది వెలువడి ఉన్నాయి. పాఠకుల అవగాహన కోసం ఇక్కడ కొన్ని నిర్వచనాలు, అభిప్రాయాలను మాత్రమే వివరించడం జరిగింది. పైన వివరించిన వాటిలో చివరి నిర్వచనం నేడు వెలువడుతున్న విజ్ఞాన సర్వస్వాలను కొంత వరకైనా రూపించేదిగా కనిపిస్తున్నది. ఇవన్నీ ఆయా కాలాల్లో ఆయా ప్రాంతాల్లో వచ్చిన విజ్ఞాన సర్వస్వాల రూప, గుణ స్వభావాదులను రూపు కట్టిస్తాయే గాని, ఒక సర్వ సమగ్రమైన విజ్ఞాన సర్వస్వాన్ని వ్యక్తీకరించేందుకు సమర్థములు గావు. అందుకే నేటికి కొత్త కొత్త నిర్వచనాలు వెలువడుతూనే ఉన్నాయి. అందుకు కారణం లేకపోలేదు. విజ్ఞాన సర్వస్వాలెప్పుడూ సర్వ సమగ్రాలు కావు. ఎంత చెప్పినా ఇంకా కొంత మిగిలే ఉంటుంది. ఒక వేళ అంతా చెప్పామనుకున్నా, అది కొంత కాలానికి పాతబడి కొత్త విజ్ఞానం వస్తూనే ఉంటుంది. అందువల్ల విజ్ఞాన సర్వస్వాల విశ్వ రూపాన్ని ఒక చిన్న సూత్రంలో నిబంధించి నిర్వచించడం అంత సులభం కాకపోవచ్చును. నిర్వచనాల మాట అటుంచినా, పట్టికలుగా ఇచ్చిన విజ్ఞాన సర్వస్వాల లక్షణాలు కూడా కాలగతిలో పాతపడిపోయి సమగ్రతను సంతరించుకోలేక పోతున్నాయి. ఈదృష్టితో చూస్తే విజ్ఞాన సర్వస్వాల నిర్మాణంలో వాటికుండవలసిన లక్షణాలను ఈ క్రింది విధంగా వింగడించ వచ్చును.

1. విశ్వవిజ్ఞానాన్నంతటిని లేదా ఒక అంశానికి చెందిన అన్ని అంశాలను లేదా ఒక ప్రాంతానికి చెందిన విజ్ఞానాన్ని ప్రమాణ పూర్వకంగా సమీకరించాలి.

2. విజ్ఞానాంశాల సమీకరణలో సామాజిక వ్యవస్థ మూల భావాలు విధిగా ఉండాలి

3. అన్ని సిద్ధాంతాలకు, శాస్త్రాలకు సంబంధించిన ఆకర సూత్రాలు ముఖ్యాంశాలు చోటు చేసుకోవాలి.

4. విజ్ఞానాన్ని ప్రణాళికానుగుణంగా నిర్దుష్టమైన తీరుతో సమీకరించి, వీలైనంత వివరణాత్మకంగా పొందుపరచాలి.

5. విషయ క్రోడీకరణ ప్రణాళికానుగుణమై, క్రమపద్ధతిలో ఉండాలి.

6. విజ్ఞానాంశాల ప్రతిపాదన వ్యాసరూపంలో (సంక్షిప్త/విస్తృత) నిర్దుష్టంగా సాగాలి.

7. పాఠకులకు అవసరమైన అనుబంధ సమాచారం లేదా అధిక సమాచారానికి సంబంధించిన అంశాలను అనుబంధాల్లో చూపాలి. ఒకవేళ అటువంటి సమాచారం ఆ గ్రంథంలోనే దొరికే వీలుంటే పరస్పర నిర్దేశకాల (Cross references) ద్వారా సూచించాలి.

8. అవసరమైన చోట్ల విజ్ఞాన సాధనాలను (Knowledge Aids) సమకూర్చు కోవాలి. (బొమ్మలు, ఫొటోలు, పటాలు, పట్టికలు మొదలైనవి)

9. విషయ వివరణలు సరళంగా సుగ్రాహ్యంగా ఉండాలి

10. రచనా శైలి గ్రంథం సాంతం ఒకే విధంగా సాగాలి.

11. విజ్ఞాన సర్వస్వం అనేక సంపుటాలుగా ఉన్నప్పుడు అవి వరుస క్రమంలో వెలువడాలి.

12. వ్యాసాను క్రమణిక లేదా పదాను క్రమణిక లేదా రెండూగాని ప్రతి సంపుటంలోను పొందుపర్చాలి.

13. సమాచార సేకరణకు మూలాధారాలైన ప్రాతిపదిక సామాగ్రిని, పరామర్శ గ్రంథాలను అనుబంధాల్లో చూపాలి.

14. కొత్తగా వస్తుండే విజ్ఞానాంశాలను ఎప్పటికప్పుడు పరిశిష్ట గ్రంథాల్లో పొందు పర్చడం ద్వారా విజ్ఞాన సర్వస్వం పునర్నవీకృతం అవుతుండాలి.

సమగ్రమై, ఆదర్శప్రాయమైన ఒక విజ్ఞాన సర్వస్వంలో పైన చెప్పినవన్నీ కేవలం ఆంతరంగికమైన లక్షణాలు మాత్రమే. వీటన్నిటిని సమకూర్చుకోవాలంటే బాహిరమైనకొన్ని ఒనరులు కూడా అవసరం. వాటిని మనం ఈ విధంగా వింగడించుకో వచ్చును.

1. మనం నిర్మించబోయే విజ్ఞాన సర్వస్వం రూప, గుణ స్వభావాదులకు అనుగుణంగా ప్రణాళికలు రూపకల్పన చేయగల నిపుణులు.

2. ప్రపంచ పర్యాప్తమైన విజ్ఞానాన్ని ప్రమాణ పూర్వకంగా సమీకరించేందుకు, విజ్ఞాన సాధనాలను సక్రమంగా సమకూర్చుకునేందుకు ఆయా రంగాల్లో కృషి చేయగల వ్యక్తులు.

3. విజ్ఞానాంశాలను, ముఖ్యంగా శాస్త్ర సాంకేతిక విజ్ఞానాన్ని పాఠకుల అవగాహనకు వీలుగా సులభ శైలిలో చెప్పగల రచయితలు.

4. ప్రణాళిక అనుగుణంగా విజ్ఞానాంశాలను, విజ్ఞాన సాధనాలను చక్కగా నినబంధించగల (Setting and editing) సంపాదకులు.

5. పాఠకులకు తనకు కావాలసిన అంశం శీఘ్రంగాను, సులభంగాను పొందేందుకు వీలుగా విషయాలను చక్కగా క్రోడీకరించ గల సంగ్రాహకులు.

6. అన్ని హంగులతో సర్వ సంపన్నంగా నిర్మాణమయ్యే ఒక విజ్ఞాన సర్వస్వాన్ని సకాలంలో ప్రజల ముందుకు తెచ్చేందుకు అవసరమైన కార్యాలయాలు, సిబ్బంది.

7. వీటి నిర్వహణకు అవసరమైన ఆర్థిక ఒనరులు

8. ముద్రణ ప్రతి తయారైన వెంటనే దాన్ని సర్వాంగ సుందరంగా ముద్రించి సకాలంలో అందించేందుకు తగిన యంత్ర సామాగ్రి. నిపుణులైన కార్మికులు.

9. ఈ కార్యభారన్నంతా తమ భుజాలపైన వేసుకొని దీక్షా దక్షతలతో నిర్వహించగల వ్యక్తులు లేదా సంస్థలు.

ఇలా అన్ని హంగులు సమకూడినప్పుడే ఒక ఆదర్శ ప్రాయమైన విజ్ఞాన సర్వస్వం, సర్వ సంపన్నమై, సర్వాంగ సుందరమై, సకాలంలో ప్రజల ముందుకు వచ్చేందుకు అవకాశముంటుంది. ఇలాంటి విజ్ఞాన సర్వస్వాలన్నీ సమిష్టికృషి ఫలితాలుగానే ఉంటాయి. తెలుగులో ఇటువంటి ఏర్పాట్లు అతి

ఎక్కువగా ఉన్న కారణంగా ఆదర్శప్రాయమైన విజ్ఞాన సర్వస్వాలు మనకు అతి స్వల్పంగానే దొరుకుతున్నాయి. విజ్ఞాన ప్రసార సాధనాలైన ఈ గ్రంథాలు ఏదో ఒక రూపంలో ప్రజలకు అందుబాటు లోనికి రావలసిన అవసరం ఎంతైనా ఉంది, కాబట్టి వ్యక్తి ప్రజ్ఞాధీనాలైన (ఒక రచయిత చేతి మీదుగా నిర్మించిన విజ్ఞాన సర్వసం) రకరకాల విజ్ఞాన సర్వస్వాలు తెలుగులోను వెలువడి నన్నాయి.

**ఆశయం-ప్రయోజనం**

> **"ప్రపంచ వీధుల్లో వికీర్ణమై యున్న విజ్ఞానాన్ని రాశి చేసి, సమకాలికులకు పరిచయం చేయడమే విజ్ఞాన సర్వస్వపు టాదర్శం.**
> **అనంతర తరాలవారికీ జ్ఞాన భాండాగారాన్ని అందించడం కూడా దీని లక్ష్యమే"** (సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం-1 పీఠిక)

విజ్ఞాన సర్వస్వం ఆశయం, లక్ష్యాలను గురించి ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వాల సంపాదకుల్లో ముఖ్యుడైన డెన్నిస్ డిడిరో చెప్పిన మాటలివి. ప్రపంచ విజ్ఞానాన్ని ప్రజలకు అందుబాటులోనికి తేవడం విజ్ఞాన సర్వస్వాల ఆశయమని అభిప్రాయ పడిన డిడిరో, దాని లక్ష్యాన్ని కూడా పై మాటల్లో వ్యక్త పర్చడం జరిగింది. కొత్తగా వస్తున్న విజ్ఞానాన్ని ఎప్పటికప్పుడు పరిశిష్ట గ్రంథాల్లో పొందుపర్చడం ద్వారా విజ్ఞాన సర్వస్వం పునర్నవీకృతం చేయబడి భావితరాల విజ్ఞానావసరాలను కూడా తీర్చే విధంగా ఉండాలని, అదే దాని లక్ష్యమని డిడిరో చెప్పిన పై మాటల వలన తెలుస్తున్నది.

> **'....ఇట్లు చేయడం వలన (విజ్ఞాన సరస్వాల నిర్మాణం వలన) పూర్వ పూర్వ తరాల వారి విజ్ఞానం ఉత్తరోత్తర తరాల వారికి అందుబాటులోనికి వస్తుంది. లేకుంటే అది నష్టమయ్యే ప్రమాదం ఉంది. మన సంతతి వారు విజ్ఞానావలోడనంతో జ్ఞానవంతులు సుఖవంతులు కావడం కూడా మనలక్ష్యమే"**
> (సం.ఆం.వి.కో. 1 పీఠిక)

విజ్ఞాన సముపార్జనకు సాధనమైన విజ్ఞాన సర్వస్వం అజ్ఞానాంధకారంలోనున్న ప్రజల్లో జ్ఞాన జ్యోతులు వెలిగించడం ద్వారా వారిని

చైతన్యవంతులుగా చేస్తుంది. తద్వారా మానవుడు సుఖ సౌభాగ్యాలతో జీవయాత్ర సాగించేందుకు అవకాశముంటుంది. అని డిడిరో అభిప్రాయం. అంటే.. తరతరాల విజ్ఞానాన్ని మానవులకు చేరువ చేయడం విజ్ఞాన సర్వస్వాల ఆశయమైతే ఆ విజ్ఞాన సముపార్జన ద్వారా మానవుడు సుఖవంతుడు, సంపద్వంతుడు కావడం వాటి ప్రయోజనమన్నమాట.

ఈ ప్రయోజనాన్ని ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వాలు నిరూపించాయి. ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వాల ద్వారా చైతన్యం పొందిన ఆదేశ ప్రజలు, తమ కోర్కెల సాధనకు జరిపిన పోరు 'ఫ్రెంచి విప్లం'గా ప్రపంచ చరిత్రలో నిలిచి పోయింది. ఫ్రెంచి రాజకీయ విప్లవ శుభోదయ కాలంలో నిర్మించి ప్రకటించిన "ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వం ద్వారా, ఫ్రాన్సు దేశమే గాక, ఐరోపా ఖండమంతా గజగజ వణికి పోయిందన్నది వింతగా కనిపించింది". (రత్నమాలిక పు. 189) అన్న కట్ట మంచి రామలింగారెడ్డిగారి మాటలు ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వం ఆదేశ ప్రజలపైనే గాక, చుట్టు పక్కల ప్రజలపైన కూడా ఎంత ప్రభావం చూపిందో వ్యక్తం చేస్తున్నాయి.

డిడిరో పైన చెప్పిన తన మాటల్లో.. పూర్వపూర్వ తరాలవారి విజ్ఞానం ఉత్తరోత్తర తరాల వారికి అందుబాటులోకి తేవడం ఎంతైనా అవసరం. లేకుంటే అది నష్టమయ్యే ప్రమాదముందని హెచ్చరించాడు. ఈ హెచ్చరికను ముఖ్యంగా మన మేధావులు కూడా గమనించవలసి ఉంది. వేదాలు, పురాణేతిహాసాలు, కావ్యాదుల్లో ఆయా కాలాల్లోని విజ్ఞానం చోటు చేసుకొని ఉంది. ఆ విజ్ఞానాన్నంతటిని ఒక పద్ధతి ప్రకారం ప్రజలకు అందుబాటులోనికి తెచ్చే ప్రయత్నాలు పూర్వ కాలంలో చేసిన దాఖలాలు కనిపించవు. ఆ కారణంగా విజ్ఞాన రంగంలో మనకు జరుగవలసిన ప్రమాదం జరిగి పోయింది. మన సాహిత్య రంగంలో విజ్ఞాన సర్వస్వం అనే ప్రక్రియకు చోటు లేకుండా పోయింది. మన జాతి సంస్కృతీ, సంప్రదాయాలు కూడా తెలయని స్థితిలో నేటి మన యువత ఉంది.

ఈ విషయంలో పాశ్చాత్య దేశాలు చాలా ముందున్నాయి. పూర్వ తరాలవారి విజ్ఞానం భావి తరాల వారికి అందించడంలో పాశ్చాత్యులు

క్రీస్తుకు పూర్వమే ప్రయత్నాలు చేసినట్లు ఆదేశ సాహిత్య చరిత్రలు చెబుతున్నాయి. గ్రీకు మేధావి ప్లేటో (300బి.సి) రచనల్లోని విజ్ఞానాంశాలను సేకరించి, క్రమపద్ధతిలో క్రోడీకరించి స్ప్యూసెవిస్, అరిస్టాటిల్ అనే రచయితలు వాటికి చక్కని వివరణలు సమకూర్చి తమ ప్రజలకందించే ప్రయత్నాలు చేశారు. అలా జరిగిన ప్రయత్నాల ఫలితంగా ఆయా కాలాల్లోని విజ్ఞానం సామాన్య ప్రజలకు సైతం అందుబాటులోనికి వచ్చింది. ఆ కారణంగా చైతన్య వంతమైన ఆ దేశాలు విజ్ఞాన రంగంలో నేటికి ముందున్నాయి. ఇక్కడ సాగిన ప్రసార విజ్ఞాన ప్రస్తానంలో అనున్యూనత (continuvity) కనిపిస్తుంది. విజ్ఞాన సర్వస్వాల చరిత్ర నిర్మాణానికి అది వేదికగా నిలుస్తున్నది.

మన విజ్ఞాన ప్రసార ప్రస్థానం కూడా వేదాల నుంచే ఆరంభమైంది.వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాల్లో ఆయా కాలాల్లో విస్తరిల్లిన విజ్ఞానం పర్యాప్తమై ఉంది. కాని ఆ విజ్ఞానాన్నంతా సామాన్య ప్రజలకు అందుబాటులోనికి తెచ్చే ప్రయత్నాలు జరుగని కారణంగా మన విజ్ఞాన ప్రసార ప్రస్థానంలో ఒక పెద్ద అఘాతం (Gap) ఏర్పడింది. అకారణంగా నేటి మన యువత విజ్ఞాన రంగంలో ఎన్నో మెట్లెక్కి అగ్రస్థానంలో నిలుస్తున్నా, మన జాతి సంస్కృతీ సంప్రదాయాలు తెలయని స్థితిలో ఉంటున్నది.

"Let knowledge grow from more to more
And thus be human life enriched" (E.B. Inner Title page)

ఎన్‌సైక్లొపిడియ బ్రిటానికాలోని ఈ వాక్యాల్లో విజ్ఞాన సర్వస్వాల ఆశయం, ప్రయోజనం చెప్పడం జరిగింది. విజ్ఞానం శాఖోపశాఖలుగా విస్తరిల్లాలనేది వాటి ఆశయం. తద్వారా మానవ జీవితం సుఖవంతం సంపద్వంతం కావడం వాటి ప్రయోజనం.

ఇవే అభిప్రాయాలు మహాభారతాన్ని గురించి వ్యాస మహర్షి ఏనాడో చెప్పడం జరిగింది. మహాభారతం ఆశయం, లక్ష్యం, ప్రయోజనాలను వ్యాసుడు చెప్పిన మాటలకు ఇవి ఛాయ రూపాలా అన్నట్లుగా ఉన్నాయి. ఈ విషయాలు మహాభారతం-విజ్ఞాన సర్వస్వం అనే శీర్షిక క్రింద వివరించడం జరిగింది.

ఆంధ్ర విజ్ఞాన సర్వస్వానికి ప్రయోజనం యావదాంధ్రులకు అనుభవసిద్ధమైన సంస్కార రూపమున విశ్వ విజ్ఞాన అనుభవాన్ని సులభం చేయడమై ఉంది. దేశ, కాల, ప్రాంత, మత భాషాది ఆవరణాలందు సంవర్ధితాలైన వివిధ విజ్ఞానాంశాలను విజ్ఞానామృత మధ నానికి సమర్పణ చేయడం విజ్ఞాన సర్వస్వాలకు పరమార్థం. ప్రవృత్తి యందు గుణ దోష నిర్ణయాలు, దేశ కాల పాత్రావరణల్లో సంకుచితమైన భావ రూపాలు విజ్ఞాన సాధనమున విశాలమై ధర్మాభ్యుదయం కలుగుతున్నది. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం ఈ పరమార్థాన్ని విజ్ఞాన సంపన్నుల సహాయమున సమకూర్చగలదు" (ఆం.వి.స.2 పీఠిక)

ఆంధ్ర విజ్ఞాన సర్వస్వాన్ని గురించి కొమర్రాజు గారి అభిప్రాయమిది. ఇందులో యావదాంధ్రులకు విశ్వ విజ్ఞానాన్ని సులభంగా అందించడం ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం ఆశయమని, తద్వారా సమాజంలో ధర్మాభ్యుదయం కలిగి, మానవ జీవితం సుఖ సంతోషాలతో వర్ధిల్లడం దాని ప్రయోజనమని కొమర్రాజు గారు చెప్పడం జరిగింది.

**"విజ్ఞాన సర్వస్వం ప్రయోజనాత్మక సాహిత్యం జీవితానికి ఆనందాన్ని కలిగించేందుకు ఇది ఆధార భూత మైనది".**
**"విశ్వ విజ్ఞానాన్ని సంక్షేమ రూపంలో ఆంధ్ర కుటీర ప్రాంగణానికి కొని వచ్చుటే ఈ కోశం లక్ష్యం"** (సం.ఆ.వి.కో-1 నివేదన)

సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాల నిర్మాతల్లో ముఖ్యులైన ఖండవల్లి లక్ష్మీరంజనం గారు చెప్పిన మాటలివి. ప్రపంచ విజ్ఞానాన్ని సంక్షిప్త రూపంలో ఆంధ్ర ప్రజలకు అందించడం సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాల లక్ష్యమని, తద్వారా ప్రజలు ఆనందంగా జీవించేందుకు అవకాశం కలుగుతుందని ఆయన అభిప్రాయపడ్డాడు.

విజ్ఞాన దీపిక (విషయ క్రమ పద్ధతిలో వచ్చిన విజ్ఞాన సర్వస్వం)కు ఉపోద్ఘాతం వ్రాస్తూ డాక్టర్. బెజవాడ గోపాలరెడ్డి గారు.. "విజ్ఞాన సర్వస్వాలను ఉపయోగించుకోవడం వల్ల పౌరులు ప్రపంచ విజ్ఞానాన్ని పొందిన వారై,

భావి ప్రపంచాన్ని సరియైన దిశలో నడప గలిగే వారౌతారు" అని ఆకాంక్షించారు. విజ్ఞాన సర్వస్వాల ఉపయోగాన్ని గూర్చి గోపాలరెడ్డి గారు చెప్పిన అభిప్రాయమిది. విజ్ఞాన సర్వస్వాల ద్వారా జ్ఞాన వంతులైన పౌరులు తాము సుఖ సంతోషాలతో ఉండటమే గాక భావి ప్రపంచానికి చక్కని దిశా నిర్దేశం చేయ గలిగిన శక్తి మంతులుగా కూడా ఉంటారని చెప్పడంలో కొంత విశిష్టత కనిపిస్తుంది.

ఈ విధంగా విజ్ఞాన సర్వస్వాల ఆశయాలను, లక్ష్యాలను, ప్రయోజనాలను ప్రపంచ మేధావులు రకరకాకలుగా చెప్పడం జరిగింది. ఎవరెన్ని విధాలుగా చెప్పినా విజ్ఞాన సర్వస్వాల ఆశయం, లక్ష్యం, విజ్ఞానం వ్యాప్తి చెందడం అనీ, వాటి ప్రయోజనం మానవులు సుఖవంతులు, సంపద్వంతులు కావడం అని తెలుస్తున్నది. ఇవి ప్రధానమైనవి. అయితే నేడు వెలువడుతున్న రకరకాల విజ్ఞాన సర్వస్వాలను దృష్టిలో పెట్టుకొని, మరికొంత స్పష్టత కోసం వాటి ప్రయోజనాలను ఈ విధంగా విశ్లేషించి చూపవచ్చును.

1. విశ్వ విజ్ఞానాన్ని ఏకత్ర సంఘటించచడం చెప్పడం వలన ఆయా విషయాలు పాఠకులకు అందుబాటులోకి రావడం.

2. విజ్ఞానాంశాలన్నీ ఒక క్రమ పద్ధతిలో క్రోడీకరించబడి ఉండటం వలన, పాఠకుడు తనకు కావాలసిన విషయాలను శీఘ్రంగాను, సులభంగాను పొందేందుకు వీలు కలగడం.

3. ప్రపంచంలోని వివిధ జాతుల, దేశాల చరిత్రలు, మహాత్ముల జీవిత చరిత్రలు, సామాజిక చరిత్రలు, నాగరికతలు, సంస్కృతీ సంప్రదాయాలు పరిచయం కావడం.

4. ప్రాపంచిక విషయాలు తెలియడం ద్వారా ప్రజల్లో స్నేహ సౌభ్రాతృత్వాలు పెరిగి, వసుధైక కుటుంబ భావనకు దారి తీయడం.

5. వివిధ సంస్కృతుల విషయ పరిజ్ఞానం పొందిన ప్రజల్లో పరస్పరం ప్రేమానురాగాలు పెంపొందడం.

6. విజ్ఞాన సముపార్జన ద్వారా ప్రజల్లో మూఢ విశ్వాసాలు తగ్గి, సమాజం

చైతన్యవంతం కావడం. తద్వారా ప్రజలు సుఖవంతులు, సంపద్వంతులు కావడం.

7. చైతన్యవంతులైన పౌరులు తమకు తాము చక్కబడటమే గాక భావి ప్రపంచానికి సరియైన దిశానిర్దేశం చేయగలిగే వారు కావడం.

8. విజ్ఞాన సర్వస్వాల అధ్యయనం వలన వ్యక్తిత్వం, మానవత్వం వికాసాన్ని పొందడం.

9. విశ్వ విజ్ఞానంపై అవగాహన కలిగి, విజ్ఞానాన్ని సమాజ శ్రేయస్సు కోసం వినియోగించేందుకు ప్రేరణ కలగడం.

విజ్ఞాన సర్వస్వాలను సక్రమంగా ఉపయోగించుకోవడం వలన, ఇలాంటివే మరెన్నో ప్రయోజనాలు మనకు కలుగుతాయనడంలో సందేహం లేదు.



# సాహిత్యం - విజ్ఞానం

విజ్ఞాన సర్వస్వాలు ముఖ్యంగా విజ్ఞాన ప్రసార సాధనాలు. విజ్ఞాన సర్వస్వం సాహిత్య ప్రక్రియగా కూడా నేడు గుర్తింపు పొంది ఉంది. అయితే విజ్ఞాన సర్వస్వం ఒక సాహిత్య ప్రక్రియగా ఆవిర్భవించక పూర్వం విజ్ఞానం ఏ రూపంలో ఉండేది? వారసత్వ సంపదగా ఒక తరం నుంచి మరో తరానికి అందుతూ వస్తున్న ఈ విజ్ఞానం ఎలా ప్రసారం పొందుతూ వచ్చింది? ఆనాటి మన విజ్ఞాన ప్రసార సాధనాలేమిటి? మొదలైన అనేకానేక ప్రశ్నలకు సమాధానాలు వెదుక్కోగల్గితే ప్రాచీన కాలంలో మన విజ్ఞానమంతా ఆయా కాలాల్లో ప్రచారంలోనున్న వాఙ్మయం (మౌఖిక/లేఖక)లో పర్యాప్తమై ఉండేదనే విషయం తెలుస్తుంది. అదే గాక అవే ఆనాడు మన విజ్ఞాన ప్రసార సాధనాలుగా కూడా ఉపయోగ పడ్డాయనే విషయం తెలుస్తుంది.

దేశ కాలాలకు అతీతంగా సమాజం సాహిత్యంలో ప్రతిబింబిస్తుందని సాహితీవేత్తల అభిప్రాయం. విజ్ఞానం కూడా సమాజ సంబంధమైనదే కాబట్టి, అది కూడా సాహిత్యంలో ప్రతిఫలించడం సహజం. అయితే సాహిత్యంలో ప్రతిఫలించే నిగూఢమైన వివిధ విజ్ఞానాంశాలు పండితులకు మాత్రమే అందుబాటులో ఉంటాయి కానీ సామాన్యులకు దగ్గరయ్యే అవకాశాలు లేవు.పండిత ప్రముఖులైన వారు అలాంటి విజ్ఞానాంశాలనన్నిటిని ఏర్చికూర్చి తగిన వివరణలతో ఒక క్రమ పద్ధతిలో చెప్పినప్పుడే ఆయా అంశాలు

సామాన్యులు కూడా తెలుసుకునేందుకు వీలేర్పడుతుంది. అలాంటి ప్రయత్నాలు జరిగినప్పుడే విజ్ఞానం విస్తృత వ్యాప్తినొంది, మానవాభ్యున్నతికి బాటలు వేస్తుంది. ఈ అవసరాన్ని గమనించిన పాశ్చాత్య పండితులు దాదాపు 2500 సంవత్సరాలకు పూర్వమే (300బి.సీ) ఈ ప్రయత్నాలు చేసినట్లుగా పాశ్చాత్య సాహిత్య చరిత్రలు చెబుతున్నాయి. ఈ విషయాలన్నీ మొదట ప్రకరణంలో చెప్పడం జరిగింది.

ప్రపంచం కళ్లు తెరవక ముందే మన దేశంలో వేదాలు పుట్టాయని, అవి విజ్ఞాన భాండాగారాలని మనం చెప్పుకుంటున్నాం. వేద వాఙ్మయాన్ని అధ్యయనం చేసిన పాశ్చాత్య పండితులు కూడా అవి విజ్ఞాన గనులనడం వాస్తవమేనని ఒప్పుకుంటున్నారు.

"... that literature opens to us a
chapter in what has been
called the education of human
race, to which we can find
no paralal any where else"

అని వేద వాఙ్మయాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసిన మాక్సుముల్లర్ తన Heritage of Inolia అనే గ్రంథంలో వైదిక వాఙ్మయ ప్రాశస్త్యాన్ని ఉగ్గడించాడు. (మన సంస్కృతి, మన సాహితి పు. 3)

పురాణాలను సునిశితంగా పరిశీలించిన శ్రీహరి ప్రసాద శాస్త్రిగారు, అష్టాదశ పురాణాలను ఆరు వర్గాలుగా విభాగించాడు. వాటిలో విజ్ఞానాంశాలను అధికంగా ప్రతిపాదించిన గరుడ, అగ్ని, నారద పురాణాలను విజ్ఞాన సర్వస్వాల్లాంటి పురాణాలు అనే వర్గంలో చేర్చాడు. H.H. విల్సన్ అనే ఆంగ్ల పండితుడు అగ్ని పురాణాన్ని విజ్ఞాన సర్వస్వంగానే పేర్కొన్నాడు. (విష్ణుపురాణం-ప్రి ఫేస్ XXXVII )

మహా భారతంలోని వివిధ విజ్ఞానాంశాల ప్రతిపాదన దృష్ట్యా అది ఒక విజ్ఞాన కోశమని పండితులు అభిప్రాయ పడుతున్నారు. అంతెందుకు మహా భారత కర్త అయిన వ్యాస మహర్షియే మహాభారత ప్రశస్తినుగ్గడిస్తూ..

**"యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్ క్వచిత్"** అని చెప్పడం వలన దానికొక విజ్ఞాన సర్వస్వంగా ఆయన భావించినట్లు తెలుస్తున్నది.

వేద వాఙ్మయమంతా విజ్ఞానమయం. విద్ (to know) అనే ధాతువు నుండే వేద శబ్దం పుట్టింది. దీనిని బట్టి వేదమంటేనే విజ్ఞానమని తెలుస్తున్నది. నిత్యసత్య వ్రతులు, ఐహికాముష్మిక విజ్ఞాన ధనులైన ఆర్షమహర్షులు, తాము కని, విని, సత్యాలుగా భావించి వర్ణించిన విజ్ఞానాంశాలెన్నో వేదాల్లో చోటు చేసుకున్నాయి. ఆర్యావర్తంలోని నదులు, పర్వతాలు,జనపదాలు, అరణ్యాలు సరోవరాలు, ద్వీపాలు, వర్షాలు మొదలైన భూగోళ శాస్త్ర విషయాలు చెప్పబడ్డాయి. రాజుల ధర్మాలు, ప్రజా ధర్మాలు, వర్ణాశ్రమ ధర్మాలు, యజ్ఞ యాగాదులు, వివాహాలు, పునర్జన్మలు, షోడశోపచారాలు, ప్రజల ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, నమ్మకాలు మొదలైన సామాజిక శాస్త్రాంశాలు ప్రస్తావించ బడినాయి. మతము, సృష్టి రహస్యాలు, పృధివ్యాదిలోక భ్రమణ విషయాలు, రథం, నౌక, విమానాది వాహన నిర్మాణాలు మొదలైన అంశాలెన్నో వేదాల్లో కనిపిస్తాయి. ఆయుర్వేదం, సంగీతం, గణితం, జ్యోతిషం, యోగం,వ్యాకరణాది శాస్త్ర విషయాలు చర్చించబడ్డాయి. (ఋగ్వేదాది భాష్య భూమిక)

కణాదుని వైశేషిక దర్శనంలో, నేటి శాస్త్రవేత్తలను సైతం అబ్బుర పరిచే భౌతిక శాస్త్ర సూత్రాలెన్నో ఉన్నాయని శాస్త్రవేత్తలు చెబుతున్నారు. (వి.స.-2 పు.2)

ఇక పురాణ వాఙ్మయానికి వస్తే ఆ కాలంలో ఫరిడవిల్లిన విజ్ఞానమంతా పురాణ వాఙ్మయంలో వెల్లివిరిసింది. జన జీవితంలోని వ్రతాలు, నోములు, ఉపవాసాలు, పండుగలు,పబ్బాలు, దేవతార్చనలు, పూజాద్రవ్యాలు, యజ్ఞయాగాదులు ఆచార వ్యవహారాలు మొదలైన సాంఘికాంశాలెన్నో పురాణాల్లో కనిపిస్తాయి. రాజవంశ చరిత్రలు, రాజనీతి, దండనీతి, వర్ణాశ్రమ ధర్మాలు, వివాహ ధర్మాలు, ప్రజా ధర్మాలు మొదలైన ధర్మ శాస్త్రాంశాలు, నీతి శాస్త్రాంశాలు పురాణాల్లో కోకొల్లలుగా ఉన్నాయి. నదీ నదాలు, కుల పర్వతాలు, పర్వత శ్రేణులు, మహా వనాలు, నవ ద్వీపాలు, వర్షాలు, ఖండాలు,

మొదలైన భౌగోళికాంశాలు ఉన్నాయి. యోగం, వైద్యం, సంగీతం, నాట్యం, జ్యోతిషం, గణితం, శిల్పం, చిత్రలేఖనం, అలంకార, ఛందో, వ్యాకరణాది శాస్త్రాలు, కళలు, పురాణాల నిండా కనిపిస్తాయి.

మహా భారతంలోను పూర్వ తరాల వారి విజ్ఞానాంశాలే గాక సమకాలీన సమాజంలోని వివిధ రంగాలకు చెందిన విజ్ఞానాంశాలెన్నో చోటు చేసుకొని ఉన్నాయి. (ఈ విషయాలన్నీ 'మహాభారతం-విజ్ఞాన సర్వస్వ లక్షణాలు' అనే శీర్షిక కింద విపులంగా వివరించడం జరిగింది) ఈ మధ్య కాలంలో వేద వాఙ్మయం, పురాణ వాఙ్మయం కావ్య వాఙ్మయాల్లోని శాస్త్ర సాంకేతికాంశాలను సమీకరించి ఒక క్రమపద్ధతిలో చెప్పే ప్రయత్నాలు జరిగాయి. ఆ కారణంగా హిందీ, బెంగాలి, తెలుగు, తమిళం, కన్నడ, మలయాళాది మన దేశ భాషల్లోను జ్ఞాన సంహితలుగా చెప్పుకోదగిన కొన్ని గ్రంథాలు వెలువడి ఉన్నాయి. వాటిలో కొన్ని ముఖ్యమైనవి.. ఋగ్వేదాది భాష్యభూమిక. ఇది వేద విజ్ఞానాన్ని ఒక క్రమ పద్ధతిలో చెప్పిన గ్రంథం. రచయిత స్వామి దయానంద సరస్వతి. ఇది తెలుగులోను వెలువడింది.

హిందీ పౌరాణిక కోష్:- పురాణ విజ్ఞానాన్ని అందించిన గ్రంథమిది. రచయిత కుట్టన్ పిళ్ళై.

చరిత్ర కోష్-ఇది వైదిక, పౌరాణిక, చారిత్రక వ్యక్తుల జీవిత చరిత్రలను సమకూర్చిన గ్రంథం. రచయిత చతుర్వేది ద్వారకా ప్రసాద శర్మ, సంపాదకులు శ్రీనివాస త్రివేది.

మహా భారత నామాను క్రమణిక- మహాభారతంలోని నామ విజ్ఞానాన్ని సమకూర్చిన గ్రంథం.

కళ్యాణ తీర్థాంక్- భారత దేశంలోని తీర్థ స్థలాలు, పుణ్య క్షేత్రాల వివరాలను సమీకరించి చెప్పిన గ్రంథం.

పౌరాణిక విజ్ఞాన సర్వస్వం (మలయాళం)- అష్టాదశ పురాణాల్లోని వివిధ విజ్ఞానాంశాలను అక్షర క్రమంలో అందించిన గ్రంథం. రచయిత వెట్టం మణి. ఇది Puranic Encyclopaedia అనే పేరుతో ఇంగ్లీషులోనికి

అనువదింపబడి ఉంది. ఇలాంటివే మరి కొన్ని గ్రంథాలు కూడా వెలువడి ఉండవచ్చును.

**తెలుగు కావ్యాల్లో విజ్ఞానాంశాలు** పూర్వ తరాల విజ్ఞానాంశాలతో పాటు, ఆయా కాలాల్లో వ్యాప్తినొందిన వివిధ శాఖలకు చెందిన శాస్త్ర, సాంకేతికాంశాలు తెలుగు కావ్యాల్లోను చోటు చేసుకొని ఉన్నాయి. ఆది కావ్యమైన ఆంధ్ర మహాభారతం మొదలు, అర్వాచీన ప్రబంధమైన హంస వింశతి వరకు ఆయా కాలాల్లో తెలుగు నేల వెల్లివిరిసిన ప్రకృతి శాస్త్రాంశాలు, సామాజిక శాస్త్రాంశాలు, మన జాతి సంస్కృతి సంప్రదాయాలు అక్కడక్కడా ప్రస్తావించబడి ఉన్నాయి. అయితే ఈ విజ్ఞానమంతా పద్య, గద్యాత్మకమై, గ్రాంథిక భాషలో ఉండటం వలన పండితుల వరకే పరిమితమైందే కానీ, సామాన్యులకు దగ్గర కాలేక పోయింది.

సాహిత్యంలోని ఇలాంటి విజ్ఞాన్నంతటిని (పాశ్చాత్యదేశాల్లో మాదిరి) సమీకరించి సరియైన వివరణలతో, కథనాలతో ఒక క్రమపద్ధతిలో సరళ భాషలో చెప్పి ఉంటే అది సామాన్యులకు సైతం అందుబాటులోనికి వచ్చి ఉండేది. తద్వారా మన పూర్వుల జీవిత విధానం, వారి సంస్కృతీ సంప్రదాయాలు, వారు సాధించిన విజయాలు మొదలైన ఎన్నో విషయాలు నేటి తరానికి కూడా అవగతమై ఉండేవి.

కావ్యాల్లో విజ్ఞానాంశాల ప్రతిపాదనమనేది ఆంధ్ర మహాభారతం తర్వాత వచ్చిన అనేక కావ్యాల్లో అంత బహుళంగా కనిపించదు. ఇందుకు కారణం రసాత్మకమైన కావ్యంలో శాస్త్ర, సాంకేతికాంశాల వర్ణనలు కథా గమనానికి అడ్డు తగిలి, రస స్ఫూర్తికి భంగం కలిగిస్తాయని బహుశా కవులు భావించి ఉంటారు. అయినా కథా గమనానికి అనువుగా ఉన్న చోట్లలో, ఆయా కాలాల్లో విస్తరిల్లి ఉన్న వివిధ విజ్ఞానాంశాలను కవులు చేర్చుతూనే పోయారు. ఈ క్రమంలో ప్రజల దైనందిన జీవితంలోని ఆహారపుటలవాట్లు వంటలు, వంట దినుసులు, వస్త్ర విశేషాలు, అలంకరణ సామాగ్రి, ఆటలు, పాటలు, వింతలు వినోదాలు, ఉత్సవాలు, ఊరేగింపులు, సంతలు, సమారాధనలు, వ్యవసాయం,

వ్యాపారం, పశుసంపద, పాడి పరిశ్రమ, కులాలు,వృత్తులు, వృత్తి పరికరాలు, మత విషయాలు, పండుగలు పబ్బాలు, పూజలు, వ్రతాలు, నోములు మొదలైన సమాజికాంశాలతో పాటు, సాహిత్యం, సంగీతం, శిల్పం, చిత్రలేఖనం, నాట్యం మొదలైన కళలు, వైద్యం ఆరోగ్యం, జ్యోతిషం, గణితం, యోగ శాస్త్రాద్యనేక శాస్త్ర విషయాలు అక్కడక్కడా చోటు చేసుకొని ఉన్నాయి.

విజ్ఞాన ప్రసారాపేక్ష గల కొంత మంది కవులు తమ రచనా ప్రణాళికకు అనుకూలంగా కథాంశాల నెన్నుకొని కథా సందర్భాల కనువుగా విజ్ఞానాంశాలను కూర్చడమే గాక, కథా సందర్భాలను సృష్టించుకొని కూడా శాస్త్ర సాంకేతికాంశాల నెన్నటినో ప్రతిపాదించి ఉన్నారు. ఇలాంటి కావ్యాల్లో కొన్నిచోట్ల వివిధ విజ్ఞానాంశాలను పట్టికలుగా ఇవ్వడం కూడా కనిపిస్తుంది. ఈ పట్టికలు కథా గమనానికి ఆటంకాలుగా నిల్చినా, రస స్ఫూర్తికి భంగం కలిగించే విధంగా ఉన్నా, కవులు మాత్రం పని కట్టుకొని చెప్పిన సందర్భాలు మన కావ్యాల్లో కనిపిస్తాయి. ఇలాంటి కావ్యాలను చదివిన వారికెవరికైనా ఇవి కేవలం కథల కోసమే వ్రాసినవి కావని, ఆనాటి విజ్ఞానాన్ని కూడా సమకాలీనుల కందించేందు కుద్దేశించినవని తెలుస్తుంది. ఈ విషయం పండితారాధ్య చరిత్ర, సింహాసన ద్వాత్రింశిక, వాణీ విలాస వనమాలిక, హంసవింశతి మొదలైన కావ్యాలను పరిశీలిస్తే స్పష్టమౌతుంది.

విజ్ఞానాంశాలు ప్రతిపాదన దృష్ట్యా మన కావ్యాలను అధ్యయనం చేస్తే, మన కవులు ముఖ్యంగా రెండు మార్గాల్లో తమ రచనల్లో విజ్ఞానాన్ని పొందు పరిచినట్లు తెలుస్తుంది. సంక్షిప్త వివరణలు, దీర్ఘ వర్ణనలు అనేది మదటి పద్ధతి. అంటే సందర్భాలను పురస్కరించుకొని వివిధాంశాలను సంక్షిప్తంగా వివరించడం. శాస్త్ర విషయాలను చెప్పవలసి వచ్చినప్పుడు విస్తృతంగా చర్చించడం అన్నమాట. దీనికుదాహరణగా మహాభారతాన్ని చెప్పవచ్చును. ఇందులో ఆశ్రమాలు నదులు, పర్వతాలు, రాజ్యాలు, రాజులు, పురాలు, సభలు, సమావేశాలు మొదలైన విషయ వర్ణనలు సంక్షిప్తంగా ఉంటాయి. సాంఖ్యం, యోగం, వర్ణాశ్రమ ధర్మాలు మొదలైన వాటి చర్చ వచ్చినప్పుడు సుధీర్ఘ వర్ణనలుంటాయి.

సంక్షిప్త వర్ణనలు, పట్టికలు అనేది రెండో పద్ధతి. అంటే దేవాలయ నిర్మాణాలు, పూజా విధానాలు, కుల వృత్తులు, వేష ధారణలు, రాజోద్యోగులు,సంతలు, తిరునాళ్ళు, ఉత్సవాలు, ఊరేగింపులు మొదలైన వాటిని సంక్షిప్తంగా వర్ణించడం. సంగీతం, నాట్యం, చిత్ర లేఖనం మొదలైన కళల ప్రసక్తి వచ్చినప్పుడు గాని, జ్యోతిష, గణిత ఆయుర్వేదాది శాస్త్రాంశాలను చెప్పవలసి వచ్చినప్పుడు గాని, జంతువులు, వృక్షాలు, నదులు, పర్వతాలు, పురాలు, పట్టణాలు, జనపదాలు, వృత్తులు, వృత్తి పరికరాలు మొదలైనవి చెప్పేటప్పుడుగాని, వాటిలోని వివిధాంశాలను ఆరోపాలుగా తీసుకొని, వాటినన్నింటిని పట్టికలు (జాబితాలు)గా ఇవ్వడం. ఈ విధానానికి పండితారాధ్య చరిత్ర, వాణీ విలాసవనమాలిక, హంసవింశతి ఉదాహరణలుగా నిలుస్తాయి.

ఈరెండు మార్గాల్లో విజ్ఞానాంశాలను అధికంగా పొందుపరిచిన కావ్యాలను విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల కావ్యాలుగా నేటి పరిశోధకులు అభిప్రాయ పడుతున్నారు. అటువంటి వాటిలో ఆంధ్ర మహాభారతం, పండితారాధ్య చరిత్ర, సింహాసన ద్వాత్రింశిక. శుక సప్తతి, వాణీ విలాసవనమాలిక, హంస వింశతి మొదలైన కావ్యాలు ముఖ్యంగా చెప్పుకో దగినవి.

**ఆంధ్ర మహా భారతం** పంచమ వేద ప్రశస్తిగన్న మహాభారతం మానవ జీవితానికి వ్యాఖ్యాన ప్రాయమైనదని పండితుల అభిప్రాయం. ఇందులోని వస్తువు ముఖ్యంగా కౌరవ పాండవులకు సంబంధించిందే అయినా ఆ కథతో బాటు ఇందులో దేవ దానవుల ఉత్పత్తి క్రమం, రాజవంశాల వర్ణనలు, ఋషుల చరిత్రలు, భరత వంశ క్రమం మొదలైన విషయాల వర్ణనలున్నాయి. నీతి శాస్త్రం, ధర్మ శాస్త్రం, సాంఖ్యం, యోగం, ఆధ్యాత్మికం, భూగోళం,, యుద్ధ తంత్రాది అనేక విషయాల చర్చలు ఉన్నాయి. వర్ణ వ్యవస్థ, ప్రజలు, వారి జీవిత విశేషాలు, ఆచార వ్యవహారాలు, యజ్ఞ యాగాదులు, వ్రతాలు, నోములు, బాలక్రీడా విశేషాలు, మానవ సంబంధాలు వారి నమ్మకాలు మొదలైన సాంఘికాంశాలెన్నో ఉన్నాయి. అందుకే అదొక ధర్మశాస్త్రం, నీతి శాస్త్రం, వేదాంతం, మహాకావ్యం, లక్షణ గ్రంథం అనే విధంగా ఎవరే దృష్టితో పరిశీలిస్తే వారికా రూపంలో కనిపిస్తుందని నన్నయ అభిప్రాయపడినాడు.

(ఆ.ప. 1-32) అంతే గాదు "భారత సంహితా రచనా దురంధురుడయ్యె జగద్ధితంబుగాన్" అని భారతాన్ని సంహితగా నన్నయ పేర్కొనడం గమనార్హం. సంహితలంటే వివిధాంశాలను వివరించిన గ్రంథాలని స్థూలంగా చెప్ప వచ్చును. అంటే మహాభారతం వివిధాంశాలను వివరించిన, విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల ఒక మహా కావ్యమన్నమాట.

**"తామూదల ధర్మార్థ కామ మోక్ష స్థితికిన్"** (వి.ప. 1-4) అని తిక్కన భారత ప్రాశస్త్యాన్ని ఉగ్గడించాడు. అంటే చతుర్విధ పురుషార్థాలకు ఆకరమైన మానవ జీవితానికి భారతం వ్యాఖ్యానరూపమైందని తిక్కన భావించినట్లు తెలుస్తున్నది.

> **"మహాభారతం ధర్మశాస్త్రం, నీతి శాస్త్రం మహాకావ్యం, ఇతిహాసం,**
> **వేదాంత శాస్త్రం వేయేల అది కానిదేదీలేదు. నిజానికి**
> **అదొక విశ్వవిజ్ఞాన కోశమని చెప్పదగి యున్నది"**
>
> (వి.సం. VI పు. 204)

అని పండితులు అభిప్రాయ పడినారు. ఇలాంటి సంహితా రచనల ఆశయం, లక్ష్యం ప్రయోజనాలను కూడా వ్యాసుడానాడే చెప్పి యున్నాడు.

> **"ఇట్టి మహా భారతంబు ననేక విధ పదార్థ ప్రపంచ సంచితంబు,**
> **ఉప పర్వ మహా పర్వోప శోభితంబు, ఉప ద్వీప మహా**
> **ద్వీప సంభృతంబయిన భువనంబు నజుండు నిర్మించినట్టు,**
> **కృష్ణ ద్వైపాయనుండు నిఖిల లోక హితార్థంబు దత్తావధానుండై**
> **సంవత్సర త్రయంబు నిర్మించే"** (ఆ.ప.I. 67)

భారతంలోని మహా విషయాలను దేవ, పితృ, గరుడ, యక్ష, గంధర్వ రాక్షస, మానవ లోకాల్లో ప్రచారం చేసి, ఆ విజ్ఞానమంత అన్ని లోకాల్లో వ్యాపింప చేసేందుకు నారద, దేవల, శుక, సుమంత, వైశంపాయనాది మునులను పంపినట్లు భారతం చెబుతున్నతి.

భారతంలోని పై వాక్యాల్లో.. అనేక విధ పదార్థ ప్రపంచ సంచితం మహా భారతం అనే మాటలు, విశ్వవిజ్ఞాన సమాహార స్వరూపం విజ్ఞాన

సర్వసం అనే నేటి విజ్ఞాన సర్వస్వాల నిర్వచనాన్ని సూచిస్తున్నాయి. విజ్ఞాన వ్యాప్తియే విజ్ఞాన సర్వస్వాల ఆశయంగా ఎన్‌సైక్లోపిడియా బ్రిటానికా చెబుతున్నది "Let knowledge grow from more to more". (E.B. Inner Title page). ఇదే విషయాన్ని.. 'దేవ, దానవ, మానవాది లోకాల్లో మహాభారత విజ్ఞానాన్ని ప్రచారం చేసి వ్యాప్తి లోనికి తెచ్చేందుకు నారదాది మునులను నియోగించినట్లు భారతంలోని పై వాక్యాల వలన తెలుస్తున్నది.

విజ్ఞాన సర్వస్వాల పరమ ప్రయోజనం మానవ సమాజం సౌభాగ్యవంతం కావడం "And thus be human life enriched" 'మహా భారత రచనలో వ్యాసుడాశించిన ప్రయోజనం కూడా నిఖిలలోక హితమే' నని భారతంలోని పై మాటలు తెలుపుతున్నాయి.

పై విధంగా మహాభారతానికి సంబంధించి వ్యాసుడేనాడో చెప్పిన నిర్వచనం, ఆశయం, ప్రయోజనం అనేవి ఈనాటి విజ్ఞాన సర్వస్వానికిచ్చిన, నిర్వచనం, ఆశయ ప్రయోజనాలకు సరిగ్గా సరిపోలుతున్నాయి.

మహా భారతంలో ప్రతిపాదితాలైన వివిధ శాస్త్ర సాంకేతికాంశాలను పాఠకుల సౌలభ్యం కోసం పది వర్గాలుగా విభాగించి, ఒక్కొక్క భాగంలోని వివిధాంశాలను దిఙ్మాత్రంగా ఇక్కడ చూపడం జరిగింది.

**1. నామ విజ్ఞానం** కౌరవ, పాండవ, భీష్మ, ద్రోణాదుల పాత్రల పేర్లు భారతంలో దాదాపు 3000కు పైగానే ఉన్నాయి.

**2.సమాజ శాస్త్ర విజ్ఞానం** వర్ణ వ్యవస్థ, విద్యా విషయాలు, గృహ ప్రవేశ ఉత్సవాది వేడుకలు. సంకీర్ణ వర్ణాలు, సచ్ఛూద్రులు. అష్టవిధ వివాహాలు, స్వయంవరాలు, పట్టాభిషేకాలు, జాత కర్మాదులు, బాల క్రీడలు, శ్రాద్ధ కర్మలు, ఔరస, క్షేత్రజాది దాయాది సంబంధాలు. అస్తిసంచయాది కర్మకాండలు. అన్నదానాది సేవా కార్యక్రమాలు, చతుర్విధ ఆహారాలు, షడ్రుచులు,పిండి వంటలు, అష్ట శోభనాలు, నిత్తి నైమిత్తిక కర్మలు. పితృ తర్పణాలు, సతీ సహగమనం. అపశకునాలు, ఉత్పాతాలు. ఎరుకలు, చెంచులు, బోయలు

మొదలైన ఆడబిడ్డల జీవిత విశేషాలు. అతిథులు అభ్యాగతులు, రథ, విమానాది వాహనాలు. మయ సభలాంటి అద్భుత భవన నిర్మాణాలు. నృత్య, నాట్య, శిల్ప, చిత్రలేఖనాది కళలు. గోష్టాలు, స్మశాన వాటికలు. వివాహ వేడుకలు, స్వాగత సన్మానాలు, పురాలంకరణ, గృహాలంకరణ, భోజన క్రమం, విందు భోజనాలు, దాయాదులు, మేనరికం లాంటి మానవ సంబంధ బాంధవ్యాలు. పంచ మహా పాతకాలు. రాజోద్యోగులు. అష్ట విద్యలు, ప్రేతకర్మలు, ఉదక కర్మలు, పుట్కర్మలు, ఆస్తి పంపకాలు, అనుష్టేయాలు, శాంతి క్రియ, పౌష్టిక కర్మలు మొదలైన ఎన్నో సామాజికాంశాలున్నాయి.

**3. నీతి శాస్త్రాలు** కణిక నీతి, విదుర నీతి, శుక్రనీతి, వ్యాస నీతి, లోక నీతి, యుద్ధ నీతి, దండ నీతి, కణ్వనీతి, బేధ నీతి, రణ నీతి, షడ్విధ నీతులు, ఆశ్మక నీతి, రాజనీతి, షోడశ నీతి ప్రమాణాలు, కుబేర నీతి మొదలైనవి.

**రాజనీతి** రాజనీతిజ్ఞత, రాజ్యపాలన, గూఢచారులు, వార్తా నిర్వహణ, చతుర్విధోపాయాలు, దుర్గ రక్షణ, రాయబారులు, దౌత్యం, రాజ్యం-సప్తాంగాలు. శకుని రాజనీతి, ధర్మజ రాజనీతి, రాజోచిత లక్షణాలు, ఉత్తమ రాజ లక్షణాలు, రాజాస్థానాలు, గణతంత్రాధిపత్యం, మంత్ర పంచాంగాలు, గణ జనుల పాలన మొదలైన అంశాలు.

**4. ధర్మశాస్త్రం** రాజ ధర్మాలు, వర్ణాశ్రమ ధర్మాలు, స్త్రీ ధర్మాలు, ధర్మాధర్మాలు, ధర్మ బోధన, ఉత్తమ ధర్మం, ఆపద్ధర్మం, మృగయా ధర్మం, మను ధర్మం, లోక ధర్మం, ధర్మ రక్షణం, గృహస్థు ధర్మం, పతి ధర్మం, సతి ధర్మం, వృత్తి ధర్మం, ఆర్ష ధర్మం, వివాహ ధర్మాలు, ధర్మ పాలన, క్షత్రియ ధర్మం, ధర్మ తత్వం, ధర్మాధర్మ విచక్షణ, ధార్మిక తేజం, ఆర్య వృత్త ధర్మాతిరిక్తాలు. ధర్మ సూక్ష్మత, అధర్మ ఫలం, క్షత్ర ధర్మం. ధర్మనిష్ఠ, ధర్మదర్శి, జాతి ధర్మం, కులధర్మం, పురుష ధర్మాలు, ద్యూత ధర్మాలు, పరమ ధర్మ స్వరూప నిరూపణం. ధర్మహాని, ధర్మ స్థాపన యుగ ధర్మాలు, త్యాగ ధర్మం త్రివిధ ధర్మాలు, వర్ణ ధర్మాలు, ధర్మజ్ఞానం, ధర్మ వివక్ష, ధర్మ విశేషం. శరణాగతి ధర్మం, ధర్మ మార్గం, ధర్మ మూలం, ధర్మ దేవత, వ్యక్తి ధర్మం, సంఘ ధర్మం, సత్య ధర్మ

నిరతి, ధర్మ నిర్వచనం, యుద్ధ ధర్మాలు, సర్వ ధర్మ వికల్పం, ధర్మ క్లిష్టత, వీరధర్మం, సద్ధర్మం, మోక్ష ధర్మం, ఏకాంతిక ధర్మం, ధర్మనిరతి, ధర్మ జ్ఞాన బోధ సాంఘిక ధర్మాలు, మనోధర్మం, ఇలాంటివే ఎన్నో ధర్మ శాస్త్ర విషయాలు భారతం నిండా ఉన్నాయి.

**5. యోగ శాస్త్రం** అష్టాంగ యోగాలు, జ్ఞాన యోగం, కర్మ యోగం, జ్ఞాన యోగ మానసిక క్రియ, ఆత్మ జ్ఞానం. యోగులు, బ్రహ్మైక్యం, ధ్యాన యోగం, ఆత్మ-ఇంద్రియ నిగ్రహం, ఆత్మ-జ్ఞానం, సమ్యక్ జ్ఞానం, మాయా విధానం, పంచ భూతాలు, పరమాత్మ దర్శనం, ఇంద్రియ స్పర్శ సంకల్పం సాధకుడు, సాధనదశలు, మోక్షార్థి, మనో నిగ్రహం. క్షేత్రజ్ఞుడు, యోగ బలం, యోగ సాధన, యోగి ఆహారం, నిత్య సంతోషి, ధ్యాన పద్ధతులు, ప్రాణాయామం, అనుష్టాన విధానం, నిర్గుణ తంత్రం, మోక్ష పదం, పరతత్వం వ్యక్తావ్యక్త తత్వాలు, యోగ ధర్మం, అష్ట సిద్ధులు, సాయుజ్యం మొదలైన అంశాలు.

**6. సాంఖ్య శాస్త్రం** చతుర్వింశతి ప్రకృతులు, పడ్విధ విభూతి. ముక్తి ప్రాప్తి. అనుస్మృతి, దైవత్వం, ఆత్మదర్శనం, యాదార్ధదర్శి, జీవాత్మ-పరమాత్మ, జీవులు-కర్మలు-జన్మలు, పరమ పద ప్రాప్తి. క్షరం-అక్షర తత్వం, సాంఖ్యా శాస్త్ర పద్ధతి. ఆధ్యాత్మికం, అధి భూతం, అధి దైవతం, ప్రకృతి,పురుషుడు, త్రిగుణాలు, సంఖ్య-సాంఖ్యం, పరమాత్మ-సాంఖ్యం, సాంఖ్యులు-ప్రకృతి వాదులు, యోగం-సాంఖ్యం మొదలైన విషయాల చర్చలున్నాయి.

**7. భూగోళ శాస్త్ర జ్ఞానం** భారతదేశంలోని ఆశ్రమాలు, పుణ్యక్షేత్రాలు, తీర్థ స్థలాలు వందల కొలది మహాభారతంలో కనిపిస్తాయి. గంగ యమునాది నదీనదాల పేర్లు, ద్వీప వర్షాది భూ విభాగాలు, కుబేర వనం, ఖాండవ వనం మొదలైన మహావనాలు, దండక, నైమిశాది అరణ్యాలు, మానస సరోవరాది సరస్సులు, సప్త సముద్రాలు, వింధ్య హిమాచలాది పర్వతాలు, కుల పర్వతాలు, హస్తినాపురం, ఇంద్రప్రస్తాది పురాలు, నగరాలు అంగ, వంగ, కళింగాది ఛప్పన్నారు దేశాలు. పాంచాల, విదర్భాది రాజ్యాలు మొదలైన వానిని గూర్చిన ప్రస్తావనలున్నాయి.

**8. యుద్ధతంత్రం-ఆయుధాలు-అస్త్ర శస్త్రాదులు** చతురంగ బలాలు, పత్తి, అక్షౌహిణి, గుల్మాది సైన్య విభాగాలు, దండనాధులు, అతిరథ మహారధులు, ఆయుధాగారాలు, స్కంధావారాలు, యుద్ధ సన్నాహాలు, ప్రస్థాన బేరి, యుద్ధ వాద్యాలు, దిగ్విజయ యాత్రలు, నగర ముట్టడి, దుర్గ రక్షణ, ప్రయాణ భేరి, వ్యూహ ప్రతివ్యూహాలు, చతుర్విధ ఉపాయాలు, యుద్ధ బీభత్సం, యుద్ధం-లాభ నష్టాలు, అంపశయ్య, విజయ శంఖాలు, విజయ కేతనాలు, యుద్ధ వాహనాలు, యుద్ధ యానం, మొదలైన యుద్ధ తంత్ర విశేషాలు.

**ఆయుధాలు** అసి, కుంతం, కార్ముకం, గద, ప్రాసం, తోమరం, శక్తి, దండం, పరశువు, పాశాంకురం, కరవాలం, శూలం, ముద్గరం చక్రాయుధం, వజ్రాయుధం మొదలైన యుద్ధ ఆయుధ విశేషాలు.

**అస్త్ర శస్త్రాలు** ఆగ్నేయాస్త్రం, వారుణం, వాయవ్యం, పర్జన్యాస్త్రం, భూమి బాణం, శైలబాణం, గారుడాస్త్రం, నాగాస్త్రం, కుబేరాస్త్రం, ఐంద్రేయాస్త్రం, యామ్యాస్త్రం, రాక్షసాస్త్రం, పైశాచీ అస్త్రం, గంధర్వాస్త్రం, అదృశ్య అస్త్ర శస్త్రాలు, శబ్దభేది బాణాలు, బ్రహ్మ శిరోనామకాస్త్రం మొదలైనవి.

**యుద్ధ బేధాలు** గదా యుద్ధం, మల్ల యుద్ధం, వృక్ష యుద్ధం, మాయా యుద్ధం,శిలా యుద్ధం, ముష్టి యుద్ధం, అశ్మక వర్ష యుద్ధం, ద్వంద్వ యుద్ధం, సంకీర్ణ యుద్ధం, దొమ్మి యుద్ధం, సంకుల సమరం, ఎక్కటి పోరు, సందడి కయ్యం, తుముల సమరం, మొదలైనవి.

**యుద్ధ వ్యూహాలు** వజ్ర వ్యూహం, ఔశన వ్యూహం, బార్హస్పత్య వ్యూహం, మానుష వ్యూహం, క్రౌంచ వ్యూహం, అర్ధ చంద్ర వ్యూహం, మకర వ్యూహం, శ్యేన వ్యూహం, మండల వ్యూహం, కూర్మ వ్యూహం, సర్వతోభద్ర వ్యూహం, శకట వ్యూహం, గరుడ వ్యూహం, పద్మ వ్యూహం మొదలైనవి.

**9. యజ్ఞ యాగాదులు-వ్రతాలు-నోములు** సర్ప యాగం, నలు యజ్ఞం రాజసూయం. ప్రజాపతి యజ్ఞం. పాశుపాణి యజ్ఞం, కృష్ణ యజ్ఞం, నిశాకర యజ్ఞం, పుంసనవ హెూమం, ఋత్విజులు, సంహితాయ యజ్ఞం, పంచమహా

యజ్ఞాలు, సత్ర యాగం, శతవార్షిక సత్రయాగం, యాజకత్వం, యాజ్ఞాయతనం, పుత్రకామేష్టి, హెూత, ఉద్గాత, క్రతువులు, యజ్ఞ పురుషుడు, అగ్ని ష్టోమం, అతిరాత్రం, శతక్రతువు, హవ్యం, కవ్యం, అశ్వమేధం, షోడశ (16మంది) ఋత్విక్కులు, సోమ పీధులు, చరువు (హెూమ ద్రవ్యం) సప్తమేధాధ్వరం, వాజపేయం, హెూమ ధేనువు, వైష్ణవ యాగం, అనుష్ఠాతకులు, క్రతు సంభావనం, అగ్ని హెూత్రం, కామ్య పూజ, ఉపశ్రుతి దేవత, అగ్ని చతుష్టయం, పూర్ణాహుతి, బ్రహ్మమంత్రాలు, సూర్యోపాస్తి, పౌండరీకం, యజ్ఞ భంగం, పున:ప్రారంభం, అవబృధం, సర్వమేధం, యజ్ఞ మహిమ, పంచగవ్యం, యజ్ఞం-మోక్షం, యజ్ఞం-హింస, ద్రవ్య యజ్ఞం, జ్ఞాన యజ్ఞం, శాంతి యజ్ఞం, బ్రహ్మ యజ్ఞం, వైష్ణవ యజ్ఞం, హవిర్భాగం మొదలైనవి.

**వ్రతాలు నోములు** చాంద్రాయణ వ్రతం, మాస భోజ వ్రతం, ఏక భుక్త వ్రతం, పక్షోపవాసం మొదలైవి.

**10. ఆధ్యాత్మికాంశాలు** సముద్ర మథనం, యంత్ర చక్రం, స్థితప్రజ్ఞత, తపస్సులు, అనపత్యులు, దివ్య వాణి, ఆకాశ వాణి, కర్మ విపాకం, బ్రహ్మర్షి తత్వం, అమరత్వం, స్వర్గప్రాప్తి, దివ్య వరాలు, శాపాలు, కర్మానుష్ఠానాలు, ఆదిత్య అష్టోత్తర నామాలు, అక్షయ పాత్ర, పరమేశ్వర స్తోత్ర దండకం, మహిమలు, పంచాగ్ని తపస్సు, పునర్జన్మ, ఇహ పర లోకాలు, వటపత్ర శాయి, మోక్షాపేక్ష, విష్ణు అవతారాలు, మహర్షుల మహిమలు, పాప పరిహారం, స్వర్లోకాది విశేషాలు, తాత్విక భావం, జన్మాంతర దు:ఖం, అష్ట విధ ప్రభాతకాల వైభవాలు, ఆధ్యాత్మతత్వం, పరమార్థం, పరతత్వం, త్రికాల వేది, దివ్య దృష్టి, ఆత్మ తత్వం, కర్మ సిద్ధాంతం, తత్వ జ్ఞానం, తత్వ వివేచన, విశ్వ రూపం, బ్రహ్మ విద్య, దేవతలు, భగవంతుడు, సగుణోపాసన, నిర్గుణోపాసన, విష్ణు సంకీర్తనం, శివ కీర్తనం, దైవాంశ సంభూతులు, శివ ప్రభావం, సారబోధ, జ్ఞాన బోధ, వైకుంఠ ప్రాప్తి, ఆత్మవాదం, ఆధ్యాత్మిక బోధ దృష్టి, కర్మజాత స్థితి, కర్మ ఫలం, భగవన్నామాలు, శ్రీకృష్ణ తత్వం, భగవల్లీలు, విధి విలాసం, అష్టమ దేవత శ్రీ, పరబ్రహ్మ శ్రీ, పరబ్రహ్మ ప్రాప్తి, సత్యపర దర్శనం మొదలైన ఎన్నో

విషయాలు ఆంధ్ర మహాభారతంలో కొన్ని సంక్షిప్తంగాను, మరికొన్ని విస్తృతంగాను వర్ణించబడి ఉన్నాయి. ఇన్ని విషయాలను ఒక చోట చెప్పిన మహాభారతం విజ్ఞాన సర్వ లక్షణాలు గల తొలి తెలుగు కావ్యంగా చెప్పదగియున్నది.

## పండితారాధ్య చరిత్ర

ఆంధ్ర మహా భారతం తర్వాత విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల మన కావ్యాల్లో చెప్పుకోదగింది పండితారాధ్య చరిత్ర. రచయిత పాల్కురికి సోమనాథుడు. ఈయనే రచించిన బసవ పురాణంలోను అక్కడక్కడ విజ్ఞానాంశాల ప్రతిపాదన కనిపిస్తుంది. ఇవి రెండు శైవ ప్రచారం కోసం వచ్చిన ద్విపద కావ్యాలు. వీటిలో శివ భక్తులు, శివారాధనలు, శైవాచారాలేగాక ఆనాటి జన జీవనానికి సంబంధించిన సాంఘికాంశాలు చెప్పబడి ఉన్నాయి. వివిధ శాఖల విజ్ఞానాన్ని పొందు పర్చడంలో పండితారాధ్య చరిత్ర మరో అడుగు ముందుకేసి కొన్ని శాఖల విజ్ఞానాంశాలను పట్టికలుగా ఇచ్చింది. సంగీత శాస్త్రం, నాట్య శాస్త్రం, వైద్య శాస్త్రం మొదలైన శాస్త్ర సాంకేతికాంశాలు ఇందులో పట్టికల రూపంలో ఉన్నాయి. ఇందులోని ఆయా శాఖల విజ్ఞానాన్ని కొన్ని విభాగాలుగా చేసి, వాటిలోని అంశాలను ఇక్కడ దిఙ్మాత్రంగా ప్రదర్శించడం జరిగింది.

**1. శివభక్తుల పరిచయాలు** పండితారాధ్య చరిత్రలో ఘంటాకర్ణుని కథ మొదలు కరవీరుని మహిమ వరకు ఉన్న కథల్లో 100కుపైగా శివభక్తులు పరిచయమౌతారు. బసవ పురాణంలోను-అల్లమ ప్రభువు మొదలు మధుపయ్య కథ వరకు దాదాపు 150 మందికి పైగా శివ భక్తులు కనిపిస్తారు. పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణంలో ఒక సందర్భంగా 100మందికి పైగా కేవలం శివభక్తురాండ్ర పేర్ల జాబితా ఉంది. (పు.243,244) ఇవిగాక ఈ కావ్యాల్లో అక్కడక్కడా ప్రస్తావనకు వచ్చిన చారిత్రక వ్యక్తుల పేర్లన్నీ ఏర్చి కూర్చి డాక్టర్ చిలుకూరి నారాయణరావు గారు సంక్షిప్త వివరణలతో ప్రకటించినాడు. (ప.చ.ఉపో.పు.21)

**2. సర్పాల పేర్లు** పండితారాధ్య చరిత్రలో శత సహస్ర కిల్బిషోరగాల పేర్లు ఒక జాబితాగా ఇవ్వడం జరిగింది. వాసుకి, మణినాదం, కుముదాక్ష, కుముద, శల, పోతక, అనిల, శబల, అశ్వతల, కుహకోట మొదలైన విష సర్పాల పేర్లు. సర్పజాతుల పేర్లు, అవికాటు వేస్తే చేయ వలసిన చికిత్సా విధానాలు మొదలైన అంశాలు వివరింప బడ్డాయి. (మ.ప్ర. 185,186)

**3. వృక్ష విజ్ఞానం** పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణంలో వృక్షాలపేర్లు, పత్తిరులు, పూలు, కాయల, పండ్ల పేర్లు జాబితాగా ఇవ్వడం జరిగింది.

**చెట్లపేర్లు** పోక మాకులు, పొన్న చెట్లు, పొగడ చెట్లు, మొల్లలు, అనటులు, కుర్వకాలు, కమ్మరేగు చెట్లు, అశోక వృక్షాలు, లొద్దుగ చెట్లు, హింతాలాలు, మొదలైన 50కుపైగా చెట్లపేర్లు.

**పత్తిరులు** దవనం, మర్వం, రుద్రజడ, బిల్వ పత్తిరి, మాచి పత్తిరి, మారేడు, వెలగ, వావిలి, ఉమ్మెత్త, గన్నేరు, నెల్లి, ముసింజి, సోమింద, మొదలైన పత్తిరుల పేర్ల పట్టికలున్నాయి. (ఇవన్నీ శివపూజకు శ్రేష్ఠమైన పత్రీ విశేషాలు)

**పుష్పాలు** గోగుపూలు, అశోకాలు, పొగడలు, పొన్నలు, గేదంగి పూలు, మల్లెలు, మొల్లలు, సేమంతులు, తుమ్మిపూలు, జిల్లేడు పూలు, కరవీర పూలు, రేల, గురివింద, విర జాజులు, ములకపూలు, వాకుడు పూలు, జాజులు, తామరలు, కలువలు, కింశుకాలు, సురగి పూలు, ఉమ్మెత్తలు, క్రోవి పూలు, కాంచన, గోరింట, కొమ్మి పూలు, చెంగల్వలు, వెలగ పూలు మొదలైన వందలకొలది పూలపేర్ల జాబితాలున్నాయి.

**కాయలు-పండ్లు** వెల్లంకి కాయలు, రేమిడి, కలివె కాయలు, చిగురులు ఇప్పపూలు, తేనెలు, రేగు పండ్లు, మామిడి, నేరేడు, మొరలి పండ్లు, ఖర్జూరాలు, పరికి పండ్లు, హింతాల ఫలాలు, జీడి, జీడి మామిడి, జాన పండ్లు మొదలైనవన్నీ పట్టికలుగా ఇవ్వడం జరిగింది. (పు. 239,240)

**4. వస్త్ర విశేషాలు-ఆభరణాలు**

**వస్త్ర విశేషాలు** రత్న పంక్తుల జల పోసనాలు, చల్లాడాలు, దంతావళులు, పుష్పమాలికలు మొదలైనవి.

**ఆభరణాలు** శిరోభూషణాలు, కంధాభరణాలు, హస్త భూషణాలు, పాద భూషణాలు, కవ దండలు, కరణికలు, సవరాలు,కలశ దండలు, బచ్చెనలు, చిరు గజ్జలు, అందెలు మొదలైనవి (పు.256)

**5. భౌగోళికాంశాలు**

**తీర్థ స్థలాలు-పుణ్యక్షేత్రాలు** మహేశ్వరం, జంబుకేశ్వరం, గరుడేశ్వరం, బ్రహ్మదేశ్వరం, దేవప్రహదం, నీలప్రహదం, నిద్ధేశ్వరం మొదలైన ఏకాదశ భవ్యతీర్థాలు, రామేశ్వరం, ఉమామహేశ్వరం, సంగమేశ్వరం, అచలేశ్వరం, దిలేశ్వరం, ముక్తేశ్వరం, గౌతమేశ్వరాది పుణ్యక్షేత్రాలు.

**పర్వతాలు** వేద పర్వతం, శ్వేతాద్రి, నీలాద్రి, మేదినీ ధరం, కన్యానగం, ఉమాగిరి, కనక నగం, కుంద శిఖరాది కొండలు.

**కుండాలు** రామకుండం, భీమకుండం, ప్రయాగ కుండం, వేద కుండం, తిల కుండం, నీల కుండం, పిశాచ కుండం, గౌరీ కుండం, రసకుండాదులు (ప.ప్ర.పు.277)

ఇవే కాకుండా భారతదేశంలోని నదులు, పర్వతాలు, పట్టణాలు మొదలైన వానిపేర్లు ఈ కావ్యంలో అక్కడక్కడ ప్రస్తావించిన వాటినన్నటిని ఏర్చి కూర్చి దాదాపు 400లకు పైగా పేర్లను అకారాదిగా డాక్టర్ చిలుకూరి నారాయణరావు గారు పట్టికలు (lists)గా ఇచ్చాడు. (ప.చ.ఉపో.పు. 86 to 92)

**6. మత విషయాలు** పండితారాధ్య చరిత్ర శైవమత ప్రచారం కోసం వచ్చిన ద్విపద కావ్యం. వీరశైవానికి సంబంధించిన ఎన్నో విషయాలు ఇందులో ఉన్నాయి.

**మత వాదాలు-ఖండన** వేద మత నిరసన, కాలవాద ఖండన, వేదాంత మతవాద నిరసన, కర్మవాద నిరసన, సాంఖ్య, యోగ వాదాల నిరసన చార్వాక వాద నిరసన, పాంచరాత్ర, బౌద్ధ, జైన మత వాదాల నిరసన మొదలైనవి. (వా.ప్ర.పు. 125 to 132)

**శివ స్తోత్రాలు-కీర్తనలు** రుద్ర గణ సంకీర్తన, యోగి గణ సంకీర్తన, షోడశగణ సంకీర్తన, దశగణ, త్రయోదశ గణ సంకీర్తనలు (పు. 80)

**శివలీలు-మహిమలు:** పంచ వింశతి లీలలు, ప్రణయ లీలలు, మహాతాండవ లీలలు, మొ॥ (వా.ప్ర.పు. 263 to 268) విభూతి మహిమ. రుద్రాక్ష మహిమ, పాదోదక మహిమ, లింగార్చన మహిమ, ప్రసాద స్వీకార మహిమ, (దీ ప్ర. 8 to 37) కర్మ హరి మహిమ, కరవీరుని మహిమ (ప.ప్ర. 263-268)

**శివారధనలు** జంగమారాధన, పరశు లింగార్చన, షోడశోపచార క్రియార్చనలు, జంగమ పూజ, లింగపూజ, ఆరాధ్యదేవు లింగార్చన మొదలైనవి భక్తుల కథల్లో ప్రస్తావింపబడి ఉన్నాయి. (దీ.ప్ర.పు. 41)

**7. సంగీత శాస్త్రం** సప్త స్వరాలు-108 రాగ భేదాలు, సాంగాంగ, భాషాంగ, క్రియాంగ, సంగతోపాంగ, సంజనిత రాగాలు, ద్వాదశ అను వాచకాలు, ఏకాదశ వహణ బేధాలు, దశ విధ ప్రాణాది సంగీత శాస్త్ర విషయాలెన్నో ఉన్నాయి.

## 8. నాట్య శాస్త్రం

**వాద్య విశేషాలు-వీణా భేదాలు** బ్రహ్మ వీణ, కైలాస వీణ, సారంగ వీణ, కూర్మ వీణ, అకాశ వీణ, వినాయక వీణ, రావణ వీణ, గౌరి వీణ, గాంధర్వ వీణ, బాణ వీణ, కాశ్యప వీణ, స్వయంభు వీణ, భుజంగ వీణ, భోజ వీణ, కిన్నెర వీణ, త్రిసరి వీణ, సరస్వతీ వీణ, మొల్ల వీణ, మనోరధ వీణ, సరధి వీణ, గణనాథ వీణ, కౌమార వీణ, రావణ హస్తం, తిపిరి సకెనె, యాళి, విచిత్రక, సాగరిక, కుంభిక, విపంచిక, సరవీణ, స్వరమండలం, ఘోషావతి, ఔదుంబరి, తంత్రి సాగరం, అంబుజ వీణాదులు (ప.ప్ర.పు. 258)

**బంధాలు** సమహస్త, సైరణ, బొల్లాణి, విషమ వాణి, పింద హస్త, చంద్రాణి, పంచ హస్త, జలపాణి, సమపాణి, గర్భ నిర్ణయాది బంధాలు.

**తాళ భేదాలు** చంపుట, కచ్చపుట, షడ్గీత, ఉత్పుట, మోచిత, సమతాళ, సత్రతాళ బేధాలనే సప్త తాళాలు, పొంబడ, హడ, బంధ కరణాది 27శుద్ధ తాళాలు, ఖండతర, అవఖండ, కంకళాది పంచ తాళాలు.

**వాస నాదాలు** భువన వాస, జాతి వాస, కుమార వాస, పక్ష వాస, శ్వేత వాస, భాస్కర వాసాది 18 వాస నాదాలు.

**గతులు** ఆలాప,హేలన, వ్యాప్తి, సొంపు, వణవు, దిరువు, జయ, అనుజయ, కొంకు వహణి, అంధర వహణాది 22 గతి బేధాలు.

**ఆలాపనలు** ఆరోహి, అవరోహి, చక్రవాళ, ప్రవ్యక్త, సువ్యక్త, లాలితాది సప్త ఆలాపనలు. ఇంకా చతుర్విధ వక్ర విభ్రమాలు, అంగహారాలు, షడ్వింశతి క్రమ చక్షురంకితాలు. త్రిభంగి, సమభంగి మొదలైన వింశతి (20)

హంసగతి, గజగతి, మయూర గతి మొదలైన గతి భేదాలు, ఇలాంటి సంగీత, నాట్య శాస్త్రాంశాలెన్నో పట్టికలుగా ఇవ్వబడ్డాయి. (ప.ప్ర.పు.257 to 262)

## 9. వైద్య శాస్త్రం

**కంటి జబ్బులు** తప్పపోయిన కన్ను, తడి కన్ను, పొడ కన్ను, గుడ్డి కన్ను, బరి కన్ను, కోద్రెప్ప కన్ను, భ్రమంద కన్ను, పోటు కన్ను, తూటు కన్ను, మొదలైన 35రకాల కంటి జబ్బులు (మ.ప్ర.185,186)

**విష సర్పాలు, పాముకాటు-చికిత్స** గారుడ మంత్రాది మంత్ర చికిత్సలు. మంత్ర తంత్రాది ఔషద క్రియలు. అగ్గి కాక, జలాభిషేకం. (ప.పు.101) రస రసాయనాలు. దివ్య ఔషధావళులు (ప.పు.214)

**10. శివ భక్తుల నడలు** పండితారాధ్యచరిత్ర పర్వత ప్రకరణంలో పలు ప్రాంతాల నుంచి వచ్చిన శివ భక్తులు శ్రీశైలానికి వచ్చే సందర్భంలో వారి నడవడికలు, ప్రయాణావసర వస్తువులు, అక్కడక్కడా యాత్రికుల కోసం అడవి బిడ్డలు

చెంచులు ఏర్పాటు చేసిన వసతి సదుపాయాలు మొదలైన అంశాలెన్నో చెప్పబడ్డాయి.

ఆంధ్రదేశ వరస నడలు, కన్న వరస నడక, అరవదేశ వరస, జంగమ కోట్ల నడలు, వృద్ధ తపోధనుల నడకలు, మిండ జంగాల నడలు, శీల వంతుల నడకలు, విరక్తులు, ఆభ్యాస యోగలు, పుణ్యాంగనలు,జోగులు, పిచ్చుకుంట్లు, చెంచు ధర్మాత్ములు మొదలైన వారి నడల విశేషాలు వివరించబడ్డాయి. (పు.218 to 237)

**11. ఇతరాంశాలు** గొడుగులు, చెప్పులు, కుంచెలు, కడవలు, సంబులు (చెంబులు) నేత కప్పడాలు (దుప్పట్లు) కుబుసాలు (సన్నని వలెపె వస్త్రాలు) గట్టిగుడ్డలు, బోడ తప్పరాలు, యోగ దండాలు, దండెలు, పొత్తి పంచెలు, తిత్తులు, అడప తిత్తులు, నూనె సిద్దెలు, యోగ పట్టెలు, ఆరతి పలుకులు, ఆలవట్టాలు, నిలువు పళ్ళెకలు, వెదురు సలవల సంచెలు, సానడాయి. ముగ్గు పలకలు, దీప కంబాలు, పూసలు, రుద్రాక్షలు, పటికాలు, గ్రాసడాలు, కావి గద్దె సంగరులు, శివ సూత్రాలు, కవుసిన ప్రస్తాలు, విసన కర్రలు, గంధపు చిప్పలు, కరవడాలు, గంధపు చెక్కలు, పెరికల కావళ్ళు, మొదలైన రకరకాల వస్తు సముదాయాల పట్టిక లున్నాయి. (పు.237,238) ఇవి ఆనాడు జన వాడుకలోనున్న వివిధ వస్తు విశేషాలు, వీటిలో నేడు చాల పదాల అర్థాలు కూడా తెలియకుండా పోయాయి.

**జల ఒనరులు, నీటి పాత్రలు** బావులు, కుంటలు, పద్మాకరాలు (చెరువులు) బుగ్గలు, ఏరులు, వాగులు, గుంతలు, చెలమలు, మొదలైన నీటి వసతులు. పోక పొత్తులు, గల్ల తిత్తులు, రాగి బిందెలు, కుండలు, గుళ్ళ కోరలు, గిండులు, దొడ్డ కమండలాలు, గరిగలు, బటువులు, కావళ్ళు. గూడలు, కరత్తులు, మొదలైన నీటి పాత్రలు.

**ఆటలు-పాటలు** చారు గీతాలు ప్రకటించి పాడే వారు, భ్రూలతలన నాట్యాలు చేసేవారు, స్వర వంచన (mimicry) దంతావళలు నటించేవారు మొదలైన వినోద కార్యక్రమాలు.

**విడిది స్థలాలు** గూడ చప్పరాలు, గుడిసెలు, గూళ్ళు, గుడారాలు, తెరలు, గోల్లెనలు, మొదలైన విడిది స్థలాలు. ఇవి శ్రీశైల పర్వతారోహణ చేసే భక్తుల కోసం అక్కడి అడవి బిడ్డలు చెంచులు కల్పించిన విడిది వసతులు.

ఇలాంటివే ఎన్నెన్నో సాంఘిక, సాంస్కృతిక , శాస్త్రాంశాలు పండితారాధ్య చరిత్ర అంతటా పరచుకొని ఉన్నాయి. వీటిలో కొన్ని శాఖల విజ్ఞానాంశాలు పట్టికలుగా కూడా ఇవ్వడం జరిగింది. ఇన్ని విషయాలు ఏకత్ర సంఘటించి చెప్పిన కావ్యం కాబట్టి ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్య దీనినొక విజ్ఞాన సర్వస్వంగా ప్రశంసించారు.

**సింహాసన ద్వాత్రింశిక** ఇది విక్రమార్కునకు సాలభంజికలు చెప్పిన 32 కథలు గల కథా కావ్యం. రచయిత కొరవి గోపరాజు. ఇందులోను ఆనాటి సాంఘికాంశాలతో పాటు ఛందస్సు, గణితం, వైద్యం, మొదలైన శాస్త్ర సాంకేతికాంశాలు కూడా చెప్పడం జరిగింది. ఈ శాస్త్రాంశాలన్నీ అనంతరం వచ్చిన వాణి విలాస వనమాలిక, హంస వింశతి మొదలైన ప్రబంధాల్లో విపులంగా చోటు చేసుకొని ఉన్నాయి. ఆయా శాఖల విజ్ఞానాన్నంతటిని అక్కడ వివరించడం జరిగింది. అందుకని కొన్ని ముఖ్యమైన వాటిని మాత్రమే ఇక్కడ దిఙ్మాత్రంగా చూపడం జరిగింది.

గ్రామ దేవతలు (1బా.పు.85, 107), పండుగలు (2భా.పు.39) చంపుడు గుళ్ళు (1భా.పు.85) వాద్య విశేషాలు (2.భా.పు.68) శకునాలు (1భా.పు.25) పురాణ పఠనం (2భా.పు.52) ద్రవ్య చెలామణి-నాణాలు (2భా.పు.31) వ్యవసాయం (2భా,పు.7) వస్త్ర విశేషాలు (పట్టిక) (1భా,పు.74) ఆయుధ పరిశ్రమ (1భా.పు.78,89,96) అద్దాల వాడుక (1భా.పు.72) కరణాలు (2భా.పు.104,105) భాషా, సాహిత్యాది విద్యా విషయాలు (2భా.పు.5), జెట్టి వేషధారణ (2భా.పు.108) జూదరి వేషం (2భా.పు.84) కాలమానం (1భా,పు.102) మద్య పాన విశేషాలు (1భా,పు.103), పక్షుల పేర్లు (పట్టిక) (1భా.పు.29) వినోద కార్యక్రమాలు-ఇంద్రజాలం, జూదాలు, పగటి వేషాలు, జల స్తంభనాదులు (2భా.పు.102, 111) ఆటలు, పాటలు (2భా. పు.56) మొదలైనవి.

**వైద్య శాస్త్రం** కుష్టురోగి (5-32) ప్రసూతి తంత్ర విషయాలు(3,28,30,33), శిశు జననం (3-35), ప్రసవ లక్షణం (3-37) గర్భిణీ స్త్రీ లక్షణం (3-39), శిశూపచారాలు (3-43,45), ఉగ్గులు (3-48) గండమాల (జబ్బు) (10-53)

**కామకేళి విశేషాలు** శృంగార భావానుభావాలు (3-136) చుంబనాలు, నఖక్షత, దంతక్షతాలు (2-138) ఇలాగే గణిత, జ్యోతిష, ఛందశ్శాస్త్రాంశాలు కూడా ఇందులో లెక్కకు మిక్కుటంగా కనిపిస్తాయి. గ్రంథ విస్తరణ భయం వలన ఇంత వరకే చూపడం జరిగింది.

**శుకసప్తతి** ఇది 16వ శతాబ్దంలో వచ్చిన కథా ప్రబంధం. రచయిత పాలవేకరి కదిరీపతి. ఇందులో చిలుక కథానాయికకు చెప్పిన 70 రాత్రుల కథలున్నాయి. కథలు చాల వరకు రంకు-బొంకులకు సంబంధించినవి. అయితే కవి ఈ కథలనాధారంగా నాటి ప్రజల జీవిత విధనాలను అన్ని కోణాల నుంచి వర్ణించడం ఈ కావ్యంలోని విశేషం. ఇది ఆనాటి జన జీవితానికి అద్దం పడుతుంది. 16వ శతాబ్ధపు ఆంధ్రుల సాంఘిక చరిత్రను అధ్యయనం చేసేందుకు అవసరమైన ముడిసరుకు ఇందులో పుష్కలంగా లభిస్తుందని పండితుల అభిప్రాయం.

ఆనాటి ప్రజల ఆహారం, వస్త్రధారణ, ఆభరణాలు, గృహాలు, గృహాలంకరణాలు, గృహొపకరణాలు, పశు సంపద, పాడి పరిశ్రమ, వ్యాపారం, వ్యవసాయం, కులాలు, కుల వృత్తులు, వృత్తి పరికరాలు, పండుగలు, వ్రతాలు, నోములు, సంప్రదాయాలు విశ్వాసాలు మొదలైన అంశాలెన్నో ఈ ప్రబంధం నిండా కనిపిస్తాయి.

బ్రాహ్మణ, వైశ్య, గొల్ల, రెడ్డి, మొదలైన కులాలకు సంబంధించి వారి వారి కుల ధర్మాలు, ఆచార వ్యవహారాలు, ఆహారపు అలవాట్లు, మొదలైన అంశాలను వివరంగా వర్ణించిన ప్రబంధమిది.

శుక సప్తతిలో రెడ్డి, కరణం, తలారి, రాజోద్యోగులు, భటులు, స్త్రీలు మొదలైన వారి వేషధారణ లివ్వడం ప్రత్యేకంగా కనిపిస్తుంది.

కరణం వేషధారణ (2-417), జోగురాలు (2-425) తురక జవాను (4-27-28) రెడ్డి వేషధారణ (2-413) ఎరుకసాని (1-97) రాజుల వేషధారణ (1-119, 1-286) భటుడు (జెట్టి) (2-241) రెడ్డిసాని (2-332) బ్రాహ్మణి (2-457) జంగమ స్త్రీ (2-32) ముత్తయిదువ (2-105) భోగంసాని (3-17), మాష్టీడు (3-58) ఇలాగే రకరకాల వ్యక్తుల,రాజోద్యోగుల, వ్యాపారుల, కులవృత్తుల వారి వేషధారణ విధానాలు ఈ ప్రబంధంలో అధికంగా కనిపిస్తాయి.

గృహ నిర్మాణాలు(3-477) రెడ్డిగృహం (2-408) రెడ్డి సంసారం (2-409) బ్రాహ్మణులు (4-111) కోమట్లు (1-113) ఇలా శుకసప్తతి ఆనాటి ప్రజల జీవితానికి సంబంధించిన అనేక విషయాలను వివరించి, ఆనాటి సమాజ విజ్ఞానానికి దర్పణం పట్టిన కావ్యంగా చెప్ప వచ్చును. ఇతరా శాస్త్రాంశాలు, సాంకేతికాంశాల వర్ణనలుగాని, లేదా వాటిని పట్టికలుగా ఇవ్వడం గాని ఇందులో కనిపించవు.

శుక సప్తతికి దాదాపు 150 ఏండ్ల తర్వాత వచ్చిన హంస వింశతి ఇదే విషయాలను ఇంకాస్త విపులంగా వివరించింది. వివిధ శాఖల విజ్ఞానాంశాలను పట్టికలుగా కూడా ఇచ్చింది. శుకసప్తతిలోని సాంఘికాంశాలు ఎన్నో హంస వింశతి లోను వస్తాయి. అందుకని పునరుక్తి కాకుండా ఇక్కడ శుకసప్తతిలోని సాంఘిక విజ్ఞానాన్ని ఇంత మాత్రమే చూపడం జరిగింది.

**వాణీ విలాస వన మాలిక** ఈ కావ్యానికి కవిపెట్టిన పేరే దీనినొక విజ్ఞాన సర్వస్వంగా సూచిస్తున్నది. వాణీ విలాసమంటే విజ్ఞానమే. ఆ విజ్ఞాన్నంతటిని మాలికగా కూర్చి ప్రజల కందించాడు కవి. అదే వాణీ విలాస వనమాలిక. కవి టేకుమళ్ళ రంగశాయి. ఇందులో చెప్పిన విజ్ఞానాంశాలను మూడు ప్రధాన విభాగలుగా వర్గీకరించవచ్చు. 1. సాంఘిక, సాంస్కృతికాంశాలు (2) శాస్త్ర-సాంకేతికాంశాలు (3) ఇతరాంశాలు.

I. **సాంఘిక, సాంస్కృతికాంశాలు** చాతుర్వర్ణ వ్యవస్థ, బ్రాహ్మణులు (2-681 to 853 2-907 to913) క్షత్రియులు (రాజులు) వైశ్యులు, శూద్రులు (2-854

to 874) అష్టవిధ వివాహాలు (3-1337 to 1339) పతివ్రతా ధర్మాలు (2-875 to 891)దానాలు-దాన ఫలాలు (3-1233 to 1324) పండుగలు-వ్రతాలు-నోములు (3-382 to 393) వ్రతమాహాత్మ్యాలు (3-515 to 1547) మునులు-మునిగణాలు-ముని గణాధ్యాక్షులు (2-219 to 228) మొదలైనవి.

II. **శాస్త్ర సాంకేతికాంశాలు** 1.చంధో వ్యాకరణాంశాలు (3-1632 to 1675) 2.జ్యోతిషం-గణితం- జాతకం-ఫలభాగాలు మొ॥ (3-1679 to 1774)

**గణిత శాస్త్రం** దశ విధ గణితాలు-ద్వాత్రింశతి (32) స్థానాలు. వర్గం-వర్గ మూలం, ఘనం-ఘన మూలం, సంకలితం- ఉత్కలితం మొదలైన గణిత శాస్త్రాంశాలు (4-693 to 713)

**ఆయుర్వేదం** పిండోత్పత్తి, జీవ పరిణామం (1-273 to 274) రకరకాల జబ్బులు-నాడీబేధాలు, చికిత్స-ఔషదాలు (4-3 to 49)

**గాంధర్వ వేదం** (సంగీత శాస్త్రం) సప్త స్వరాలు, తాళ భేదాలు, నాదం, శృతి, రాగ భేదాలు (3-69 to 96) మొదలైనవి.

**ధనుర్వేదం** విలుకాడు-అభ్యాసం, ఆలీఢం, ప్రత్యాలీఢం, చిత్రాది గతులు మొదలైనవి. (3-98 to 108)

**యోగ శాస్త్రం** అష్టాంగ యోగాలు, ఆసనాలు, అష్ట విధ కుంభకాలు, ధశ విధ ముద్రలు మొదలైనవి. (4-310 to 358)

**భరత శాస్త్రం** (నాట్య శాస్త్రం)తాళమార్గ క్రియాంగాది లీలలు, కాల మార్గ క్రియాంగాలు, మార్గ దేశీ భేదాలు, గీత వాద్యాలు, హస్త ముద్రలు మొదలైనవి (4-383 to 459)

**కామ శాస్త్రం** త్రివిధ నాయికలు, రతి భేదాలు, సప్త విధ రతులు, దశవిధ సంస్కార విధులు, ఆకర్షణ క్రియలు, రతి బంధాలు 4-461 to 514)

**భూగోళ శాస్త్రం** ఖండాలు, వర్షాలు, పర్వతాలు (3-13 to 345)చెప్పున్నారు

దేశాలు (1-346) పుణ్యక్షేత్రాలు, తీర్థ స్థలాలు (2-8 to 109) శైవ క్షేత్రాలు (2-152 to 172) మొదలైనవి.

**స్వప్న శాస్త్రం** కలలు, శుభాశుభాలు, వాటి ఫలితాలు (4-764 to 781)

**శిల్ప శాస్త్రం** నిర్వచనం, విగ్రహాలు-కొలతలు, స్త్రీ ప్రతిమలు, భవనాలు, గృహాలు, ఆలయాల నిర్మాణం-కొలతలు (4-783 to 798)

III. **ఇతరాంశాలు** సృష్టిక్రమం (1-217 to 220) కాల స్వరూపం (1-225 to 245)మొదలైనవి

ఇలా వాణీ విలాసవనమాలిక వివిధ శాఖల విజ్ఞానాంశాలను వివరంగా వర్ణించి ఉంది. ఇందులో విజ్ఞానాంశాలను పట్టికలుగా ఇచ్చినవి అంతగా కనుపించవు. విషయ వర్ణనలు దీర్ఘంగా సాగిన సందర్భాలు ఉన్నాయి. ఇంత విజ్ఞానాన్ని సమాజానికి అందించిన కావ్యం కాబట్టే దీన్ని హిందుమత విజ్ఞాన సర్వస్వంగా సి.పి.బ్రౌను వర్ణించాడు. ("present work is general miscellanary upon all branches of Hindu learning" (Introduction. p-5)

**హంస వింశతి** హంస హేమావతికి (ప్రబంధ నాయిక) చెప్పిన 20రాత్రుల కథలు గల కథా ప్రబంధమిది. రచయిత అయ్యలరాజు నారాయణామాత్యుడు. ఇందులోని కథలన్నీ శుకసప్తతిలో మాదిరి చాలా వరకు రంకు-బొంకులకు సంబంధించనవే. అయితే నేమీ ఆనాటికి ప్రచారంలోనున్న వివిధ శాఖలకు చెందిన విజ్ఞానాన్నంతటిని ఇందులో పొందుపరిచాడు కవి. కులాలు, కులవృత్తులు, గృహాలు, గృహోపకరణాలు, నాటి ప్రజల వేష ధారణలు, ఆలయ నిర్మాణాలు, తిరునాళ్ళు మొదలైన సాంఘికాంశాలను సంక్షిప్తంగా కవి వర్ణించాడు. మిగతా భూగోళం, గణితం, వైద్య శాస్త్రాది అనేక విషయాలను పట్టికలుగా ఇచ్చాడు.

హంసవింశతి-విజ్ఞాన సర్వస్వ లక్షణాలు అనే అంశం మీద పరిశోధన గావించి డాక్టర్ గుంజి వెంకటరత్నం (గ్రంథరచయిత) డాక్టరేట్ పట్టాను పొందాడు. ఆ సిద్ధాంత వ్యాసం 4 సంపుటలుగా ఉంది. రెండు సంపుటాలు ముద్రణ పొందాయి. మరి రెండు అముద్రితాలు. ఆ గ్రంథంలో హంస

వింశతిలోని విజ్ఞానాంశాలను దాదాపు 4000 వరకు ఆరోపాలుగా ఎంచుకొని, ప్రాకరణికాక్షర క్రమంలో రచయిత సంక్షిప్తంగా వివరించడం జరిగింది. ఆ విజ్ఞానమంత పాఠకుల అవగాహన కోసం వివిధ వర్గాలుగా విభజించి ఉన్నాయి.

**1. కళా వర్గం** నాట్యకళ-షోడశ నృత్తాలు, వాద్యకళ-వివిధ వాద్యాలు, గానకళ-సప్త స్వరాలు, రాగ, తాళ భేదాలు మొదలైన అంశాల వివరణ లున్నాయి.

**2. విద్యా వర్గం** ఆనాడు ప్రచారంలోనున్న విద్యా రంగానికి సంబంధించిన వేదాలు, వేదాంగాలు, పురాణాలు, స్మృతులు, ఇతిహాసాలు, చౌషష్టి విద్యలు, చందస్సు, అలంకారాలు, నిఘంటువులు, పంచ సిద్ధాంతాలు, మొదలైన అంశాల వివరణ లున్నాయి.

**3. భౌగోళిక వర్గం** ద్వీపాలు, వర్షాలు, ఖండాలు, నదీ నదాలు, పర్వతాలు, ప్రాచీన జనపదాలు, పుణ్య తీర్థాలు, అష్టోత్తర శత దివ్య తిరపతులు మొదలైనవి.

**4. వృక్ష వర్గం** వృక్షాలు, తీగలు, మొక్కలు, ముళ్ళ పొదలు, పూలమొక్కలు.

**5. క్రీడావర్గం** బాలుర ఆటలు, బాలికల ఆటలు మొదలైన జానపద క్రీడా విశేషాలు. (ఇక్కడి వరకు రెండు సంపుటాలుగా ప్రచురించడం జరిగింది)

**6. శాస్త్ర వర్గం** ఆయుర్వేదం, గణితం, జ్యోతిషం, యోగ శాస్త్రం, మంత్ర శాస్త్రం, మల్ల యుద్ధ విశేషాలు, ఆయుధ విశేషాలు పట్టికల రూపంలో ఉన్నాయి.

**7. వృత్తి వర్గం** వ్యవసాయం, కుమ్మరి, కమ్మరి, గాండ్ల, గొల్ల, బెస్త, సాలె, మొదలైన కులాలు, వారి వృత్తులు, వృత్తి పరికరాలు, ఉత్పత్తులు (ధాన్య విశేషాలు, బట్టలు, కుండలు) మొదలైనవి వివరించబడినాయి.

**8. విపణి వర్గం** ఆనాడు ప్రచురంగా ఉండే చిల్లర వ్యాపారం, సంచార వ్యాపారం, చిల్లర కొట్టులోని అంగడి దినుసులు మొదలైనవి వందల కొలది పట్టికలుగా ఇవ్వడం జరిగింది.

**9.మానవవ వర్గం** చతుర్ధశ మనువులు, వివిధ కులాలు, (డెబ్బది రెండు

మంది) బాహ్తత్తర వినియోగదార్లు, ప్రభుత్వోద్యోగులు మొదలైనవి.

**10. తిర్యగ్వర్గం** జంతువులు, చేపలు, పక్షులు, ఇతరా జలచరాలు మొదలైన వాని పట్టికలు.

**11. అలంకరణ వర్గం** నాటి సమాజంలో ప్రజలు వాడే అలంకరణ వస్తువులు-వస్త్రాలు, ఆభరణాలు, పైపూతలకు వాడే పరిమళ ద్రవ్యాలు, పడకటింటి అలంకరణ మొదలైనవి.

**12. భోజన వర్గం** ఆహార పదార్థాలు, తినుబండారాలు, మసాల దినుసులు, ఊరగాయలు.

**13. ఉత్సవ వర్గం** తిరునాళ్ళు, బాణాసంచా, కొలువులు, కోడిపందాలు, వేడుకలు, వినోదాలు మొదలైన అంశాలున్నాయి.

**14. ప్రకీర్ణక వర్గం** పై వర్గాల్లో రాని అప్సరసల పేర్లు, వివిధ వ్యక్తుల వేషధారణలు ఇంకా ఎన్నో అంశాలు ఈ వర్గంలో వివరించడం జరిగింది. (6 నుంచి 14వరకు గల వర్గాలు (రెండు సంపుటాలు) ఆముద్రితాలు)

విజ్ఞానాంశాల ప్రతిపాదనలో హంస వింశతి ఎక్కువ రంగాల విజ్ఞానాన్నంతటిని పట్టికల రూపంలోనైనా పొందుపరిచి సమాజానికి కందించడంలో కృతకృత్యమైందనే చెప్పాలి. దీనిలో ఉన్న అపారమైన విజ్ఞానాంశాల నన్నింటిని సమీకరించి సి.పి. బ్రౌను రెండు సంపుటాల్లో పదిల పరిచి ఉన్నాడు. అవి నేటికీ మద్రాసు (చెన్నై) ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో ఉన్నాయి. (D 3100, D 3102 నంబర్లు గల వ్రాతప్రతులు) ఇవి హంసవింశతిని ఒక విజ్ఞాన సర్వస్వంగా రూపుదిద్దడంలో ఈ గ్రంథ రచయితకు ఎంతగానో తోడ్పడినాయి. (హంసవింశతి-విజ్ఞాన సర్వస్వం' అనే గ్రంథం ముద్రణ ప్రతుల వివరాలు చివరి ప్రకరణంలో ఇవ్వడం జరిగింది.).

# 3

# తెలుగు విజ్ఞాన సర్వస్వాల చరిత్ర

ప్రాచీన కాలంలో మనకు విజ్ఞాన సర్వస్వమనే సాహిత్య ప్రక్రియ లేదు. ఇది ఇంగ్లీషు భాషా సాహిత్యాల ప్రభావంతో ఆవిర్భవించిన కొత్త సాహిత్య ప్రక్రియ. 19వ శతాబ్దంలో దీనికి పునాదులు పడ్డాయి. అంతకు ముందంతా మన కావ్యాలే విజ్ఞాన ప్రసార సాధనాలుగా వ్యాప్తిలో ఉండేవి.

19వ శతాబ్ధం నాటికి మన దేశంలో ఆంగ్లేయ పాలన వేళ్ళూనుకొని వారి భాషా సాహిత్యాలు, సంస్కృతీ సంప్రదాయాలు మనపై ప్రభావం చూపాయి. ఆంగ్ల భాషా సాహిత్యాలను మనవాళ్లు అధ్యయనం చేశారు. అప్పటికే ప్రచారంలోనున్న ఇంగ్లీషు విజ్ఞాన సర్వస్వాలు మన రచయితలను ఆకర్షించాయి. వివిధ విజ్ఞానాంశాలను ఏకత్ర సంఘటించి, పాఠకులకు సులభ గ్రాహ్యంగా చెప్పిన ఆ విజ్ఞాన సర్వస్వాల పద్ధతి మనవాళ్ళకు నచ్చింది. అదే విధంగా మనవాళ్ళు కూడా వివిధ శాఖల విజ్ఞానాన్ని పరిచయం చేసే విధంగా ప్రయత్నాలు చేశారు. అప్పటి మన తెలుగు నాట విచిత్ర పరిస్థితులు నెలకొని ఉన్నాయి. ప్రభుత్వాధికారులంతా ఆంగ్లీయులే. వారు తెలుగు నేర్చుకోవాలి. మనవాళ్లు చిన్నచిన్న ప్రభుత్వోద్యోగాల్లో చేరాలన్నా చదువుకోవాలి. ఇలాంటి పరిస్థితుల్లో భాషా జ్ఞానం మొదలు వివిధ విజ్ఞానాంశాలను తక్కువ మోదాదులోనైన నాటి సమాజానికందించవలసిన అవసరం ఆనాడు ఉండింది. దానికి తగినట్లుగానే నాటి రచయితలు ప్రయత్నాలు చేశారు.

ఆ ప్రయత్నాల ఫలితంగా వివిధ విజ్ఞానాంశాల సమాహార రూపంలో కొన్ని రచనలు వచ్చాయి. ఈ క్రమంలో వచ్చిన గ్రంథాల్లో పెద్దబాల శిక్ష ఆ రోజుల్లో బహుళ ప్రచారాన్ని పొందింది.

పెద్ద బాలశిక్ష తర్వాత కొన్ని శాఖల విజ్ఞానాన్ని పరిచయం చేస్తూ కొన్ని గ్రంథాలు, జిల్లాల సమాచారాలను సమకూరుస్తూ మరి కొన్ని గ్రంథాలు, సాహిత్యంలోని విజ్ఞానాంశాలను ప్రతి పాదిస్తూ ఇంకొన్ని గ్రంథాలు, ఆనాటి మన ప్రజల అవసరాలను తీరుస్తూ రకరాల గ్రంథాలు, రకరకాల పేర్లతో వెలువడినాయి. (పాశ్చాత్య దేశాల్లోను విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం తొలి దశలో ఇదే విధమైన పరిస్థితి కనిపిస్తుంది) తర్వాత ఎన్‌సైక్లోపిడియా బ్రిటానికి స్థాయిలో తెలుగులోను విజ్ఞాన సర్వస్వాల నిర్మాణానికి కృషి జరిగింది. అయితే ఈ ప్రయత్నాలు తెలుగులో పూర్తిగా విజయవంతం కాలేదు. అందుకు కారణం విశ్వ వ్యాప్తంగా విజ్ఞానాన్ని సమీకరించి, క్రోడీకరించి ఒక క్రమ పద్ధతిలో చెప్పేందుకు అవసరమైన అన్ని ఒనరులు మనకు బహుశా అందుబాటులో లేక పోవడమే కావచ్చు. అయినా ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం. ఆంధ్ర విజ్ఞానం. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాలు. విజ్ఞాన సర్వస్వ సంపుటాలు (తె.భా.స) మొదలైన ప్రపంచ స్థాయి విజ్ఞాన సర్వస్వాలు తెలుగులోను కొన్ని వెలువడి ఉన్నాయి.

విజ్ఞాన ప్రసారమే లక్ష్యంగా, ఆయా శాఖల విజ్ఞానాన్ని ఒక క్రమ పద్ధతిలో (విషయ క్రమం లేదా అక్షర క్రమం) చెప్పిన గ్రంథాలనన్నిటిని సమీకరించి చూపగల్గితె, తెలుగు విజ్ఞాన సర్వస్వాల చరిత్ర కొంత వరకైనా తెలుసు కునేందుకు అవకాశ ముంటుంది. ఆ ఉద్దేశంతోనే ఇప్పటి వరకు తెగులో వచ్చిన ఇలాంటి గ్రంథాలను కాలక్రమ పద్ధతిలో (Chronological) ఇక్కడ రేఖా మాత్రంగా ప్రదర్శించడం జరిగింది.

**పెద్దబాలశిక్ష** ఇది 1847లో మొదటిసారిగా వెలువడింది. రచయిత పుదూరి శీతారామ శాస్త్రి, భాష, సాహిత్యం, నీతిశాస్త్రం, గణిత, జ్యోతిష్యాది శాస్త్రాంశాలను పాఠకులకు, ముఖ్యంగా విద్యార్థులకు సులభ గ్రాహ్యంగా

ఉండేటట్లు నిర్మించిన గ్రంథం. దీని ప్రభావం తెలుగు నాట నేటికీ కనిపిస్తూనే ఉంది. 165 సంవత్సరాలుగా ఈ గ్రంథాన్ని అభివృద్ధి పరుస్తూ రచయితలు ప్రచురిస్తూనే ఉన్నారు. ఈ క్రమంలో రకరకాల పెద్ద బాలశిక్షలు వెలువడి ఉన్నాయి. 1997లో కూడా సురభి పెద్ద బాలశిక్ష వచ్చి ఉండటం గమనార్హం. ఆ తర్వాత కూడా కొన్ని వచ్చి ఉండవచ్చును. పెద్ద బాల శిక్షను నిడదవోలు వెంకట్రావు, ఆరుద్ర గార్లు బాలల విజ్ఞాన సర్వస్వంగానే పేర్కొన్నారు.

**పురాణ నామచంద్రిక** 1879లో వచ్చింది. పురాణాల్లోని వివిధాంశాలను సంక్షిప్తంగా పరిచయం చేసిన గ్రంథమిది. ఇందలి విషయాలను అక్షర క్రమంలో కూర్చడం మన విజ్ఞాన సర్వస్వాల నిర్మాణంలో వచ్చిన మార్పుగా చెప్పవచ్చును. రచయిత యనమండ్ర వెంకటరామాయ్య. ఇది ఈ మధ్యనే ద్వితీయ ముద్రణ కూడా పొందింది.

**విశాఖపట్నం జిల్లా వృత్తాంత సంగ్రహం** ఇది 1886లో వచ్చింది. ఒక ప్రాంతానికి చెందిన అన్ని విషయాలను సమీకరించి విష క్రమ పద్ధతిలో చెప్పిన మండల సర్వస్వ గ్రంథమిది. రయిచయిత వెంకట కొండలరావు.

**ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం** 1915 ప్రాంతాల్లో వెలువడింది. ప్రపంచ విజ్ఞానాన్ని సమీకరించి అక్షర క్రమంలో బ్రిటానికా స్థాయిలో చెప్పేందుకు ఉద్దేశించిన విజ్ఞాన సర్వస్వంగా ఇది కనిపిస్తుంది. కాని 3సంపుటాలు మాత్రమే వెలువడి అసమగ్రంగా ఆగిపోయింది. ప్రధాన సంపాదకులు కొమర్రాజు వెంకట లక్ష్మరావు పంతులు గారు.

**వర్ణన రత్నాకరం** 1928-30 మధ్యకాలంలో వెలువడింది. రెండు సంపుటాలుగా ఉంది. సంపాదకుడు లక్ష్మణదాసు. మన సాహిత్యంలోని వివిధ విజ్ఞానాంశాలను ఏర్చికూర్చి పద్యాలకు పద్యాలనే విషయ క్రమ పద్ధతిలో చెప్పిన గ్రంథమిది. అయితే గ్రంథం చివర 'అంగదుడు' మొదలు 'క్షీరసాగర మథనం' వరకు గల ఇందులోని పదాలను అక్షర క్రమంలో పద సూచికల నివ్వడం మన విజ్ఞాన సర్వస్వాల నిర్మాణంలో వచ్చిన మరో మార్పు.

**విద్యార్థి కల్పతరువు**1930 ప్రాంతాల్లో రెండు సంపుటాలుగా వెలువడింది. భాషా, సాహిత్య, ఛందో, అలంకారాది శాస్త్ర విషయాలను విద్యార్థుల అవసరాలకు అనుగుణంగా సమకూర్చిన గ్రంథమిది. రచయిత మునుసూరి వెంకటశాస్త్రి

**ఆంధ్ర విజ్ఞానం** (The Telugu Encyclopaedia) (1938-41) వివిధ శాఖల విజ్ఞానాంశాలను సంక్షిప్తంగా అక్షర క్రమంలో వివరించిన సామాన్య విజ్ఞాన సర్వస్వం. ఏడు సంపుటాల్లో వెలువడింది. రచయిత దేవిడి జమీందారు కందుకూరి బాలసూర్య ప్రసాదరాయ భూపాలుడు.

**వస్తుగణ దీపిక** 1940లో వచ్చింది. ప్రకృతిలోని వివిధ వస్తువుల గుణాలను ఆయుర్వేద వైద్య పరంగా,అక్షర క్రమంలో వివరించిన గ్రంథం. రచయిత ఎర్రా వెంకటస్వామినాయుడు.

**ఆంధ్ర సర్వస్వం** (1947-1961) రెండు సంపుటాలుగా వచ్చింది. ఆంధ్ర ప్రాంతాలకు సంబంధిచి వివిధ శాఖలకు చెందిన విజ్ఞానాన్ని విషయ క్రమ పద్ధతిలో పొందు పరిచిన గ్రంథం. మాగంటి బాపినీడు మొదలైన వాళ్ళు సంపాదక మండలిగా వ్యవహరించారు.

**విజ్ఞాన సర్వస్వ సంపుటాలు** (తె.భా.స) 1947 ప్రాంతాల్లో తెలుగు భాషా,సాహిత్యాల అబివృద్ధి లక్ష్యంగా తెలుగు భాషా సమితి ఏర్పడింది. ప్రపంచ విజ్ఞానాన్ని తెలుగు ప్రజలకందించాలనే ఉద్దేశంతో విజ్ఞాన సర్వస్వ నిర్మాణానికి పూనుకొన్నది. ఇది తెలుగు విశ్వ విద్యాలయంలో 1986లో విలీనమైంది. అప్పటి వరకు ఈ సంస్థ దాదాపు 14సంపుటాలను నిర్మించి ప్రచురించింది. ఆ తర్వాత తెలుగు విశ్వ విద్యాలయం ఆ కార్యక్రమాలను కొనసాగిస్తున్నది. ఇవి అక్షర క్రమం (BEV+Alphabate) లో నిర్మాణమౌతున్న విజ్ఞాన సర్వస్వాలు.

**ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వం** 1951లో వచ్చింది. తెలుగు వ్యాకరణ శాస్త్రాంశాలను అక్షర క్రమంలో వివరించిన గ్రంథం. రచయిత వజ్జల చిన సీతారామ శాస్త్రి.

**శతక వాఙ్మయ సర్వస్వం** 1954లో వెలువడింది. తెలుగులో వచ్చిన శతకాలనన్నిటిని సమీకరించి, వాటిలోని సాంఘిక,సాంస్కృతిక శాస్త్రాది విషయాలను విషయ క్రమ పద్ధతిలో సమకూర్చిన గ్రంథం. రచయిత వేదం వెంకట కృష్ణశర్మ.

**బాలల విజ్ఞాన సర్వస్వం** (1956) పిల్లల కోసం నిర్మించిన ఈ విజ్ఞాన సర్వస్వం 1956లో వచ్చింది. రోదసీ, భూగోళాది శాస్త్రాంశాలు విషయ క్రమ పద్ధతిలో చెప్పబడినాయి. సంపాదకుడు మహమ్మద్ కాసింఖాన్.

**సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం** (1958-1971) ప్రపంచ విజ్ఞానాన్ని అక్షర క్రమ పద్ధతిలో సంక్షిప్తంగా సమకూర్చిన ఈ విజ్ఞాన సర్వస్వం. 8 సంపుటాలుగా వెలువడింది. ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య ప్రధాన సంపాదకులుగా వ్యవహరించారు.

**మాండలిక వృత్తి పద కోశాలు** (1962) వ్యవసాయం,చేనేత, కుమ్మరి, కమ్మరి మొదలైన వృత్తులకు సంబంధించిన వివిధాంశాలను ప్రాకరణికాక్షర క్రమంలో చాలా సంక్షిప్తంగా వివరించిన గ్రంథాలివి. ఒక్కో సంపుటంలో ఒక్కో వృత్తికి సంబంధించిన విషయాలు కూర్చబడ్డాయి. అలా వ్యవసాయం, చేనేత, వాస్తు, కుమ్మరి మొ॥ వృత్తులకు సంబంధించి ఈ పదకోశాలు వెలువడి ఉన్నాయి. ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి, ఆచార్య తూమాటి దొణప్ప, డా॥బూదరాజు రాధాకృష్ణ మొదలైనవారు సంపాదకులుగాను,సంకలన కర్తలు గాను వ్యవహరించారు.

**వస్తుగుణ ప్రకాశిక** 1958లో వచ్చింది. ఇది వస్తు గుణ దీపకను పోలిన గ్రంథం. ఆయా పదాల విషయ సమీకరణ, కూర్పు అక్షర క్రమంలో ఉంది. రచయిత ఏటూరి వాసుదేవ శాస్త్రి. (చూ.వస్తుగుణ దీపిక)

**ఆర్ష విజ్ఞాన సర్వస్వం**1965లో వెలువడింది. రచయిత శీలప్ప రామకృష్ణ శాస్త్రి. వేద పురాణేతిహాసాల్లోని వివిధ విజ్ఞానాంశాలను విషయ క్రమ పద్ధతిలో చెప్పిన విజ్ఞాన సర్వమిది.

**వస్తుగుణ చంద్రిక** 1970 ప్రాంతాల్లో వచ్చింది. ఇది వస్తుగణ దీపికను పోలిన గ్రంథం. రచయిత చెరుకుమిల్లి వెంకట్రామయ్య. (చూ.వ.గు.దీ)

**ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వం** 1971-1976 మధ్య కాలంలో ఇది మూడు సంపటాలుగా వెలువడింది. విషయ సమీకరణ, కూర్పు అక్షర క్రమంలో ఉంది. ఖండవల్లి లక్ష్మీరంజనం, మొదలైన వారు సంపాదకులుగా వ్యవహరించారు.

**సంగీత సంప్రదాయ ప్రదర్శిని** 1973లో (రెండవ ముద్రణ) వెలువడింది. సంగీత శాస్త్ర విషయాలను విషయ క్రమ పద్ధతిలో వివరించిన గ్రంథం. నాలుగు విభాగాలుగా ఉంది. రచయిత సుబ్బారాయ దీక్షితులు.

**శ్రీకృష్ణ దేవరాయాంధ్ర సాహిత్య విజ్ఞాన సర్వస్వం** 1978లో వచ్చింది. తెలుగు సాహిత్యంలోని వివిధ విజ్ఞానాంశాలను విషయ క్రమ పద్ధతిలో పద్యాలకు పద్యాలనే సమకూర్చిన గ్రంథం. సంకలనం నాళం కృష్ణారావు.

**విజ్ఞాన దీపిక** 1976 ప్రాతంలో రెండు సంపుటాలుగా వెలువడింది. ప్రపంచ విజ్ఞానాన్ని విషయ క్రమ పద్ధతిలో వివరించిన విజ్ఞాన సర్వస్వం. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి దీన్ని ప్రచురించింది.

**ఆంధ్ర ప్రదేశ్ దర్శిని** 1976 ప్రాంతాల్లో రెండు భాగాలుగా వెలువడింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి చెందిన విషయాలనన్నిటిని విషయ క్రమ పద్ధతిలో వివరించిన గ్రంథం. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ దీన్ని ప్రచురించింది. సంపాదకులు వై.వి.కృష్ణారావు, ఏటుకూరి బలరామమూర్తి.

**ప్రపంచ రాజ్య సర్వస్వం** 1977లో వచ్చింది. ప్రపంచ దేశాల విజ్ఞానాన్ని విషయ క్రమంలో సమకూర్చిన గ్రంథం. ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాద్ వారు ప్రచురించారు.

**తెలుగు హరికథా సర్వస్వం** 1978లో వెలుడింది. హరికథా వాఙ్మయానికి చెందిన వివిధాంశాలను విషయ క్రమ పద్ధతిలో సమకూర్చిన గ్రంథం. రచయిత ఆచార్య తూమాటి దొణప్ప.

**వేదాంత సర్వస్వం** 1979లో వచ్చిన ఈ గ్రంథం వేదాంత విషయాలను విషయ క్రమ పద్ధతిలో వివరించింది. రచయిత ముదిగొండ వెంకటశాస్త్రి.

**ఆర్య విజ్ఞాన సర్వస్వం** 1982లో వెలువడింది. వేద విజ్ఞానాన్ని విషయ క్రమంలో వివరించిన గ్రంథం. ముఖ్య సంపాదకులు రఘునాథాచార్యులు. టి.టి.డి. తిరుపతి వారు ప్రచురించారు.

**చిల్డ్రన్స్ నాలెడ్జి బ్యాంకు** 1983-84 ప్రాంతాల్లో మూడు సంపుటాలుగా వెలువడింది. ఇది చిన్న పిల్లల విజ్ఞాన సర్వస్వంగా చెప్పదగింది. సమాచార ప్రతిపాదన విషయ క్రమ పద్ధతిలో ఉంది. పుస్తక మహల్ ఢిల్లీ వారు ప్రచురించారు.

**విక్రమ సింహపురి మండల సర్వస్వం** 1983లో వచ్చింది. విక్రమ సింహపురి అంటే నెల్లూరు. ఇప్పుడు దీని పేరు పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా. నెల్లూరు జిల్లాకు చెందిన అన్ని శాఖల సమాచారాన్ని విషయ క్రమంలో చెప్పిన గ్రంథం. నెల్లూరు జిల్లా పరిషత్తు వారు ప్రచురించారు. నల్లపురెడ్డి చంద్రశేఖరరెడ్డి ముఖ్య సంపాదకులుగా వ్యవహరించారు.

**విశ్వ విజ్ఞాన దర్శిని** 1984లో వచ్చింది. ప్రపంచ విజ్ఞానాన్ని విషయ క్రమంలో సంక్షిప్తంగా వివరించిన విజ్ఞాన సర్వస్వం. సంపాదకుడు టి.నరేంద్రదేవ్.

**ఇంటింటా విజ్ఞాన సర్వస్వం** 1984లో వెలుడింది. వివిధ శాస్త్ర విషయాలను విషయ క్రమంలో చెప్పిన ఒక చిన్నపాటి విజ్ఞాన సర్వస్వం.

**తెలుగు సాహిత్య కోశం** 1986 ప్రాంతాల్లో రెండు సంపుటాలుగా వెలువడింది. ఆది కవి నన్నయ మొదలు 1950 వరకు వచ్చిన కావ్యాలు, కవులు,

రచయితలకు సంబంధించిన వివరాలు ఈ గ్రంథంలో చాల సంక్షిప్తంగా ఇవ్వబడ్డాయి. తెలుగు అకాడమి హైదరాబాద్ వారు ప్రచురించారు. నల్లపాటి శివనాగయ్య, ఎం.ప్రమీలారెడ్డి, నీలా జంగయ్య, బి.విజయ భారతి,సంపాదక మండలిగా వ్యవహరించారు.

**నల్లగొండ మండల సర్వస్వం:-** 1986లో వచ్చింది.నల్గొండ జిల్లాకు సంబంధించి, అన్ని రంగాలకు చెందిన సమాచారాన్ని విషయ క్రమంలో కూర్చిన గ్రంథం. రచయిత బి.ఎన్.శాస్త్రి.

**వరంగల్ జిల్లా దర్శని:-** 1986లో వెలువడింది. ఈ జిల్లాకు సంబంధించిన వివిధాంశాలను విషయ క్రమంలో చెప్పిన గ్రంథం. సంపాదకులు కొండాబత్తిని జగదీశ్వర్రావు.

**మహాభారతం-విశ్వవిజ్ఞాన కోశం:-** మహాభారతంలోని విజ్ఞానాంశాల నన్నిటిని పండ్రెండు లోచనాలు (విభాగాలు)గా విభజించి, ధర్మ లోచనం, నీతి లోచనం. వివిధ విజ్ఞాన లోచనం, అదే విధంగా, పండ్రెండు లోచనాలుగా విభజించి ఆయా శాస్త్రాంశాలను ఆయా లోచనాల్లో విషయ క్రమ పద్ధతిలో సంక్షిప్తంగా వివరించిన పిహెచ్.డి సిద్ధాంత గ్రంథం డాక్టర్ మూలంపల్లి చంద్రశేఖరశర్మ.

**హంస వింశతి విజ్ఞాన సర్వస్వం** (1986-1995) విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల హంస వింశతి అనే ప్రబంధం లోని వివిధాంశాలను ఆరోపాలుగా ఎంచుకొని దాదాపు 4000 పదాలకు ప్రాకరణికాక్షర క్రమంలో సంక్షిప్త వివరణలు సమకూర్చిన విజ్ఞాన సర్వస్వం. నాలుగు సంపుటాలుగా ఉంది. మొదటి రెండు సంపుటాలు ముద్రణ పొందాయి. చివరి రెండు సంపుటాలు అముద్రితాలు. రచన, కూర్పు డాక్టర్ గుంజి వెంకటరత్నం (ఈ గ్రంథ రచయిత).

**బాలల విజ్ఞాన సర్వస్వం (సంస్కృతీ విభాగం)** 1990లో వెలువడింది. సంస్కృతీ విభాగానికి సంబంధించి ప్రపంచ విజ్ఞానాన్ని అక్షర క్రమంలో వివరించిన విజ్ఞాన సర్వస్వం.రచయిత బుడ్డిగ సుబ్బరాయన్.

**ఆదిలాబాదు జిల్లా సర్వస్వం** 1990లో వచ్చింది. ఈ జిల్లాకు చెందిన వివిధ విషయాలను విషయ క్రమంలో చెప్పిన గ్రంథం. సంపాదకులు బి.యస్. శాస్త్రి.

**సచిత్ర విజ్ఞాన సర్వస్వం** 1991 ప్రాంతాల్లో వెలువడిన అనువాద గ్రంథం. చిన్నపిల్లల కోసం బొమ్మలతో సహా ముద్రించిన ఒక చిన్న బాలల విజ్ఞాన సర్వస్వం.

**మహబూబ్‌నగర్ జిల్లా సర్వస్వం** 1993లో వచ్చింది. పాలమూర్ (మహబూబ్‌నగర్) జిల్లాకు చెందిన అన్ని రంగాల సమాచారాన్ని విషయ క్రమంలో చెప్పిన గ్రంథం. రచయిత బి.ఎన్. శాస్త్రి.

**వరంగల్ జిల్లా సర్వస్వం** (1998) వరంగల్ జిల్లా సమాచారాన్ని ఆధ్యాయాలుగా విభాగించి, విషయ క్రమంలో వివరించిన గ్రంథం. రచయిత విద్వాన్ తెన్నేటి (టి.వి.సుబ్బారావు).

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం కొమర్రాజు వెంకట లక్ష్మణరావు విజ్ఞాన సరర్వస్వ కేంద్రంలో తయారైన విజ్ఞాన సర్వస్వాలు.

మతములు దర్శనములు (1992) విశ్వసాహితి (1994) History & Culture (1995) భారత భారతి (1999) నాటక విజ్ఞాన సర్వస్వం (2008) మొదలైన విజ్ఞాన సర్వస్వ సంపుటాలు వెలువడినాయి. రసాయన శాస్త్ర సంపుటం (2012) కూడా తయారైనట్లు తెలుస్తున్నది.

**మెదక్ జిల్లా సర్వస్వం** 2001లో వెలువడింది. ఈ జిల్లాకు సంబంధించిన అన్ని విషయాలను 12 అధ్యాయాల్లో విషయ క్రమ పద్ధతిలో వివరించిన గ్రంథం. రచయిత శాస్త్రుల రఘురామశర్మ.

**వరంగల్ జిల్లా విజ్ఞాన సర్వస్వం** 2008 లో వచ్చింది. వరంగల్ జిల్లాకు సంబంధించిన అన్ని రంగాల విజ్ఞానాంశాలను ప్రాకరణికాక్షర క్రమంలో

నిర్మించిన గ్రంథం. మన జిల్లా సర్వస్వాల్లో అక్షర క్రమంలో వచ్చిన తొలి విజ్ఞాన సర్వస్వం ఇది. ప్రధాన సంపాదకులు డాక్టర్ గుంజి వెంకటరత్నం (ఈ గ్రంథ రచయిత).

**ప్రాచీన సమాజ విజ్ఞాన సర్వస్వం** (2012) ప్రస్తుతం ముద్రణలో ఉంది. తెలుగులో విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల పండితారాధ్య చరిత్ర. సింహాసన ద్వాత్రింశిక, శుక సప్తతి, వాణీ విలాస వనమాలిక, హంసవింశతి మొదలైన కావ్యాల్లోని విజ్ఞానాంశాలన్నిటిని ఆరోపాలుగా ఎంచుకొని అక్షర క్రమంలో నిర్మించిన సాహిత్యపర విజ్ఞాన సర్వస్వ మిది. రచయిత డా॥ గుంజి వెంకటరత్నం (ఈ గ్రంథ రచయిత).

ఇలాంటివే రెడ్డి రాజ్య సర్వస్వం, బ్రాహ్మణ రాజ్య సర్వస్వం మొదలైన సర్వస్వ గ్రంథాలు కూడా వెలువడినట్లు తెలుస్తున్నది. మరికొన్ని మండల (జిల్లా) సర్వస్వాలు, ఏక విషయాత్మక (Subject wise) సర్వస్వాలు కూడా వచ్చి ఉండ వచ్చును. ఇవన్నీ కలిసి తెలుగులో 60పైగానే ఉన్నాయి.

వీటిలో చాలా గ్రంథాలకు నేటి విజ్ఞాన సర్వస్వాల స్థాయి లేక పోవచ్చును. అయినా, విజ్ఞాన ప్రసారమే లక్ష్యంగా వెలువడిన పై గ్రంథాలన్నీ పాఠకుల అవసరాన్ని తీరుస్తూ మన విజ్ఞాన సర్వస్వాల చరిత్రకు ఆలంబనంగా నిలుస్తున్నాయి.

# 4

# తెలుగు విజ్ఞాన సర్వస్వాల వర్గీకరణ-నిర్మాణ పద్ధతులు

ప్రపంచ పర్యాప్తంగా వెలువడుతున్న విజ్ఞాన సర్వస్వాల రూప గుణ, స్వభావాదులను బట్టి వాటిని రకరకాలుగా వర్గీకరించడం జరిగింది. ఎన్‌సైక్లొపిడియా బ్రిటానికా (1) General Encyclopaedia (2) Encyclopaedic Dictionary (3) Modern Enlcyclopaedia (4) Encyclopaedia for special interests. (5) Children's Encyclopadia (6)Special Encyclopaedia (7) Encyclopaedia of country and region. అని ఏడు విభాగాలుగా వర్గీకరించింది.

ఎన్‌సైక్లొపిడియా అమెరికానా కూడా ఇంచుమించు ఇదే వర్గీకరణ నిస్తూ కొన్ని అదనంగా చూపింది. Mongraphic Encyclopaedia, Shorter Encyclopaedia, Early Special Encyclopaedia అనే విభాగాలను చేర్చింది. గ్రోలియర్ ఎన్‌సైక్లొపిడియ బాలల విజ్ఞాన సర్వస్వాన్ని Children's Encyclopadia, Encyclopadia for older Children అని రెండు విభాగాలుగా చూపింది. 21వ శతాబ్ధపు ఎన్‌సైక్లొపిడియా (Junior Encyclopadia, Children's Encyclopadia (Sub Jr. Encyclopadia) అని బాలల విజ్ఞాన సర్వస్వాన్ని రెండుగా విభాగించి చూపింది. ఇలాంటివే పాశ్చత్య విజ్ఞాన సర్వస్వాల్లో మరికొన్ని వర్గీకరణలు కూడా కనిపిస్తాయి. వాటన్నిటిని కలిపి పాశ్చాత్య విజ్ఞాన సర్వస్వాల వర్గీకరణాన్ని స్థూలంగా ఈ విధంగా చూపవచ్చును.

## పాశ్చాత్య విజ్ఞాన సర్వస్వాల వర్గీకరణం



తెలుగులోను రకరకాల విజ్ఞాన సర్వస్వాలు వచ్చి ఉన్నాయి. వాటన్నిటిని భాగ, విభాగాలుగా వర్గీకరించి చూపిన దాఖలాలు కనిపించవు. ఎప్పుడో దాదాపు 20ఏళ్ళ క్రితం (1995) డా॥ గుంజి వెంకటరత్నం (ఈగ్రంథ రచయిత) విజ్ఞాన సర్వస్వాలు విశ్లేషణాత్మక అధ్యయనం అనే గ్రంథంలో అప్పటికి లభించిన సమాచారాన్ని దృష్టిలో పెట్టుకొని తెలుగు విజ్ఞాన సర్వస్వాల రూప గుణాదులను బట్టి స్థూలంగా విభజించడం జరిగింది. తర్వాత ఎన్నో విజ్ఞాన సర్వస్వాలు వెలువడినాయి. వాటి రూప గుణ విశిష్టాదులను దృష్టిలో పెట్టుకొని, పైన చూపిన పాశ్చాత్య విజ్ఞాన సర్వస్వాల వర్గీకరణ ఆధారంగా, మన విజ్ఞాన సర్వస్వాలను కూడా వర్గీకరించడం సమంజసంగా ఉంటుంది.

పాశ్చాత్య విజ్ఞాన సర్వస్వాల వర్గీకరణమాధారంగా మన విజ్ఞాన సర్వస్వాలను ఈ విధంగా వర్గీకరించ వచ్చును. (1) సమాన్య విజ్ఞాన సర్వస్వం (General Encyclopaedia) (2) ప్రత్యేక విజ్ఞాన సర్వస్వం ( Special Encyclopaedia) (3) నిఘంటు రూప విజ్ఞాన సర్వస్వం (Encyclopaedic Dictionary) (4) ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వం (Regional Encyclopaedia) (5) బాలల విజ్ఞాన సర్వస్వం (Children's Encyclopaedia) (6) ఇతర విజ్ఞాన సర్వస్వాలు



**సామాన్య విజ్ఞాన సర్వస్వం** విశ్వ వ్యాప్తంగా ఉండే అన్ని శాఖల విజ్ఞానాన్ని ఏకత్ర సంఘటించి, ఒక క్రమ పద్ధతిలో క్రోడీకరించి, వివరించిన ఉద్గ్రంథాలు. ఇవి క్రమ సంఖ్యలో సంపుటాలుగా వెలువడుతున్నాయి. ఇందులో మళ్ళీ రెండు ప్రభేదాలున్నాయి. విస్తృత విషయ రూప విజ్ఞాన సర్వస్వం (Monographic Encyclopaedia) సంక్షిప్త విషయ రూప విజ్ఞాన సర్వస్వం (Short essay type Encyclopaedia) ఈ విభాగాన్ని ఎన్‌సైక్లోపిడియా ఆమెరికానా చూపింది. ఆరోపాలకు సంబంధించిన సమాచాన్ని విస్తృత ప్రాతిపదికన దీర్ఘంగా వివరించి చెప్పింది విస్తృత విషయ రూప విజ్ఞాన సర్వస్వం. అదే విషయాన్ని సంక్షిప్తంగా సమకూర్చింది సంక్షిప్త విషయ రూప విజ్ఞాన సర్వస్వం.

తెలుగు విజ్ఞాన సర్వస్వాల్లో ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం , ఆంధ్ర విజ్ఞానం, సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాలు, విజ్ఞాన సర్వస్వ సంపుటాలు (తె.భా.స) ప్రపంచ రాజ్య సర్వస్వం. విశ్వ విజ్ఞాన దర్శిని మొదలైనవన్నీ సామాన్య విజ్ఞాన సరస్వాల వర్గంలో చేరుతాయి. వీటిలో మళ్ళీ విషయ ప్రతిపాదన దీర్ఘంగా ఉన్న ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం, విజ్ఞాన సర్వస్వ సంపుటాలు. ప్రపంచ రాజ్య సర్వస్వం. విజ్ఞాన దీపిక. అనేవి విస్తృత విషయ రూప విజ్ఞాన సర్వస్వ విభాగంలో చేరుతాయి. విషయం సంక్షిప్తంగా సమకూర్చిన ఆంధ్ర విజ్ఞానం. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాలు, విశ్వ విజ్ఞాన దర్శిని అనేవి సంక్షిప్త విషయ రూప విజ్ఞాన సర్వస్వాల విభాగం లోనికి వస్తాయి.

**ప్రత్యేక విజ్ఞాన సర్వస్వం** ఏదో ఒక శాఖ విజ్ఞానానికి సంబంధించి గాని, లేదా అనుబంధ శాఖల విజ్ఞానాంశాలకు సంబంధించి గాని, అన్ని విషయాలను సమీకరించి, క్రోడీకరించి ఒక క్రమ పద్ధతిలో సమాచారాన్ని సమకూర్చిన గ్రంథాలు ప్రత్యేక విజ్ఞాన సర్వస్వాలు. వివిధ వస్తువుల గుణాలను ఆయుర్వేద వైద్య శాస్త్ర రీత్యా వివరించిన వస్తు గుణ దీపిక, వస్తు గుణ ప్రకాశిక, వస్తు గుణ చంద్రిక ఈ విభాగంలో చేరుతాయి. అదే విధంగా వ్యాకరణ శాస్త్రాంశలను మాత్రమే సమకూర్చిన ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వం.

సంగీత శాస్త్రాంశాలను వివరించిన సంగీత సంప్రదాయ దర్శిని. తెలుగు హరికథా సర్వస్వం. వేదాంత విషయాలను మాత్రమే వివరించిన వేదాంత సర్వస్వం మొదలైనవన్నీ కూడా ఈ వర్గంలోకే వస్తాయి.

**నిఘంటు రూప విజ్ఞాన సర్వస్వాలు** ప్రముఖ వ్యక్తులు, సంస్థలు, శాస్త్రాలు, కళలు మొదలైన వివిధ విజ్ఞాన శాఖల అంశాలను ఆరోపాలుగా ఎంచుకొని వాటిని రెండు మూడు వాక్యాల్లో చాలా సంక్షిప్తంగా చెప్పిన గ్రంథాలు ఈ వర్గంలో చేరతాయి. ఉదా: మాండలిక వృత్తి పద కోశాలు (ఒక్కొక్క సంపుటంలో వ్యవసాయం, చేనేత మొదలైన ఒక్కొక్క వృత్తికి సంబంధించిన అంశాలను చాలా సంక్షిప్తంగా చెప్పిన గ్రంథాలు) తెలుగు సాహిత్య కోశాలు (ప్రాచీన కాలం నుండి అర్వాచీన కాలం (1950)వరకు వచ్చిన కావ్యాల, కవుల వివరాలను సంక్షిప్తంగా చెప్పిన గ్రంథాలు)ఈ వర్గంలోనివి.

**ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వాలు** దేశీయ ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వాలనే బ్రిటానికా ఈ వర్గంలో చేర్చింది. 21వ శతాబ్దపు ఎన్‌సైక్లోపిడియా కాంటినెంటల్ ఎన్‌సైక్లోపిడియాను కూడా పేర్కొంది. అది కూడ ఈ వర్గానికి చెందినదే. దేశమైనా, ఖండమైనా ఏదో ఒక ప్రాంతానికి చెందిన భూభాగాలే కాబట్టి వీటినన్నిటిని ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వాలుగా పరిగణించడం సమంజసం.

తెలుగు ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వాల స్వరూప స్వభాలను బట్టి వీటి పరిధి ఖండం, దేశం మాత్రమే గాకుండా రాష్ట్రం, మండలం (జిల్లా) వరకు పెంచవలసి ఉంది. ఎందుకంటే రాష్ట్రానికి, లేదా మండలాల (జిల్లాలకు)కు సంబంధించిన  అన్ని శాఖల విజ్ఞానాన్ని సమకూర్చిన గ్రంథాలే తెలుగులో ఎక్కువగా వచ్చి ఉన్నాయి. ఆంధ్ర సర్వస్వం, ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వం, ఆంధ్రప్రదేశ్ దర్శిని, ఇవి మూడు ఆంధ్ర ప్రాంతాలకు సంబంధించిన విజ్ఞానాంశాలను సమకూర్చిన ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వాలు. విక్రమ సింహపురి మండల సర్వస్వం (నెల్లూరు) నల్లగొండ మండల సర్వస్వం. వరంగల్ జిల్లా దర్శిని, వరంగల్ జిల్లా సర్వస్వం, మహబూబ్‌నగర్ జిల్లా సర్వస్వం, అదిలాబాదు, మెదక్‌జిల్లా సర్వస్వాలు. వరంగల్ జిల్లా విజ్ఞాన సర్వస్వం.

ఇవి ఆయా జిల్లాలకు చెందిన వివిధ విజ్ఞానాంశాలను సమకూర్చిన ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వాలనదగిన గ్రంథాలు. ఈ వర్గంలో వరంగల్ జిల్లా విజ్ఞాన సర్వస్వం ఒక్కటే అక్షర క్రమ పద్ధతిలో నిర్మించిన విజ్ఞాన సర్వస్వం.

**బాలల విజ్ఞాన సర్వస్వాలు** విద్యార్థులైన బాల బాలికల కోసం, వారి విజ్ఞానావగాహన కనువుగా, ప్రత్యేకంగా నిర్మించిన విజ్ఞాన సర్వస్వాలు. పాశ్చాత్య దేశాల్లో వచ్చిన బాలల విజ్ఞాన సర్వస్వాల స్వరూప స్వభావాదులను బట్టి వీటిని మళ్ళీ జూవెనైల్స్ అని, జూనియర్ ఎన్సైక్లోదపిడియాలని విభాగించడం జరిగింది.

తెలుగులో బాలల విజ్ఞాన సర్వస్వాలుగా భావింపబడుతున్న పెద్ద బాలశిక్ష, బాలల విజ్ఞాన సర్వస్వం, చిల్డ్రన్స్ నాలెడ్జీ బాంకు, బాలల విజ్ఞాన సర్వస్వం (సంస్కృతీ విభాగం) సచిత్ర విజ్ఞాన సర్వస్వం సుంభి పెద్ద బాలశిక్ష, మొదలైన రకరకాల గ్రంథాలు వెలువడి ఉన్నాయి. ఇవేవీ విజ్ఞాన సర్వస్వాల స్థాయిలో లేవని పండితుల అభిప్రాయం. ఇంగ్లీషులోని బాలల విజ్ఞాన సర్వస్వం చిల్డ్రన్స్ బ్రిటానికి స్థాయిలో లేకపోయినా, కనీసం తమిళ బాలల విజ్ఞాన సర్వస్వం సెరియావురు కలైకలంజ జయం (10సంపుటాలు), కన్నడ బాలల విజ్ఞాన సర్వస్వం "జ్ఞాన గంగోత్రి" (7సంపుటాలు) వంటివి కూడా తెలుగులో ఇప్పటి వరకు రాకపోవడం శోచనీయం.

**ఇతరాలు** (సాహిత్య పర విజ్ఞాన సర్వస్వాలు) పైన చెప్పిన వర్గాల్లో దేనిలోను చేరని కొన్ని విజ్ఞాన సర్వాసాలు తెలుగులో కనిపిస్తున్నాయి. వాటిలో ముఖ్యంగా చెప్పుకోవలసినవి సాహిత్యంలో అక్కడక్కడా కనిపించే విజ్ఞానాంశాల నన్నిటిని ఏర్చి,కూర్చి ఒక క్రమ పద్ధతిలో చెప్పిన గ్రంథాలు, వీటిని సాహిత్య పర విజ్ఞాన సర్వస్వాలని పేర్కొనడం జరిగింది. పురాణ నామ చంద్రిక, వర్ణన రత్నాకరం, శ్రీకృష్ణ దేవరాయాంధ్ర విజ్ఞాన సర్వస్వం, వేదాంత సర్వస్వం. ఆర్ష విజ్ఞాన సర్వస్వం. ఆర్య విజ్ఞాన సర్వస్వం. పూర్వ గాథా లహరి, మహాభారతం, విశ్వ విజ్ఞానకోశం, హంస వింశతి, విజ్ఞాన సర్వస్వం, ప్రాచీన సమాజ విజ్ఞాన సర్వస్వం. (ముద్రణలో ఉంది) మొదలైనవి ఇలాంటివే

హిందీలోను పౌరాణిక కోశ్, ప్రేమచంధ విశ్వకోశ్, మహా భారత్ నామానుక్రమణిక, కళ్యాణ్ తీర్థాంక్ మొదలైన గ్రంథాలు వెలువడినాయి. మలయాళంలోను వెట్టం మణి సమకూర్చిన పౌరాణిక విజ్ఞాన సర్వస్వం వెలువడింది. దీనినే ఇంగ్లీషులోని కనువదించి Puranic Encyclopaedia గా ప్రచురించారు. ఇవన్నీ పరిశీలిస్తే సాహిత్య పర విజ్ఞాన సర్వస్వం అనే వర్గాన్ని ఏర్పాటు చేయడం అవసరమేమో అనిపిస్తుంది.

అయితే పైన చెప్పిన గ్రంథాల్లో కొన్ని మాత్రమే విజ్ఞాన సర్వస్వాలుగా చెప్పదగిన వని, ఆంధ్రప్రదేశ్ దర్శిని మండల సర్వస్వాలు, వర్ణనవరత్నాకరం, పూర్వ గాధాలహరి, పురాణ నామచంద్రిక మొదలైన గ్రంథాలు విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల గ్రంథాలే గాని, విజ్ఞాన సర్వస్వాలుగా పరిగణించలేమని ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు అభిప్రాయపడినారు.

> "Dr. G.Venkat Ratnam has stretched the meaning of Encyclopadia to include works, of Encyclopadia nature, which are not really Encyclopadias like Andhra Pradesh Darshini, Nalgonda mandala Sarvaswam Purvagatha Lahari etc.," (C.L. Intro)

భద్రిరాజు గారి పై అభిప్రాయాన్నిబట్టి ఆంధ్రప్రదేశ్ దర్శిని, నల్గొండ మండల సర్వస్వం మొదలైన ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వాలు పూర్వ గాధాలహరి, పురాణ నామ చంద్రిక ఈ తరహా గ్రంథాలు విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గలవే గాని విజ్ఞాన సర్వస్వాలుగా చెప్పదగినవి కావని తెలుస్తున్నది. కాని మహాభారత మొక విశ్వ విజ్ఞానమని ఆచార్య దివాకర్ల వెంకటావధాని గారు, పండిరాధ్య చరిత్ర తొలి తెలుగు విజ్ఞాన సర్వస్వమని ఆచార్య తిమ్మావజ్జల కోదండ రామయ్యగారు అభిప్రాయ పడినారు. ఇలాంటివి విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల కావ్యాలే గాని, నేటి విజ్ఞాన సర్వస్వాలతో పోల్చదగినవి కావని మరొకొందరు చెప్పారు.

పెద్ద బాల శిక్ష, బాలల విజ్ఞాన సర్వస్వమని నిడదవోలు వెంకట్రావు గారు, ఆరుద్రగారు అభిప్రాయపడినారు. (వ్యాస పీఠం పు. 193-199) ఆంధ్ర సర్వస్వం ఆనాటి విజ్ఞానాంశాలను చక్కగా వివరించి ప్రజలకందించిన ఒక విజ్ఞాన సర్వస్వంగా, ఆ గ్రంథానికి ముఖ బంధం రాసిన కట్టమంచి రామ లింగారెడ్డి గారు ప్రశంసించారు. కాని అది ఒక విజ్ఞాన సర్వస్వంగా చెప్పదగినది కాదని భావరాజు వెంకటకృష్ణారావు గారు దానిలోని లోపాలను చూపుతూ భారతి (1943జూన్)లో ఒక వ్యాసం రాశాడు. ఈ విధంగా తెలుగు విజ్ఞాన సర్వస్వాల విషయంలో పండితుల్లో బేధాభిప్రాయాలు కనిపిస్తున్నాయి.

ఆయా కాలాల్లో అధిక వ్యాప్తిలోనున్న వివిధ శాస్త్ర సాంకేతికాంశాలను అధికంగా పొందుపరిచిన మహాభారతంగాని, పండితారాధ్యచరిత్రగాని, ఇలాంటివే అయిన వాణీ విలాసవనమాలిక, హంసవింశతి గాని, మరేదైనాగాని, అవి ప్రధానంగా కావ్యాలు. విజ్ఞాన ప్రసారాపేక్ష గల కవులు తమ కావ్యాల్లో విజ్ఞానాంశాలలు ఎక్కువగా చెప్పడం జరిగింది. అందువలన వీటిని విజ్ఞాన సర్వస్వాలనడం కంటే విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల కావ్యాలని చ్పెడమే సమంజసంగా ఉంటుంది. ఇలాంటి కావ్యాల్లోని విజ్ఞానాంశాలనన్నిటిని ఏర్చికూర్చి అక్షర క్రమంలో సమాచారాన్ని సమకూర్చినప్పుడు, వీటిని ఆయా కావ్యాలకు సంబంధించిన విజ్ఞాన సర్వసాలుగా చెప్పవచ్చును. ఉదాహరణ హంసవింశతి-విజ్ఞాన సర్వస్వం, ప్రాచీన సమాజ విజ్ఞాన సర్వస్వం మొదలైనవి.

ఇకపోతే తెలుగులో వచ్చిన ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వాలను, సాహిత్య పరవిజ్ఞాన సర్వస్వాలను , విజ్ఞాన సర్వస్వాలుగా చెప్పేందుకు వీలులేదని పండితుల అభిప్రాయం. భద్రిరాజు గారు ప్రపంచ వ్యాప్తంగా నేడు వెలువడుతున్న విజ్ఞాన సర్వస్వాలను దృష్టిలో పెట్టుకొని పై అభిప్రాయాన్ని చెప్పినట్లు తెలుస్తున్నది. దీనికి కారణాలు లేక పోలేదు. పాశ్చాత్య విజ్ఞాన సర్వస్వాల వర్గీకరణలో ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వాలు దేశాలకు, ఖండాలకు మాత్రమే పరిమితం చేసి చెప్పబడ్డాయే గాని రాష్ట్ర సంబంధమైన, జిల్లా సంబంధమైన వాటిని అవి పేర్కొనలేదు. మన మండల సర్వస్వాలను విజ్ఞాన సర్వస్వాలుగా

పేర్కొనక పోవడానికి ఇదొక కారణం కావచ్చు. నేటి విజ్ఞాన సర్వస్వాలన్నీ అక్షర క్రమ పద్ధతిలోనే వస్తుండటం విజ్ఞాన సర్వస్వాలంటే ఆధునిక నిఘంటువుల్లాగ అక్షర క్రమంలో ఉండాలనే భావన సాహిత్య లోకంలో సర్వత్ర కనిపిస్తుండటం మరో కారణం కావచ్చును. మన మండల (జిల్లా) సర్వస్వాలన్నీ విషయ క్రమ పద్ధతిలో వచ్చినవే గాని, అక్షర క్రమంలో వచ్చిన జిల్లా విజ్ఞాన సర్వస్వాలు మొన్నమొన్నటి వరకు రాలేదు. 2008లో వచ్చిన వరంగల్ జిల్లా విజ్ఞాన సర్వస్వమొక్కటే అక్షర క్రమంలో నిర్మించిన జిల్లా విజ్ఞాన సర్వస్వం.

సాహిత్యంలోని విజ్ఞానాంశాలను ఏర్చికూర్చి ఒక క్రమ పద్ధతిలో చెప్పిన గ్రంథాలను పాశ్చాత్య విజ్ఞాన సర్వస్వాలు ఒక వర్గంగా విభాగించి చూపలేదు. వీటిని విజ్ఞాన సర్వస్వాలుగా పరిగణించక పోవడానికి ఇదొక కారణం కావచ్చు. తెలుగులో మాత్రం ఇలాంటివి దాదాపు 10కి పైగానే వచ్చి ఉండటం వలన వీటి గుణ రూపాదులను బట్టి ఇతర వర్గాల్లో చేర్చేందుకు అవకాశం లేకుండటాన్ని బట్టి, వీటినన్నిటిని సాహిత్య పర విజ్ఞాన సర్వస్వాలు (అంటే సాహిత్యంలోని విజ్ఞానాంశాలను ఏర్చికూర్చి క్రమ పద్ధతిలో వివరించిన గ్రంథాలు)గా పరిగణించి ప్రత్యేక వర్గంగా విభాగించడం జరిగింది. తెలుగులో వచ్చిన ఈ తరహా గ్రంథాలను పరిశీలిస్తే మూడు తీరుగా కనిపిస్తాయి. కావ్యాల్లోని విజ్ఞానాంశాలకు సంబంధించి పద్యాలకు పద్యాలనే ఒక పద్ధతిలో సేకరించిన గ్రంథాలు. వర్ణరత్నాకరము. శ్రీకృష్ణ దేవరాయాంధ్ర సాహిత్య విజ్ఞాన సర్వస్వం మొదలైనవి. ఈ విజ్ఞాన సర్వస్వాలు చాలా వరకు అక్షర క్రమంలో లేకపోవడం రెండో కారణం కావచ్చును. ఒక కావ్యం, లేదా కొన్ని కావ్యాలు, లేదా ఒక సాహిత్య ప్రక్రియకు (వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు మొ॥) సంబంధించిన విజ్ఞానాంశాలను వివరించ దలచు కొన్నప్పుడు వాటిలోని అంశాలను అధిక శాతం అవి ప్రతిపాదించేవిగా ఉండాలి. అప్పుడే అవి ఆయా కావ్యాలకు లేదా సాహిత్య ప్రక్రియలకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వాలుగా అనిపించు కుంటాయి. మనకున్న ఈ తరహా గ్రంథాలు పురాణ నామ చంద్రిక, పూర్వ గాథా లహరి మొదలైనవి పురాణాల్లోని విజ్ఞానాన్ని

అధిక శాతం వివరించినవి గాకుండా ఏవో కొన్ని అంశాలకే పరిమితమైన చిన్న గ్రంథాలుగా కనిపిస్తాయి. అందుకే ఇలాంటి గ్రంథాలను కూడా విజ్ఞాన సర్వస్వాలుగా చెప్పేందుకు వీలు లేదని పండితులు అభిప్రాయ పడుతున్నారు.

అయితే మలయాళంలో వచ్చిన పౌరాణిక విజ్ఞాన సర్వస్వము (Puranic Encyclopaedia) హిందిలో వచ్చిన పురాణ కోశ్ మొదలైనవి పురాణ సాహిత్యంలోని విజ్ఞానాన్ని అధిక శాతం వివరించడమే గాకుండా అక్షర క్రమంలోనిర్మించబడి ఉండటం చేత అవి విజ్ఞాన సర్వస్వాలు గానే పరిగణింప బడుతున్నాయి. ఈ దృష్టితో చూచినప్పుడు తెలుగులో వచ్చిన హంసవింశతి- విజ్ఞాన సర్వస్వం. ప్రాచీన సమాజ విజ్ఞాన సర్వస్వం మొదలైన గ్రంథాలను సాహిత్య పర విజ్ఞాన సర్వస్వాలుగా చెప్పవచ్చును.

బాలల విజ్ఞాన సర్వస్వాలుగా చెప్పదగినవి తెలుగులో దాదాపు 10వరకు వచ్చి ఉన్నాయి. వాటిలో అంగ్లంలోని బుక్ ఆఫ్ నాలెడ్జి తీరులో తెలుగులో మూడు సంపుటాలుగా వెలువడిన చిల్డ్రన్స్ నాలెడ్జి బ్యాంకు, బాలల విజ్ఞాన సర్వస్వం (సంస్కృతీ విభాగం) చిన్న పిల్లల కోసం చిత్ర పటాలతో నిర్మించిన సచిత్ర విజ్ఞాన సర్వస్వం మొదలైనవి మాత్రమే బాలల విజ్ఞాన సర్వస్వాలుగా చెప్పదగి ఉన్నవి. ఇవి కూడా సమగ్రంగా నిర్మించినవి కావు. అందువలన ఒక సమగ్రమైన బాలల విజ్ఞాన సర్వస్వం తెలుగులో ఇప్పటి వరకు రాలేదనే చెప్పాలి.

పై విషయాలనన్నింటిని పరిశీలించిన మీదట ఆధునిక విజ్ఞాన సర్వస్వాలు,విశ్వవిజ్ఞానాన్ని గాని, లేదా ఒక శాఖ విజ్ఞానాన్ని గాని, లేదా ఒక ప్రాంత విజ్ఞానాన్ని గాని, లేదా సాహిత్యాది మరే రంగానికి చెందిన విజ్ఞానాన్ని గాని వీలైనంత సమగ్రంగా సమీకరించి, ఒక క్రమ పద్ధతిలో చెప్పిన గ్రంథాలు విజ్ఞాన సర్వస్వాలుగా పరిగణింపబడతాయని తెలుస్తున్నది. అవి కూడా ముఖ్యంగా అక్షర క్రమంలో ఉండాలనేది నేటి పరిశోధకుల భావనగా కనిపిస్తున్నది.

**నిర్మాణ పద్ధతులు** ముఖ్యంగా విషయ క్రమ పద్ధతి, అక్షర క్రమ పద్ధతి అనే రెండు మార్గల్లో విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం జరుగుతుంటుంది. నేటి విజ్ఞాన సర్వస్వాలన్నీ చాలా వరకు అక్షర క్రమంలోనే వస్తున్నా, కొన్ని విషయ క్రమంలో కూడా వస్తున్న విజ్ఞాన సర్వస్వాలు లేక పోలేదు. పాశ్చాత్య దేశాల్లోను, మొదట్లో విషయ క్రమ విజ్ఞాన సర్వస్వాలే వచ్చాయి. 1704లో అక్షర క్రమంలో నిర్మించిన తొలి ఇంగ్లీష్ విజ్ఞాన సర్వస్వం వెలువడింది. అంతకు ముందు అక్కడున్నవన్నీ విషయ క్రమంలో వచ్చిన ఎన్‌సైక్లోపిడియాలే. కాబట్టి ఏ పద్ధతిలో విజ్ఞాన సర్వస్వాన్ని నిర్మించినా అది తానెన్నుకొన్న విజ్ఞాన రంగం లేదా రంగాలకు చెందిన విజ్ఞానాంశాలన్నిటిని వీలైనంత సమగ్రంగా సమీకరించి చెప్పవలసి ఉంటుందని తెలుస్తున్నది. ఈ దృష్టితో చూచినప్పుడు ఆయా రంగాలకు చెందిన వీలైనంత సమగ్ర సమాచారంతో ఇప్పటి వరకు తెలుగులోకి వచ్చిన విజ్ఞాన సర్వస్వాలను ఈ విధంగా వింగడించి చూప వచ్చును.



**1. విషయ క్రమ పద్ధతిలో వచ్చిన విజ్ఞాన సర్వస్వాలు** ఆంధ్రప్రదేశ్ దర్శిని, విశ్వ విజ్ఞాన దర్శిని, విక్రమ సింహపురి మండల సర్వస్వం, నల్గొండ మండల సర్వస్వం, ఆదిలాబాదు జిల్లా సర్వస్వం, వరంగల్ జిల్లా సర్వస్వం, మెదక్‌జిల్లా సర్వస్వం, మహబూబ్‌నగర్ జిల్లా సర్వస్వం. సచిత్ర విజ్ఞాన సర్వస్వం మొదలైనవి.

**2. అక్షర క్రమ పద్ధతిలో నిర్మించిన విజ్ఞాన సర్వస్వాలు** ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం. ఆంధ్రవిజ్ఞానం, సంగ్రహాంధ్ర విజ్ఞానాంశాలు వస్తు గుణ దీపిక, వస్తు గుణ ప్రకాశిక, వస్తు గుణ చంద్రిక, విజ్ఞాన సర్వస్వ సంపుటాలు (అ.భా.స) మాండలిక వృత్తి పద కోశాలు, తెలుగు సాహిత్య కోశాలు, ఆంధ్రదేశ చరిత్ర భోగోళ సర్వస్వం, హంస వింశతి విజ్ఞాన సర్వస్వం, వరంగల్ జిల్లా విజ్ఞాన సర్వస్వం, బాలల విజ్ఞాన సర్వస్వం (సంస్కృతి విభాగం) ప్రాచీన సమాజ విజ్ఞాన సర్వస్వం మొదలైనవి.

విషయ క్రమ పద్ధతిలో మళ్ళీ రెండు అవాంతర పద్ధతులున్నాయి. (1) విషయ ప్రాధాన్య పద్ధతి (Subject wise system) (2) కాలానుసరణి పద్ధతి (Chronological system) విషయ ప్రాధాన్య పద్ధతి అంటే మనం చెప్పదలచుకొన్న విజ్ఞానాంశాల నన్నిటిని కొన్ని ప్రకరణాలు లేదా అధ్యాయాలుగా విభజించుకొని వాటిని ప్రధాన్యతా పరంగా క్రమంగా క్రోడీకరించుకొని తగిన సమాచారాన్ని సమకూర్చడం విషయ ప్రాధాన్య పద్ధతి. (2) కాలానుసరణి పద్ధతి ఒక విజ్ఞాన సర్వస్వంలో సమకూర్చ వలసిన విజ్ఞానాంశాలను కాల క్రమానుగతంగా వివరించుకుంటూ పోవడం కాలానుసరణి పద్ధతి. పైన చెప్పిన మన తెలుగు విజ్ఞాన సర్వాలన్నీ చాలవరకు విషయ ప్రాధాన్య పద్ధతిలో వచ్చినవి గానే కనిపిస్తున్నాయి.

అక్షర క్రమ పద్ధతిలోను కొన్ని ప్రభేదాలున్నాయి. 1.అక్షర సమీకరణ పద్ధతి (Unit Letter System) 2.అక్షర విచ్ఛిన్న పద్ధతి (Split letter System) 3. ప్రాకరణికాక్షర క్రమం (Sectional Alphabate) 4.విహంగ వీక్షణం + అక్షర క్రమం (Birds eye view + Alphabate) (source: word Bank encyclopaedia)

అక్షర సమీకరణ పద్ధతి అంటే ఒక అక్షరానికి చెందిన ఆరోపాల నన్నిటిని ఒకే సంపుటంలో సమకూర్చడం. ఆరోపాలు ఎక్కువగా ఉన్నప్పుడు వాటిని రెండు, మూడు సంపుటాల్లో క్రమంగా సమీకరించడం. అదే విధంగా ఆరోపాలు తక్కువగా ఉన్నప్పుడు ఒకటి, రెండు, మూడు అక్షరాలకు సంబంధించిన ఆరోపాల నన్నిటిని ఒకే సంపుటంలో సమకూర్చడం కూడా జరుగుతుంది. ఈ పద్ధతిలో ఆరోపం మొదటి అక్షరం మారినప్పుడల్లా సంపుటం కూడా మారుతుంది. ఉదా:- ఇంగ్లీషులోని world book encyclopaedia తెలుగులోని ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం. ఇందులో 'అ'కు చెందిన ఆరోపాలు 'అ-అహ్రి' వరకు రెండు సంపుటాల్లో కూర్చడం జరిగింది.

**అక్షర విచ్ఛిన్న పద్ధతి** ఆరోపాలను అక్షర క్రమంలో అమర్చే విధానంలో ఒక అక్షరానికి చెందిన ఆరోపాలను ఒకే సంపుటంలోగాకుండా వీటిని విడగొట్టి (Split చేసి) తదుపరి సంపుటంలో సంగ్రహించి చెప్పడం. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాలు 8 సంపుటాలు ఈ పద్ధతిలోనే కూర్చబడ్డాయి. మొదటి సంపుటలో 'అంక గణితం' మొదలు అర్ష్ణ భూగోళం వరకు, రెండవ సంపుటలో 'ఆర్ష వాస్తు మొదలు కృష్ణానది' వరకు గల ఆరోపాలు సమకూర్చడం జరిగింది. ఇదే విధంగా 8 సంపుటాల్లోను ఆరోపాలు Split letter పద్ధతిలో కూర్చబడినాయి. ఆంధ్ర విజ్ఞానం కూడా ఇదే పద్ధతిలో వచ్చిన విజ్ఞాన సర్వస్వం .

**ప్రాకరణి కాక్షర క్రమం** ఈ పద్ధతిలో నిర్మించిన విజ్ఞాన సర్వస్వం రెండు భాగాలుగా ఉంటుంది. మొదటి భాగం విహంగ వీక్షణం. విజ్ఞాన సర్వస్వంలో సమకూర్చ దలచుకొన్న విజ్ఞానాంశాలన్నీ సుదీర్ఘంగా శీర్షికలు-ఉపశీర్షికలతో (దాదాపు 200-300పుటల వరకు, అవసరమనుకుంటే అంతకుపైన కూడా) వివరించడం మొదటి భాగం. దీన్ని విహంగ వీక్షణం అంటారు. రెండో భాగంలో అకారాదిగా క్రోడీకరించిన ఆరోపాలకు తగిన సమాచారం సమకూర్చడం జరుగుతుంది. ఈ విధంగా ఈ పద్ధతిలో నిర్మించిన విజ్ఞాన సర్వస్వం రెండు విభాగాలుగా ఉంటుంది. ఉదా:- Book of Knowledge.

తెలుగులో విజ్ఞాన సర్వస్వ సంపుటాలు (ఆ.భా.స) వరంగల్ జిల్లా విజ్ఞాన సర్వస్వం మొదలైనవి.

తెలుగులో విషయ క్రమ పద్ధతిలో నిర్మించిన విజ్ఞాన సర్వస్వాలన్నీ చాలా వరకు విషయ ప్రాధాన్య పద్ధతిలో వచ్చినవే. కాలానుసరణి పద్ధతిలో వచ్చిన విజ్ఞాన సర్వస్వాలు అంతగా కనిపించవు. అక్షర క్రమంలో వచ్చిన తెలుగు విజ్ఞాన సర్వస్వాలు పైన వివరించిన నాలుగు పద్ధతుల్లోను వెలువడి ఉన్నాయి. మన విజ్ఞాన సర్వస్వాల రూప గుణాదులు పాఠకులకు తెలిసే విధంగా కొన్ని ముఖ్యమైన విజ్ఞాన సర్వస్వాలను చివరి ప్రకరణంలో సమీక్షించడం జరిగింది.

# 5

# తెలుగు విజ్ఞాన సర్వస్వాలు-సమీక్ష

తెలుగులో ఇప్పటి వరకు విజ్ఞాన సర్వస్వాలు, విజ్ఞాన సర్వస్వాలన దగిన గ్రంథాలు దాదాపు 55 నుంచి 60 వరకు వచ్చి ఉంటాయి. వీటి నన్నిటిని తెలుగు విజ్ఞాన సర్వస్వాల చరిత్రను రేఖామాత్రంగా చిత్రించిన ప్రకరణంలో కాలానుసరణిగా పేర్కొనడం జరిగింది. అయితే పండితుల అభిప్రాయాలను అనుసరించి వాటిలో విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల గ్రంథాలను, విజ్ఞాన సర్వస్వాలుగా చెప్పదగిన గ్రంథాలను విశ్లేషణాత్మకంగా పరిశీలించి తెలుగు విజ్ఞాన సర్వస్వాల వర్గీకరణ-పరిశీలన అనే 4వ ప్రకరరణంలో వివరించడం జరిగింది. తెలుగు విజ్ఞాన సర్వస్వాల్లో ముఖ్యమైనవి కొన్ని ఇక్కడ సమీక్షించడం జరుగుచున్నది.

విజ్ఞాన సర్వస్వమనగానే చటుక్కున గుర్తు వచ్చేది-ప్రపంచ విజ్ఞానాన్ని అక్షర క్రమంలో గాని, విషయ క్రమంలో గాని వీలైనంత సమగ్రంగా క్రోడీకరించిన సామాన్య విజ్ఞాన సర్వస్వమే (General Encyclopaedia). ఈ వర్గానికి చెందిన తెలుగు విజ్ఞాన సర్వస్వాల్లో ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము. ఆంధ్ర విజ్ఞానం, విజ్ఞాన సర్వస్వ సంపుటాలు. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాలు. విజ్ఞాన దీపిక, విశ్వ విజ్ఞాన దర్శిని ముఖ్యంగా చెప్పుకో దగినవి.

**ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం** కొమర్రాజు వెంకట లక్ష్మణరావు పంతులుగారి ఆధ్వర్యాన మద్రాసు (చెన్నై)లో ఏర్పడిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ సమితి, ఈ విజ్ఞాన

సర్వస్వాన్ని నిర్మించింది. ఈ సమితి ఆంగ్ల విజ్ఞాన సర్వస్వం బ్రిటానిక స్థాయిలో తెలుగులో ఒక విజ్ఞాన సర్వస్వాన్ని నిర్మించేందుకు కృషి చేసింది. 1913 జూలై నెల నుంచి మాస సంచికల రూపంలో ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ రచనలు రావడం ప్రారంభమైనాయి. ఇలా మాస పత్రికల్లో వచ్చిన సమాచారాన్నంతటిని అక్షర క్రమంలో క్రోడీకరించి 1915లో మొదటి సంపుటాన్ని ప్రచురించారు. ఇందులో "అ నుంచి అంధర్వ" అనే పదాల వరకు ఆరోపాలకు గల విషయ విజ్ఞానాన్నంతటిని అకారాదిగా సమకూర్చడం జరిగింది. కాశీనాథుని నాగేశ్వర్రావు, పండిత వంగూరి సుబ్బారావు, గాడిచర్ల హరి సర్వోత్తమరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, మొదలైన ప్రముఖ పండితులు, విజ్ఞాన వేత్తలు తమ రచనలను ఇందులో పొందు పరిచారు.

1916లో రెండవ సంపుటం వెలువడింది. దీనిలో "అన్ నుంచి అశ్విని" వరకు గల పదాలకు అకారాదిగా సమాచారాన్ని సమకూర్చడం జరిగింది. ఈ సంపుటంలో కొమర్రాజు, కాశీనాథుల వారితోబాటు ఆయా విషయాల్లో నిష్ణాతులైన మామిడిపూడి వెంకటరంగయ్య. భావరాజు వెంకట కృష్ణారావు. వేదం వెంకటరాయశాస్త్రి, కొంపల్లి జనార్ధన్‌రావు, గొబ్బూరి వెంకటానంద రాఘవరావు, మానవల్లి రామకృష్ణకవి మొదలైన ప్రముఖ కవులు, రచయితలు పాల్గొన్నారు.

మూడవ సంపుటం 1917లో విడుదలైంది. ఇందులో 'అహ్రి' వరకు గల పదాలకు అకారాదిగా సమాచారాన్ని సమకూర్చడం జరిగింది. 1923లో కొమర్రాజు మరణంతో ఈ బృహద్రచనా వ్యాసంగం ఆగిపోయింది. ఆ తర్వాత కాశీనాథుని నాగేశ్వరావు దీన్ని కొనసాగించేందుకు కృషి చేశాడు. మొదట ఇంతకు ముందు ప్రచురించిన మూడు సంపుటాలను పునర్ముద్రించేందుకు పూనుకొని 1932-34 మధ్య కాలంలో మొదటి రెండు సంపుటాలను ప్రచురించాడు. మూడవ సంపుటం పునర్ముద్రణ వెలుగుచూడక ముందే 1939లో కాశీనాథులవారు కూడా మరణించడంతో ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ నిర్మాణం పూర్తిగా ఆగిపోయింది.

అకారాది క్రమంలో వచ్చిన తొలి తెలుగు విజ్ఞాన సర్వస్వమైన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం అసంపూర్తిగా ఆగిపోయింది. వచ్చిన మూడు సంపుటాలు (దాదాపు 3000పుటలు) కూడా కేవలం 'అ'కు సంబంధించిన ఆరోపాల సమాచారానికే పరిమితమైనా యంటే ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం ఎంత విస్తృత విషయ రూప సమన్వితమో తెలుస్తున్నది. ఈ మూడు సంపుటాల్లో కళలు, సాహిత్యం, సంస్కృతి, మానవీయ శాస్త్రాలు, ప్రకృతి శాస్త్రాలు మొదలైన విషయాలెన్నో విస్తృత విషయ ప్రాతిపదికన చోటు చేసుకొని ఉన్నాయి. 'ఈ సంపుటాల్లో అద్వైతము, అష్టాదశ పురాణాలు మొదలైన వ్యాసాలు ఏటికవే వేరువేరుగా ప్రచురించినా, అవి ఆయా విషయాలకు సంబంధించి సమగ్ర ప్రామాణిక గ్రంథాలుగా రాణించ గలవు" అని చీమకుర్తి శేషగిరిరావు అభిప్రాయపడినాడు. (తెలుగులో పరిశోధన పు.329)

విజ్ఞాన సర్వస్వాల్లోని విజ్ఞానాంశాలన్నీ సామాన్య పాఠకులకు సైతం సులభ గ్రాహ్యంగా ఉండాలనేది విజ్ఞాన సర్వస్వాల ఆశయం. ఈ దృష్టితో ఆంధ్ర విజ్ఞాన సర్వస్వంలోని భాషా విషయాన్ని పరిశీలిస్తే ఇందులో సర్వత్రా గ్రాంధిక భాషను వాడటం వలన భాషా పరంగా ఇది కొంత క్లిష్టత నాపాదించు కొన్నదనే చెప్పాలి. అయినా విషయ ప్రతిపాదన, విశ్లేషణ పరంగా ఇది ఉన్నత ప్రమాణాలను సంతరించుకున్న విజ్ఞాన సర్వస్వం.

**ఆంధ్ర విజ్ఞానము** దీనికి The Telugu Encyclopaedia అనే ఇంగ్లీషు పేరును కూడా రచయితే సూచించాడు. ప్రపంచ విజ్ఞానాన్ని అకారాది క్రమంలో సంక్షిప్తంగా సమకూర్చిన సామాన్య విజ్ఞాన సర్వస్వమిది. కేవలం 3సంవత్సరాల, స్వల్ప కాల వ్యవధిలో (1938-41) 7సంపుటాల్లో దాదాపు 4000పుటలతో వెలువడిన బృహద్గ్రంథమిది. రచన, కూర్పు శ్రీకందుకూరి బాలసూర్య ప్రసాదరాయ భూపాలుడు (దేవిడి జమీందారు).

ఆంధ్ర విజ్ఞానం మొదటి రెండు సంపుటాలు 1938లో కాకినాడలో ముద్రణ పొంది వెలువడినాయి. మొదటి సంపుటలలో "అంక పీఠము నుంచి

ఐదవ" అనే పదం వరకు గల ఆరోపాలకు సంక్షిప్త వివరణ లున్నాయి. రెండవ సంపుటంలొ ఐబిక్సు మేక నుంచి చైతన్య మతం అనే ఆరోపం వరకు సంక్షిప్త సమాచారం సమ కూర్చడం జరిగింది.

మూడవ సంపుటం నుంచి ఏడవ సంపుటం వరకు కూడ అన్ని సంపుటాలు రాజమండ్రిలోనే ముద్రించ బడినాయి. మూడవ సంపుటంలో "చైతన్య సప్తకం నుంచి నార్త్ ఈక్వీటోరియల్ కరెంటు" వరకు గల ఆరోపాలకు వివరణలున్నాయి. 4వ సంపుటంలో నార్త్‌కేవు అగ్రము నుంచి బృహత్కథ వరకు గల ఆరోపాలు వివరించడం జరిగింది. 5వ సంపుటంలో బృహత్కరుడు మొదలు రివల్యూషన్ వరకు గల పదాలు వివరింప బడినాయి. 6వ సంపుటంలో 'రివైవా ప్రదేశం నుంచి సమాసము అనే పదం వరకు గల ఆరోపాల వివరణలున్నాయి. చివరిదైన 7వ సంపుటంలో క్షారపు సబ్బు వరకు గల ఆరోపాలు వివరింప బడినాయి. ఈ సంపుటంలో చివర 'ఆంధ్ర విజ్ఞానుబంధం' అనే ఒక అనుబంధం కూడా చేర్చబడింది. ఇందులో "అగ్గిపుల్ల మొదలు చేరియా కులం" వరకు గల అకారాది ఆరోపాలకు వివరణలున్నాయి. మొదటి సంపుటాల్లో చేరని ఇలాంటి పదాలన్నిటికి అనుబంధ వివరణలు వచ్చి ఉంటే ఈ గ్రంథమింకా సమగ్రంగా ప్రకాశించేది. ఏ కారణం చేతనో ఈ అనుబంధాల రచన, కూర్పు ఆగిపోయింది.

విజ్ఞాన సర్వస్వాలు సామాన్యంగా సమిష్టి కృషి ఫలితాలుగానే ఉంటాయి. అయితే 7సంపుటాల ఈ ఉద్గ్రంథం ఒక్క చేతి మీదుగా నడిచిన వ్యక్తి ప్రజ్ఞాధీనమైనది. ఇదే విషయాన్ని కట్టమంచి, రామలింగారెడ్డి దీనికి పీఠిక వ్రాస్తూ "ఆంధ్ర విజ్ఞానం వ్యక్తిత్వం అనే ఒక శక్తిచే పూరితమై ఉన్నది" అని చెప్పాడు.

ఈ విజ్ఞాన సర్వస్వంలో పుటల సంఖ్య దేనికదే కాకుండా మొదటి సంపుటం నుంచి చివరి వరకు వరుస క్రమంలో (1 to 3708) (అనుబంధం 184) ఇవ్వడం విశేషం. అకారాది క్రమంలో విషయం సమకూర్చిన సందర్భాల్లో హరిశ్చంద్ర, రఘు మహారాజు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు మొదలైన మహా

పురుషుల వంశావళి, భృగువు, విశ్వమిత్రాది మహర్షుల వంశావళి.సూర్యవంశ రాజుల వంశావళి, రెడ్డి రాజుల వంశావళి, పురూరవుడు మొదలైన పురాణ పురుషుల వంశావళి, పింగిళి సూరన, రామ రాజ భూషణుడు, వెన్నెలకంటి సూరన, రాయని మంత్రి భాస్కరాది మహా కవుల వంశాళి పేర్లు పట్టికలుగా చూపడం మరో విశేషం. అకారాది క్రమంలో ఏ అనే అక్షరంతో ప్రారంభమయ్యే పదాలను వివరించే సందర్భాల్లో "A" ఆంగ్లాక్షరంతో ఆరంభమయ్యే క్రైస్తవ స్త్రీ, పురుష నామాలను పొందుపరుస్తూ, అదే విధంగా "Z" వరకు పేర్లు ఇవ్వడం ఇంకో విశేషంగా కనిపిస్తుంది.

ఇక విషయ వివరణ, భాష శైలి మొదలైన అంశాలను పరిశీలిస్తే ఈ విజ్ఞాన సర్వస్వంలో విషయ వివరణలన్ని నాతి దీర్ఘాలై చాల సంక్షిప్తంగా ఉన్నాయి. భాష గ్రాంధికం గాకుండా వ్యవహారంలో ఉండటం వలన సులభ గ్రాహ్యంగా ఉంది. రచన ఒక్క చేతి మీదుగా నడవడం వలన శైలి గ్రంథ సాంతం ఒకే విధంగా ఉంది. ఈ విజ్ఞాన సర్వస్వం రూప గుణాలను గూర్చి "ఈ గ్రంథం గుణ రత్న పంచకంచే విరాజిల్లు చున్నది" అని దీని పీఠికలో కట్టుమంచి రామలింగారెడ్డి ప్రశంసించాడు.

**విజ్ఞాన సర్వస్వ సంపుటాలు (ఆంధ్ర భాషా సమితి)**

దేశ స్వాతంత్ర్యానంతరం తెలుగు భాషా సాహిత్యాల అభివృద్ధి ధ్యేయంగా 1947లో డా॥ బెజవాడ గోపాలరెడ్డి ఆధ్వర్యంలో మద్రాసులో తెలుగు భాషా సమితి ఏర్పడింది. ఆ తర్వాత ఇది విశాఖ లోను, హైదరాబాద్‌లోను శాఖా కార్యాలయాలు ఏర్పాటు చేసింది. ప్రపంచ విజ్ఞానాన్ని తెలుగు ప్రజల కందించాలనే ఆశయంతో ఈ సంస్థ ఒక సర్వ సమగ్రమైన విజ్ఞాన సర్వస్వాన్ని నిర్మించేందుకు పూనుకొనింది. అక్షర సమీకరణ పద్ధతిలో ప్రపంచ విజ్ఞానాన్ని సమీకరించి సంపుటాలుగా వెలువరించడానికి ఎక్కువ సమయం పడుతుందని, అలా కాకుండా ఒక్కొక్క రంగానికి చెందిన విజ్ఞానాన్ని ఒక సంపుటంలో సమీకరించి ప్రచురించడం వలన, అవి త్వరగా ప్రజలకు అందుబాటులోనికి వస్తాయని భావించిన సంస్థ 16 సంపుటాల్లో ప్రపంచ విజ్ఞానాన్ని సమీకరించి

BEV+Alphabate పద్ధతిలో నిర్మించేందుకు ప్రణాళికలు తయారు చేసింది. ఈ పద్ధతిలో నిర్మించిన ఈ విజ్ఞాన సర్వస్వం ప్రతి సంపుటం రెండు విభాగాలుగా ఉంటుంది. మొదటి విభాగం విహంగ వీక్షణం (B.E.V.). ఇందులో ఆ సంపుటంలో అది సమకూర్చిన విజ్ఞాన శాఖ లేదా అనునబంధ శాఖలకు సంబంధించి విస్తృత విషయ ప్రాతిపదికన, శీర్షికలు, ఉప శీర్షికలతో సుదీర్ఘమైన వ్యాసాలుంటాయి. ఇది ఆ సంపుటంలో దాదాపు సగభాగం ఆక్రమిస్తుంది. 2వ భాగంలో అకారాదిగా ఆరోపాలకు వివరాలుంటాయి. అవసరమైన చోట్ల విజ్ఞాన సాధనాలయిన చిత్ర పటాలు, ఫొటోలు, పట్టికలు మొదలైనవన్నీ సమకూర్చ బడినాయి. ప్రతి సంపుటం చివర అకారాది పదసూచికలు, గ్రంథం మొదట రచయితల పరిచయాలు సమకూర్చ బడినాయి. ఈ ప్రణాళిక ననుసరించి తెలుగు భాషా సమితి ప్రచురించిన విజ్ఞాన సర్వ సంపుటాలు, వాటి వివరాలు ఈవిధంగా ఉన్నాయి.

**వి.స. పేర్లు ప్రచురణ సంవ॥ సంగ్రాహకులు సంపాదకులు**

**1. చరిత్ర-రాజనీతి (1954)**
సంగ్రా: గిడుగు వేంకట సీతాపతి
సహాయ సంగ్రా:
శ్రీఏ.వి. సుబ్బరాయగుప్త
శ్రీమతి శిరోమణి
శ్రీ వి.ప్రభాకర్
శ్రీ వెల్చేరు నారాయణరావు

సంపాదకులు
శ్రీ గాడిచెర్ల హరి సర్వోత్తమ రావు
శ్రీ గిడుగు వేంకట సీతాపతి
శ్రీ ప్రతాపగిరి రామమూర్తి
శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

**2. భౌతిక, రసాయన శాస్త్రములు (1955)**
సంగ్రా. శ్రీమేడిపల్లి వరహా నర్సింహ స్వామి
సహా. సంగ్రా: శ్రీ ఏ.వి.ఎన్ రామారావు
శ్రీ బి.సుబ్బరాయన్
శ్రీ చీమకుర్తి శేషగిరి రావు

శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమ రావు
శ్రీ వసంతరావు వేంకట రావు
శ్రీ వేమూరి విశ్వనాథ శర్మ

**3. తెలుగు సంస్కృతి-1 (1959)**
సం॥గ్రా: శ్రీ మల్లంపల్లి సోమేశఖర శర్మ
సహా. సం॥గ్రా: శ్రీ గన్నవరపు సబ్బరామప్ప
శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ
శ్రీ నేలటూరి వెంకట రమణయ్య
శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్య
శ్రీ మోటూరి సత్యనారాయణ

**4. తెలుగు సంస్కృతి-II (1962)**
సం॥గ్రా: శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ
సహా: సం॥గ్రా: శ్రీ బి.సబ్బరాయన్
శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ
శ్రీ నేలటూరి వెంకట రమణయ్య
శ్రీ మామిడి వెంకట రంగయ్య
శ్రీ మోటూరి సత్యనారాయణ

**5. అర్థ, వాణిజ్య, భూగోళ శాస్త్రములు (1962)**
సం॥గ్రా: శ్రీ మేడిపల్లి వరాహ నరసింహస్వామి
సహా. సం॥గ్రా: శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు
శ్రీ జె.ఎస్.ఆర్.యల్.నారాయణమూర్తి
శ్రీ వేమూరి వెంకట రామనాథం
శ్రీ ఖండపల్లి సుబ్రహ్మణ్య శాస్త్రి
శ్రీ రాచకొండ రామదాసు
శ్రీ టేకుమళ్ళ రామారావు

**6. విశ్వ సాహితి (1962)**
సం॥గ్రా: శ్రీ చీమకుర్తి శేషగిరిరావు
శ్రీ దివాకర్ల వేంకటావధాని

**7. మతములు-దర్శనములు (1963)**
సం॥గ్రా: శ్రీ మేడిపల్లి వరాహ నరసింహస్వామి
సహా. సం॥గ్రా: శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు
శ్రీ జె.యస్.ఆర్.ఎల్. నారాయణమూర్తి
శ్రీ కొత్త సచ్చిదానంద మూర్తి

**8. వ్యవసాయ, పశు పాలన అటవీ శాస్త్రములు (1965)**
సం॥గ్రా: శ్రీ మేడిపల్లి వరాహ నరసింహ స్వామి
సహా. సం॥గ్రా: శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు
శ్రీ ఎం.బి.వి. నరసింగరావు
శ్రీ మాగంటి బాపినీడు
శ్రీ జి.పాండురంగం
శ్రీ వి.ఎస్. ప్రకాశరావు

**9. గణిత, ఖగోళ శాస్త్రములు (1965)**
శ్రీ ఏ.నరసింగరావు

సం|గ్రా:శ్రీమేడిపల్లి వరాహ నరసింహ స్వామి శ్రీ. వి.తిరువేంగళాచార్య
సహా. సం|గ్రా: శ్రీ వింజమూరి హనుమంతరావు

**10. సాంఘిక శాస్త్రములు (1968)** శ్రీ సి.జయదేవ్
సం|గ్రా: శ్రీబొమ్మకంటి శ్రీనివాసాచార్యులు శ్రీ బి.కుప్పుస్వామి
సహా. సం|గ్రా:శ్రీ పి.యల్.నారాయణరావు శ్రీ కె.ఉమామహేశ్వరరావు

**11. న్యాయ, పరిపాలనా శాస్త్రములు (1968)** శ్రీ జి.సి.వి. సుబ్బారావు
సం|గ్రా: శ్రీ ఓరుగంటి నరసింహ మూర్తి శ్రీ వి.బాల సు|బహ్మణ్యం

**12. ఇంజనీరింగ్-టెక్నాలజీ (1970)** శ్రీ కె.ఎల్ రావు
సం|గ్రా: శ్రీ బి.సుబ్బరాయన్ శ్రీ వి.వి.ఎల్.రావు
శ్రీ ఎన్.ఎన్. నారాయణరావు

**13. జీవ శాస్త్రములు (1979)** శ్రీ డి.వెంకటేశ్వర్లు
సం|గ్రా: శ్రీ మేడిపల్లి వరహానరసింహ స్వామి శ్రీ ఏ.నరసింహారావు
శ్రీ బి.సుబ్బరాయన్ శ్రీ జె.వెంకటేశ్వర్లు
సహా. సం|గ్రా: శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు శ్రీ ఆర్.వి. శేషయ్య

**14. లలిత కళలు** శ్రీ పి.వి. రాజమన్నారు
సం|గ్రా: శ్రీ చీమకుర్తి శేషగిరిరావు శ్రీ పి.సాంబమూర్తి
సహా. సం|గ్రా: శ్రీ తిరుమల రామచంద్ర శ్రీ రాయ|ప్రోలు సు|బహ్మణ్యం
శ్రీ డి.శ్రీధర బాబు శ్రీ ఎస్.సంజీవదేవ్

తెలుగు భాషా సమితి 16 సంపుటాలుగా |ప్రకటించాలని తలపెట్టిన ఈ విజ్ఞాన సర్వస్వంలో, పై విధంగా 14 సంపుటాలను మాత్రమే |ప్రకటించ గలిగింది. 15వ సంపుటం వైద్యానికి సంబంధించినది. ఈ 15వ సంపుటం కూడా |ప్రచురించిన తరువాత, ఈ 15సంపుటాలకు సంబంధించిన సమ|గ్రమైన సూచి (Index) తోను, అట్లాస్ తోను 16వ సంపుటాన్ని తయారు చేసి

ప్రకటించాలని తెలుగు భాషా సమితి సంకల్పించినది. కాని 15వ సంపుటమే ప్రచురించ బడక పోవడంతో 16వ సంపుటాన్ని గురించిన ప్రస్తావన లేక పోయింది.

ఇప్పటి వరకు తెలుగు భాషా సమితి నిర్మించి ప్రచురించిన సంపుటాల్లో కొన్నిటిని కొన్ని మార్పులు చేర్పులతో పునర్ముద్రించింది. ఇందులో భాగంగా చరిత్ర-రాజనీతి అనే సంపుటం ఇంచుమించు కొత్త సంపుటంగా 1967లో వెలువడింది. మామిడిపూడి వెంకటరంగయ్య సంపదకులుగాను, చీమకుర్తి శేషగిరిరావు సంగ్రాహకులుగాను వ్యవహరించారు.

భౌతిక రసాయన శాస్త్రాల సంపుటం 1964లోనే పునర్ముద్రణ పొందింది. మొదటి ముద్రణ సంపాదకులు, సంగ్రాహకులు దీనికి కూడా వ్యవహరించారు.

మొదటి, రెండు సంపుటాలుగా వెలువడిన తెలుగు సంస్కృతిని తెలుగు దేశం-చరిత్ర, తెలుగు సాంస్కృతిక వికాసం, ఆంధ్రప్రదేశ్ సిరిసంపదలు అని మూడు విభాగాలుగా విభజించి మూడు సంపుటాల్లో పునర్ముద్రించి వెలువరించేందుకు ప్రణాళిక సిద్ధం చేసింది. ఇందులో భాగంగా 1983లో తెలుగుదేశం చరిత్ర అనే సంపుటాన్ని ప్రచురించింది. దీనికి రాయప్రోలు సుబ్రహ్మణ్యం, పి.వి. పరబ్రహ్మశాస్త్రి, భద్రిరాజు కృష్ణమూర్తి, బిరుదురాజు రామరాజు, ముక్కామల రాధాకృష్ణశర్మ సంపాదకులుగా వ్యవహరించారు. చీమకుర్తి శేషగిరిరావు సంగ్రాహకులు. రెండవ సంపుటం తెలుగు సంస్కృతీ వికాసం 1988లో (తెలుగు భాషా సమితి తెలుగు విశ్వ విద్యాలయంలో (1986) విలీనమైన తర్వాత) వెలువడింది. బిరుదురాజు రామరాజు, పి.వి. పరబ్రహ్మశాస్త్రి సంపాదకులు. చీమకుర్తి శేషగిరిరావు సంగ్రాహకులుగా వ్యవహరించారు. దీనికి చెందిన మూడవ సంపుటం వెలువడక ముందే 1986లోనే తెలుగు భాసా సమితి తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనమై పోయింది.

## విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం-తెలుగు విశ్వవిద్యాలయం

1986లో తెలుగు భాషా సమితి తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనమైన తర్వాత ఈ విజ్ఞాన సర్వస్వాల నిర్మాణ బాధ్యతను విశ్వవిద్యాలయం స్వీకరించింది. కొమర్రాజు వెంకట లక్ష్మణరావు విజ్ఞాన సర్వస్వ కేంద్రంలో ఈ కృషి ఆరంభమైనది. ఈ సంస్థ తొలి దశలో పునర్ముద్రణ చర్యలు చేపట్టి మార్పులు చేర్పులతో కొన్ని సంపుటాలను పునర్ముద్రించి ప్రచురించింది.

మతములు-దర్శనములనే సంపుటాన్ని 1992లో పునర్ముద్రించి ప్రచురించింది. దీనికి కొత్త సచ్చిదానందమూర్తి ప్రధాన సంపాదకులుగా, పుల్లెల రామచంద్రుడు, పప్పు సూర్య సుందర రామారావు, ఆర్య సోమయాజుల రామ్మూర్తి, ముదిగొండ వీరభద్రశాస్త్రి సంపాదకులుగా, డాక్టర్ పడాల చంద్రశేఖర్ సహాయ సంపాదకులుగా వ్యవహరించారు. ఇందులోని విషయం మతములు-దర్శనాలని రెండు విజ్ఞాన శాఖలకు సంబంధించింది. ప్రపంచ దేశాల్లోని మత, దర్శన సంబంధ విషయాలను సమీకరించి ఈ సంపుటంలో సమకూర్చడం జరిగింది.తెలుగు భాషా సమితి నిర్మించి, ప్రచురించిన విధంగానే విహంగవీక్షణం + అకారాది క్రమ పద్ధతిలోనే తెలుగు విశ్వవిద్యాలయం కూడా విజ్ఞాన సర్వస్వ సంపుటాలను నిర్మించి ప్రచురిస్తున్నది.

**విశ్వసాహితి** (1994) ప్రపంచ సాహిత్యానికి సంబంధించిన విజ్ఞాన సర్వస్వ సంపుటమిది. ప్రపంచంలోని ముఖ్యమైన కవులు, కావ్యాలు, కావ్య ప్రక్రియలు మొదలైన అంశాలన్నీ సమీక్షా వ్యాసంలోను, అకారాదిగాను సమకూర్చబడినాయి. 1994లో ఈ సంపుటం వెలువడింది. సంపాదకులు ప్రొఫెసర్ కొత్తపల్లి వీరభద్రరావు, ప్రొ. డివికె. రాఘవాచార్యులు, ప్రొ॥ ముదిగొండ వీరభద్రశాస్త్రి, సంగ్రాహక సంపాదకులు శ్రీ బొమ్మ శ్రీనివాసాచార్యులు. సమన్వయ సంగ్రాహకులు డా.కె.ఆనందన్.

History and Culture of Andras:- (1995) తెలుగు వారి చరిత్ర-సంస్కృతులు ఇతర భాషా భాషీయులకు కూడా తెలియాలనే ఆశయంతో ఆంగ్లంలో నిర్మించిన

విజ్ఞాన సర్వస్వమిది. సంపాదకులు ప్రొ. యం.నాగభూషణ శర్మ, ప్రొ.యం. వీరభద్ర శాస్త్రి, సంగ్రా. సంపాదకులు చీమకుర్తి శేషగిరిరావు, సమన్వయ సంపాదకులు ప్రొ.జి.చెన్నకేశవరెడ్డి, డా.కె.ఆనందన్.

**భారత భారతి** (1999) ఇందులోని విషయం భారత దేశంలోని ముఖ్యమైన భాషా సాహిత్యాలకు సంబంధించినది. దీనికి సంబంధించిన విషయమంతా మొదట సమీక్షా భాగంలోను, ఇందులోని అంశాలకు వివరణలు అకారాది క్రమంలోను సమకూర్చడం జరిగింది. సంపాదకులు ప్రొ. చల్లా రాధాకృష్ణశర్మ, ప్రొ. ఎం.వీరభద్ర శాస్త్రి, సంగ్రా.సంపాదకులు డా.విశ్వేశ్వరి, నిర్వాహక సంపాదకులు ప్రొ.జి.చెన్నకేశవ రెడ్డి.

**నాటక విజ్ఞాన సర్వస్వ సంపుటం** (2008) సాహిత్య ప్రక్రియల్లో ఒకటైన నాటక ప్రక్రియ మొదటి నుండి బహుళ వ్యాప్తిలో ఉంది. ప్రదర్శన కళల్లోను ప్రముఖమైంది. అటువంటి నాటక ప్రక్రియకు సంబంధించి అన్ని విషయాలు పాఠక లోకానికి అందించే ఉద్దేశంతో ఈ విజ్ఞాన సర్వస్వ సంపుటం 2008లో వెలువడింది. సంగ్రాహ సంపాదకులు సుబ్బిరామి రెడ్డి, సంపాదకులు డా.జి.ప్రసాదరెడ్డి, నిర్వాహక సంపాదకులు ప్రొ.కె.ఆనందన్.

**రసాయన శాస్త్రం** (2012) ఈ విజ్ఞాన సర్వస్వ సంపుటం కూడా ఈ మధ్యనే విడుదలైనట్లు తెలుస్తున్నది.

ప్రస్తుతం భౌతిక శాస్త్ర విజ్ఞానం, జ్యోతిశ్శాస్త్రం, దేశము-చరిత్ర, తెలుగు జానపద విజ్ఞానం, సాహిత్య దర్శనం, వైద్య విజ్ఞాన సర్వస్వం, ఆయుర్వేద విజ్ఞాన సర్వస్వం మొదలైన సంపుటాలకు సంబంధించి నిర్మాణ పనులు చురుగ్గా సాగుతున్నాయని తెలుగు విశ్వవిద్యాలయంలో విజ్ఞాన సర్వస్వ కేంద్రం ఇన్‌చార్జీ డైరెక్టర్ "కేంద్రం పని ప్రగతి నివేదిక" లో తెలుయపర్చాడు.

**సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాలు** ప్రపంచ విజ్ఞానాన్ని వీలైనంత సమగ్రంగా తెలుగు ప్రజలకు అందించాలనే తలంపుతో సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశ సమితి 1953లో హైదరాబాద్‌లో ఏర్పడింది. దీనికి డా.బెజవాడ గోపాలరెడ్డి గారు

అధ్యక్షులు, ఖండవల్లి లక్ష్మీ రంజనం గారు కార్యదర్శి, మరి 22మంది సభ్యులుగా వ్యవహరించారు. విజ్ఞాన కోశ సంపుటాల నిర్మాణం కోసం ఒక సంపాదక మండలి ఏర్పాటైంది. ప్రధాన సంపాదకులు ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య. మరి 35మంది సంపాదకులుగా వ్యవహరించారు.

ఈ విజ్ఞాన సర్వస్వం విస్తృత విషయ రూప (MonograPhic Style) ప్రాతిపదికన గాకుండా సంక్షిప్త విషయ వివరణ (Short Essay Type) లతో అక్షర క్రమంలో నిర్మించ బడింది. 'అన్ని విషయాలను గురించి తెలుసు కోవలసిందంతా ఎలాగు తెలుసుకోలేం. కాబట్టి, అన్ని విషయాలను కొంత వరకైనా తెలుసుకోవడం అవసరం' అనే సూత్రం సంస్థ ఈ పద్ధతి నెంచుకొనేందుకు ప్రాతిపదికగా తెలుస్తున్నది. ఈ పద్ధతిలో విజ్ఞాన సర్వస్వం ప్రపంచ విజ్ఞానాన్ని 8 సంపుటాల్లో వీలైనంత సమగ్రంగా అందించేందుకు కృషి చేసింది.

మొదటి సంపుటం 1958లో వెలువడింది. అంకగణితం మొదలు అర్ధ భూగోళం వరకు గల ఆరోపాల వివరణలున్నాయి. 123మంది రచయితలు పాల్గొన్నారు. అవసరమైన చోట్ల విజ్ఞాన సాధనాలైన చిత్ర పటాలు, ఫొటోలు, పట్టికలు మొదలైనవి 223 వరకు సమకూర్చ బడ్డాయి. గ్రంథం చివర 4అనుబంధాల్లో గ్రంథానికి అవసరమైన అనుబంధ సమాచారం కూడా ఇవ్వడం జరిగింది.

రెండవ సంపుటం 1960లో వచ్చింది. రచయితల సంఖ్య 29. అర్ష వాస్తు శాస్త్రం-కృష్ణానది వరకు ఆరోపాలున్నాయి. అవసరమైన చోట్ల విజ్ఞాన సాధనాలైన-చిత్ర పటాలు, ఛాయా చిత్రాలు మొదలైనవి ఉన్నాయి. గ్రంథాదిలో రచయితల పరిచయం సంక్షిప్తంగా ఉంది. గ్రంథం చివర అకారాది పదసూచి, పారిభాషిక పద సూచి రెండు అనుబంధాల్లో ఉన్నాయి.

మూడవ సంపుటం 1962లో వచ్చింది. ఆరోపాలు కెకులె-ఛాయ సోమనాథ దేవాలయం వరకున్నాయి. రచయితలు 107మంది. విజ్ఞాన

సాధనాలు (ఛాయా చిత్రాలు, వర్ణ చిత్రాలు మొ॥) 227. చివరి రెండు అనుబంధాల్లో పద సూచిక, పరిభాషిక పద సూచిక లున్నాయి.

నాల్గవ సంపుటం 1964లో వెలువడింది. ఆరోపాలు జంతు భూగోళం -దేవాలయ వాస్తు వరకున్నాయి. పుటల సంఖ్య 752. ఇందులో టెక్నాలజీ, పాలనా శాస్త్రం అనే రెండు కొత్త శాఖలలు చేర్చడం జరిగింది. ఇందులోని మహానీయుల చరితలు వారి తత్వ వివేచన మొదలైన అంశాలు పాఠకుల కెంతగానో ఉపయోగ పడతాయి.

ఐదవ సంపుటం 1966లో వచ్చింది. ఆరోపాలు, దేవినాగనిక-పిల్లల మఱ్ఱి. రచయితలు 103మంది. అవసరమైన చోట్ల ఛాయచిత్రాలు. వర్ణ చిత్రాలు, పట్టికలు మొదలైనవి సమకూర్చబడ్డాయి. చివరరి రెండనుబంధాల్లో పదసూచిక, పారిభాషిక పద సూచికలున్నాయి. తత్త్వ, న్యాయ శాఖాది విషయాలు, పదార్థ విజ్ఞానం, మొదలైన అనేక శాఖల విజ్ఞానాంశాలు ఇందులో చోటు చేసకున్నాయి.

అరవ సంపుటం 1969లో వెలువడింది. ఆరోపాలు:పునరుజ్జీవనం-బాషా శాస్త్ర వికాసం. రచయితలు 120మంది. ఇందులో జీవ శాస్త్రం, ఇంజనీరింగ్, తత్వ శాస్త్రాది విజ్ఞానాంశాలు చోటు చేసుకున్నాయి. చిత్రాలు, చిత్ర పటాలు, వర్ణ చిత్రాలు మొదలైనవన్నీ అవసరమైన చోట్ల కూర్చబడ్డాయి. గ్రంథం చివర మూడు అనుబంధాలున్నాయి.

ఏడవ సంపుటం 1970లో వచ్చింది. ఆరోపాలు, భాష్య వాఙ్మయం నుంచి రోమను సామ్రాజ్యం. రచయితలు 120మంది. కళలు, కళాకారులు, రసాయన శాస్త్రాది విషయాలు పొందుపరచ బడ్డాయి. విజ్ఞాన సాధనాలు అవసరమైన చోట్ల కూర్చ బడినాయి.

8వ సంపుటం 1971లో వెలువడింది. ఆరోపాలు లక్ష ద్వీపాలు నుంచి హోమియోపతి వైద్యం వరకున్నాయి. రచయితల సంఖ్య 101. ఫొటోలు, వర్ణ చిత్రాలతో పాటు సైన్స్‌కు సంబంధించిన పట్టికలు, రేఖాచిత్రాలు

అవసరమైన చోట్ల ఇవ్వబడ్డాయి. అన్ని సంపుటాల్లోను ఉన్నట్లు చివర రెండు అనుబంధాలున్నాయి.

సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాల గూర్చి చెబుతూ ఆచార్య ఖండవల్లిగారు విశ్వ విజ్ఞానాన్ని సంక్షిప్త రూపంలో ఆంధ్ర కుటీర ప్రాంగణానికి తీసుకొని రావడం అని చెప్పాడు. వారి ఈ లక్ష్యానికి కనుగుణంగా ఈ విజ్ఞాన సర్వస్వ సంపుటాలు నిర్మించబడి ఉన్నాయనడంలో సందేహం లేదు. కాని విజ్ఞాన సర్వస్వాలు ఎప్పటికప్పుడు వచ్చే నూతనాంశాలతో పునర్నవీకృతం చేయబడి, పునర్ముద్రణలు గాని, లేదా కనీసం అనుబంధ గ్రంథాలు గాని (Year Books) వెలువడు తుండటం అవసరం. ఆ పని ఈ సంపుటాలకు జరిగి ఉంటే ఇవి ఇంకా ప్రజలకు దగ్గరై ఉండేవి.

**విశ్వ విజ్ఞాన దర్శిని** విశ్వ విజ్ఞానాన్ని వీలైనంత సమగ్రంగాను, సంక్షిప్తంగాను తెలుగు ప్రజలకందించిన విజ్ఞాన సర్వస్వమిది. ప్రపంచ పర్యాప్తమైన ఆధునిక విజ్ఞానాంశాల్లో ముఖ్యమైన వాటిని, ఆసక్తి కరమైన వాటిని ఎన్నుకొని సంక్షేప రూపంలో రచయిత దీన్ని నిర్మించినట్లుగా తెలుస్తున్నది. ఇది అక్షర క్రమంలో గాకుండా , విషయ క్రమ పద్ధతిలో కూర్చిన విజ్ఞాన సర్వస్వం. ఇందులో భౌతిక శాస్త్రాలు, సాంఘిక శాస్త్రాలు, కళలు-సాహిత్యం అనే మూడు అధ్యాయాలున్నాయి. ఒక్కొక్క అధ్యాయంలో శీర్షికలు-ఉప శీర్షికలు వందల కొలది ఉన్నాయి. వీటన్నిటికి అవసరమైన సమాచారం సమీకరించి సమకూర్చడం జరిగింది. ఇలా మూడు అధ్యాయల్లో కొన్నివేల శీర్షికలు-ఉపశీర్షికలున్నాయి. ఇవన్నీ అక్షర క్రమంలో లేవనేగాని, వీటిలోని అన్ని అంశాలను ఆరోపాలుగా ఎన్నుకొని వాటికి తగిన సమాచారాన్ని (ఆ గ్రంథంలోనిదే) కూర్చితే దీనిని అక్షర క్రమ విజ్ఞాన సర్వస్వంగా సులంభంగా నిర్మించ వచ్చును. ఇందులోని విషయ వివరణలు ఆసక్తిని రేకిత్తిస్తూ, పాఠకుని చదివించే విధంగా ఉన్నాయి. దానికి రచయిత వాడిన సరళ వ్యవహార భాష, శైలి దోహదం చేశాయి. విషయ వివరణ సందర్భంగా, ఆయా సందర్భాలకు తగినట్లు రచయిత ప్రముఖుల సూక్తులను చేర్చడం ఇందులోని విశేషం.

ఇలాంటివి కూడా పాఠకుని ఆసక్తిగా చదివించేందుకు దోహద పడే విధంగా ఉన్నాయి.

కొండను అద్దంలో చూసినట్లు విశ్వ విజ్ఞానాన్ని ఒక్క సంపుటంలో సమకూర్చి చెప్పిన రచయిత కృషి చెప్పుకోదగింది. ఈ విజ్ఞాన స్వస్వ నిర్మాణం వెనుక 30సంవత్సరాల కృషి ఉంది. ఈ సుదీర్ఘ కాలంలో వచ్చిన శాస్త్రాలు, కళలు, సాహిత్య గ్రంథాలను చదవడం, వార్తా పత్రికల్లో వచ్చిన విజ్ఞానాంశాలన్నిటిని సేకరించడం. వాటన్నిటికి వ్రాసిన నోట్సు 10వేల పుటల వరకు వచ్చింది. ఆ సమాచారమే ఈ గ్రంథ రచన కాధారమని "మహాప్రస్థానం" అనే పీఠికలో స్వయంగా రచయిత చెప్పుకున్నాడు. 1984 నుంచి 2006వరకు ఈ విజ్ఞాన సర్వస్వం 15 ముద్రణలు పొందిందంటే (22 సంవత్సరాల్లో 15 ముదణలు) ఈ గ్రంథం పాఠక లోకంలో ఎంత ఆదరణ పొందిందో చెప్పకచెబుతున్నది.

**విజ్ఞాన దీపిక:-** ఈ విజ్ఞాన సర్వస్వం విషయ క్రమ పద్ధతిలో 2సంపుటాలుగా వెలువడింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ హైదరాబాద్ వారు దీనిని ప్రచురించారు. మొదటి సంపుటం 1976లో వెలువడింది. ఇందులో మానవీయ శాస్త్రాల (Humanities) విజ్ఞానమంతా 19 అధ్యాయాలు, వాటిలో మళ్ళీ శీర్షికలు, ఉప శీర్షికల రూపంలో వివరించ బడింది. అర్ధశాస్త్రం, సమాజశాస్త్రం, మనోవిజ్ఞాన శాస్త్రం, వైద్య శాస్త్రాది వివిధ శాస్త్ర సాంకేతికాంశాలు, భాషా సాహిత్యాలు, సంగీతం, చిత్రలేఖనాది కళా శాస్త్రాంశాలు చోటు చేసుకున్నాయి. ఇందలో భారతీయ సంస్కృతికి పట్టుగొమ్మలైన 21 మహా నగరాలు. 63మంది మహా పురుషుల చరిత్రలు సంక్షిప్తంగా వివరించ బడ్డాయి. యన్.సర్వోత్తమ రెడ్డి (అధ్యక్షులు) డా॥ ఆర్వి రావు, డా॥ యం.రాధాకృష్ణ (సభ్యులు), ఎన్.కృష్ణమూర్తి (సంగ్రాహకులు)గా దీనికొక సంపాదక వర్గం ఏర్పడింది. ఈ విజ్ఞాన సర్వస్వ నిర్మాణంలో 60మంది రచయితలు పాల్గొన్నారు.

విజ్ఞాన దీపిక రెండవ సంపుటం ప్రకృతి శాస్త్రాలు, భౌతిక శాస్త్రాలకు (Sciences) సంబంధించింది. ఇందులో గణిత, జ్యోతిష, భౌగోళ, భౌతిక

రసాయన శాస్త్రాలు, జీవ, జన్యుశాస్త్రాలు, వైద్యం, వ్యవసాయం, భూగోళ, ఖనిజ, వాతావరణాది శాస్త్రాలు, సివిల్, ఎలక్ట్రికల్ మొదలైన సాంకేతిక విజ్ఞాన శాస్త్రాలు మొదలైన శాస్త్ర-సాంకేతిక విజ్ఞానమంతా 21 అధ్యాయాల్లో వివరించడం జరిగింది.

మొదటి సంపుటానికి ఏర్పడిన సంపాదకవర్గ సభ్యులే దీనికి కూడా పనిచేశారు. ఇందులో 203మంది రచయితలు పాల్గొన్నారు. ఈ సంపుటంలో రూప సంధాతలుగా రచయితలను గూర్చిన సంక్షిప్త పరిచయం ఇవ్వడం జరిగింది. గ్రంథం చివరలో రెండనుబంధాలున్నాయి. మొదటిదాంట్లో ఆంధ్రప్రదేశ్ జల విద్యుత్ (Hydro Electricity) తాప విద్యుత్ (Thermal Electricity) స్థావరాలకు సంబంధించిన ఛాయా చిత్రాలున్నాయి. రెండవ అనుబంధంలో పద సూచిక అకారాదిగా ఇవ్వడం జరిగింది.

విజ్ఞాన దీపికలో మానవీయ శాస్త్రాలు ప్రకృతి శాస్త్రాలు, భౌతిక శాస్త్రాలకు సంబంధించిన విజ్ఞానమంతా రెండు సంపుటాల్లో సమకూర్చడం జరిగింది. మానవీయ కళా శాస్త్రాలు, ప్రకృతి భౌతిక శాస్త్రాల ఆవృత్తియే మానవ విజ్ఞానం. కాబట్టి ఈ శాస్త్రాంశాలనన్నింటిని ఒక క్రమ పద్ధతిలో చెప్పిన విజ్ఞాన దీపిక ఒక సామాన్య విజ్ఞాన సర్వస్వంగా చెప్పదగి ఉన్నది. "ఈ గ్రంథ సంపుటాలను చదివిన విద్యార్థికి మానసిక ప్రవృత్తి, జ్ఞానార్జన లౌకిక జ్ఞానం వృద్ధి అవుతుంది" అని గ్రంథ నిర్మాతల ఆశయంగా పీఠికలో చెప్పుకున్నారు. విజ్ఞాన దీపిక మొదటి సంపుటం పీఠికలో "నేటి యువకులు సర్వ విషయాలను గూర్చి తెలుసుకొని, భావి పౌరులై దేశాన్ని నవ మార్గంలో నడపగలరని నావిశ్వాసం" అని డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారు అభిప్రాయపడినారు.

ఈ విషయాలన్నీ పరిశీలిస్తే ఇది హైస్కూలు విద్యార్థులను దృష్టిలో పెట్టుకొని నిర్మించిన విజ్ఞాన సర్వస్వంగా తెలుస్తున్నది. ఈ స్థాయి విద్యార్థుల కోసం నిర్మించే విజ్ఞాన సర్వస్వాలు పాశ్చాత్య భాషల్లో అనేకం వెలువడి ఉన్నాయి. వీటిని వారు జువెనైల్ ఎన్సైక్లోపిడియాస్ అని అంటారు. ఇలాంటివి

మన తెలుగులో లేవనే చెప్పాలి. ఈ విజ్ఞాన సర్వస్వంలోని విషయ విస్తృతి, భాష, శైలి మొదలైన వాటిని పరిశీలిస్తే, ఇది అటు విద్యార్థి లోకానికే గాకుండా పాఠకులందరికి ఉపయోగకారిగా ఉంటుందని చెప్పవచ్చు. కాబట్టి దీనినినొక సామాన్య విజ్ఞాన సర్వస్వంగా పరిగణించడం జరిగింది.

**నిఘంటు రూప విజ్ఞాన సర్వస్వాలు** పదాలకు (ఆరోపాలకు) అర్థాలు, పర్యాయపదాలు, రూపాంతరాలు మొదలైనవి ఇవ్వడంతో పాటు, వాటి రూప గుణాదులను మిక్కిలి సంక్షిప్తంగా (రెండు, మూడు వాక్యాల్లో) వివరించిన గ్రంథాలు. నిఘంటువ రూప విజ్ఞాన సర్వస్వాలు- ఈ తరహా గ్రంథాలను కొంత మంది ప్రముఖులు విజ్ఞాన సర్వస్వాలుగా అంగీకరించడం లేదు. కాని బ్రిటానికా, గ్రొలియర్స్ ఎన్సైక్లొపిడియాల్లాంటి ప్రముఖ పాశ్చాత్య విజ్ఞాన సర్వస్వాలు, ఇలాంటి గ్రంథాలను ఈ వర్గంలో చేర్చి ఉదాహరణలను కూడా చూపాయి. నిఘంటువు (ని=నిశ్చయేన, ఘంటయతి= భాషయతి) అంటే పదం రూపాన్ని, అర్థాన్ని మాత్రమే చెప్పేది నిఘంటువు. దాని పరిధి అంత వరకే. అంతకు మించి ఆ పదం గుణాదులనే మాత్రం వివరించినా అది విజ్ఞాన సర్వస్వ లక్షణ మౌతుంది. కాబట్టి ఈ లక్షణాలు గల ఈ తరహా గ్రంథాలను నిఘంటు రూప విజ్ఞాన సర్వస్వాలనడం సమంజసంగానే ఉంది. తెలుగులో ఈ తరహా విజ్ఞాన సర్వస్వాలు రెండు మాత్రమే కనిపిస్తున్నాయి. (1) మాండలిక వృత్తి పదకోశాలు (2) తెలుగు సాహిత్య కోశాలు.

**మాండలిక వృత్తిపద కోశాలు** తెలుగు దేశంలో వ్యవసాయం, వ్యాపారం, చేనేత, కుమ్మరి, కమ్మరి, వడ్రంగం మొదలైన అనేక వృత్తుల వారున్నారు. ఒక్కొక్క వృత్తికి సంబంధించిన వివిధ విజ్ఞానాంశాలను ఆరోపాలుగా ఎంచుకొని, వాటిని అకారాదిగా క్రోడీకరించి సంక్షిప్తంగా వివరించిన గ్రంథాలు మాండలిక వృత్తి పదకోశాలు. ఒక్కో వృత్తికి సంబంధించిన విజ్ఞానాంశాలు ఒక్కో సంపుటంలో సమకూర్చి ప్రచురించడం జరిగింది. వ్యవసాయం, చేనేత, వాస్తు మొదలైన వృత్తులకు సంబంధించి సంపుటాలు వెలువడి ఉన్నాయి. ఇవి ప్రాకరణికాక్షర క్రమంలో నిర్మించిన విజ్ఞాన సర్వస్వాలు. మొదటి

సంపుటం (1962) వ్యవసాయానికి సంబంధించినది. వ్యవసాయ వృత్తి విజ్ఞానాన్నంతటిని 13 ప్రకరణాలుగా విభజించి, ఏ ప్రకరణానికా ప్రకరణంలోని అంశాలు అకారాదిగా సంగ్రహించి పద స్వరూపం, అర్థం, పర్యా పదాలు, రూపాంతరాలు మొదలైనవి చూపడంతో పాటు వాటి రూపం, ప్రయోజనం మొదలైన విషయాలను మిక్కిలి సంక్షిప్తంగా వర్ణించడం కూడా జరిగింది. దీనితో పాటు అవసరమైన చోట్ల విజ్ఞాన సాధనాలైన ఫోటోలు, చిత్రపటాలు, రేఖాచిత్రాలు, పట్టికలు కూడా సమకూర్చడం జరిగింది. ఇటువంటివి ఈ సంపుటంలో 61వరకున్నాయి. గ్రంథం మొదట్లో రేఖాచిత్రాల పట్టిక ఇవ్వబడింది. గ్రంథం చివర అనుబంధాల్లో (1) అకారది పద సూచిక (2) చెట్లపేర్లు, వృక్షశాస్త్రం-పరిభాష (3) సవరణ పట్టిక సమకూర్చడం జరిగింది. ఈ సంపుటానికి ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి సంపాదకులు. ఆచార్య తూమాటి దొణప్ప సహాయ సంపాదకులుగా ఉన్నారు. ఇదే పద్ధతిలో చేనేత, మత్స్య , వాస్తు, కుమ్మరం, కంసాలి, వడ్రంగం అనే వృత్తిపద కోశ నిర్మాణం చేపట్టారు. వీటినన్నిటిని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్ వారు ప్రచురించారు.

మొదటి సంపుటం తర్వాత వాస్తు పదాలకు సంబంధించిన నాల్గవ సంపుటం 1968లో వెలువడింది. సంకలనం, సంపాదకత్వం డా॥ బూదరాజు రాధాకృష్ణ గారు. ఈ సంపుటంలో ఆంధ్రదేశంలో వాడుకలోనున్న వాస్తు నిర్మాణాలకు సంబంధించిన విజ్ఞానాంశాలన్ని వివరించ బడినాయి. ఈ సంపుటం అకారాది పదజాలం. అకారాది పద వివరణ, రేఖా చిత్రాలు అని మూడు విభాగాలుగా ఉంది. గ్రంథం చివరి మూడు అనుబంధాలున్నాయి. (1) ప్రాకరణికాక్షర పద సూచిక (2) చెట్లపేర్లు వృక్షశాస్త్ర పరిభాష (3) రాళ్ళపేర్లు, భూగర్భ శాస్త్ర పరిభాష. ఇందులో 330 రేఖాచిత్రాలు సమకూర్చడం జరిగింది. ఈ రేఖా చిత్రాల పట్టిక గ్రంథం మొదట్లో ఇవ్వబడింది.

దీని తర్వాత చేనేత వృత్తి పద కోశం 1971లో వచ్చింది. భద్రిరాజు కృష్ణమూర్తిగారు సంపాదకులుగా, సంగ్రాహకులుగా వ్యవహరించారు. సహాయ

సంపాదకులుగా డా॥ పోరంకి దక్షిణామూర్తిగారు పనిచేశారు. చేనేత వృత్తి విజ్ఞానాన్ని సంక్షిప్త రూపంలో వివరించిన గ్రంథమిది. చేనేత వృత్తి పరికరాల రేఖా చిత్రాలు 324 వరకు గ్రంథం చివర్లో సమకూర్చడం జరిగింది. ఇదేవిధంగా మిగతా వృత్తి పదకోశ సంపుటాలు కూడా వెలువడినాయి.

"ఈ వృత్తి పదకోశాల వలన తెలుగు భాషా విస్తృతి తెలియడమే గాకుండా దేశీయ వృత్తుల సాంస్కృతిక చరిత్రను పునర్నిర్మించడం కూడా సాధ్యం. భాషలో వచ్చే మార్పులు, సంఘానికి భాషకున్న పరస్పర సంబంధం. భాష పెరుగు దలలోనున్న తత్వం సశాస్త్రీయంగా పరిశీలించడానికి వృత్తి పద కోశాల్లో మౌలికమైన సామాగ్రి దొరుకుతుంది. అని భద్రిరాజు గారు అభిప్రాయ పడినారు. (మాం.వృ.ప.కో-II పీఠిక) దీనిని బట్టి ఈ మాండలిక వృత్తిపద కోశాల లక్ష్యం, ప్రయోజనం తెలుస్తున్నది. వీటిన్నటిని పరిశీలిస్తే ఇవి ఇంకా విస్తృత ప్రాతిపదికన రావలసిన అవసరం కూడా కనిపిస్తున్నది.

**తెలుగు సాహిత్య కోశం** ఇది రెండు సంపుటాలుగా వెలువడింది. తెలుగు అకాడమి, హైదరాబాదువారు వీటిని 1986లో ప్రచురించారు. ఆది కవి నన్నయ మొదలు 1950 వరకు వచ్చిన సాహిత్య ప్రక్రియలు, కవులు, కావ్యాలు, గ్రంథాలు, రచయితల పేర్లు ఆరోపాలుగా తీసుకొని వాటినన్నిటిని అకారాదిగా సంగ్రహించి సంక్షిప్త పరిచయాలు సమకూర్చినారు.

మొదటి సంపుటంలో నన్నయ మొదలు 1850 వరకు వచ్చిన ప్రాచీన సాహిత్యాంశాలకు సంబంధించిన సంక్షిప్త పరిచయాలున్నాయి. రెండవ సంపుటంలో 1851 నుంచి 1950వరకు వందేళ్లలో వచ్చిన ఆధునిక సాహిత్యాంశాల పరిచయాలున్నాయి. నల్లపాటి శివనాగయ్య, ఎం.ప్రమీలారెడ్డి, నీలాజంగయ్య, బి.విజయభారతి గార్లు ఈ సంపుటాలకు సంపాదకులుగా వ్యవహరించారు.

ఈ సంపుటాల్లో కవులు, కావ్యాలు, రచయితలను గూర్చిన సమీక్షా పూర్వకమైన సమాచారం, విశ్లేషణాత్మకమైన వివరణలు లేవు, కానీ కవుల,

రచయితల పేర్లు, వారి రచనల పేర్లు, వాటిని ప్రచురించిన సంస్థలు, ముద్రణపొందిన సంవత్సరం మొదలైన వివరాలు అకారాదిగా సమకూర్చిన ఈ తరహా ఆచూకి గ్రంథాలను నిఘంటు రూప విజ్ఞాన సర్వస్వాలుగా పరిగణింప బడుతున్నాయి.

**ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వాలు** ఒక ప్రాంతానికి సంబంధించిన విజ్ఞానాంశాల అన్నిటిని సమకూర్చిన గ్రంథాలు ప్రాంతీయ (దేశం, రాష్ట్రం, మండలం/జిల్లా) విజ్ఞాన సర్వస్వాలు. ఇవి రాష్ట్రానికి సంబంధించనవి రెండు, మూడు వచ్చినా, మండల లేదా జిల్లా సర్వస్వాలే తెలుగులో ఎక్కువగా కనిపిస్తాయి. ఏదో ఒక రూపంలో ఇవి మన జిల్లాలన్నిటికి దాదాపుగా వచ్చి ఉంటాయి. అయితే ఇవన్నీ అక్షర క్రమంలో లేక పోవడం వలన, విషయం కూడా వీలైనంత సమగ్రంగా లేకపోవడం వలన, ఆధునిక పరిశోధకులు కొందరు వీటిని విజ్ఞాన సర్వాస్వాలుగా పరిగణించడం లేదు. విషయ క్రమంలో ఉన్నా, అక్షర క్రమంలో ఉన్నా ఆయా శాఖల విజ్ఞానాంశాలను వీలైనంత సమగ్రంగా సమకూర్చిన గ్రంథాలు విజ్ఞాన సర్వస్వాలుగా పరిగణించ వచ్చునని కొందరి అభిప్రాయం. ఈ దృష్టితో చూచినప్పుడు తెలుగులో వచ్చిన రాష్ట్రీయ సర్వస్వాలు, మండల సర్వస్వాలలో కొన్ని ఆయా ప్రాంతాలకు చెందిన విజ్ఞాన సర్వస్వాలుగా చెప్పదగి ఉన్నాయి.

ఆంధ్ర రాష్ట్ర సంబంధ సమాచారంతో వచ్చిన విజ్ఞాన సర్వస్వాలు మూడు వరకు ఉన్నాయి. (1) ఆంధ్ర సర్వస్వము (2) ఆంధ్ర ప్రదేశ్ దర్శిని (3) ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వం. వీటిలో చివరిది తప్ప మిగిలినవి రెండు విషయ క్రమ పద్ధతిలో ఉన్నాయి.

**ఆంధ్ర సర్వస్వం** దీని మొదటి ముద్రణ 1947లో వచ్చింది. ఇందులో ఆంధ్ర ప్రాంతాలకు చెందిన ఆంధ్రుల చరిత్ర, భూభాగాలు, మతాలు, భాషా సాహిత్యాలు శిల్పం, చిత్రలేఖనాది కళలు, విద్యావ్యాప్తి, ఆర్థిక స్థితి గతులు,రాజకీయాలు మొదలైన అంశాలన్నీ ఆది నుంచి ఆధునికం వరకు

32 అధ్యాయాల్లో వివరించడం జరిగింది. అవసరమైన చోట్ల ప్రముఖుల ఛాయా చిత్రాలు మొదలైన విజ్ఞాన సాధనాలు సమకూర్చబడినాయి. మాగంటి బాపినీడు, గిడుగు వెంకటసీతాపతి, మోటూరి సత్యనారాయణ గార్లు సంపాదకులుగా వ్యవహరించారు. దీని రెండవ ముద్రణ 1961లో వెలువడింది.

ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని ఉగ్గడిస్తూ ".. ఇది ప్రాచీన విషయ విజ్ఞానంతో పాటు, వర్తమాన కర్తవ్యాలను, భవిష్యత్తును భద్రపరుచు రీతులను తెలిపి, జ్ఞానంతో శీలము, శీలానికి ఆవశ్యకమైన జ్ఞానము పరస్పర వర్ధకాలగు ఈ రెండింటిని మన హృదయాలను నాటునట్లు చేసి దేశోపకారాన్ని సల్పి నారీ గ్రంథకర్తలు" అని కట్టమంచి రామలింగా రెడ్డి గారు ఈగ్రంథానికి వ్రాసిన "ముఖ బంధము" (పీఠిక)లో చెప్పారు. అయితే భావరాజు కృష్ణారావు దీనిలోని లోపాలను ఎత్తిచూపుతూ, ఇది ఒక విజ్ఞాన సర్వస్వమని పించు కోదని 1947లో భారతిలో ఒక వ్యాసం వ్రాశాడు. ఏది ఏమైనా ఆంధ్ర ప్రాంతాలకు సంబంధించి వివిధ రంగాల విజ్ఞానాన్ని వీలైనంత సమగ్రంగా పాఠకులకందించిన ఈ గ్రంథం, ఒక ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వంగానే పరిగణింప బడుతున్నది.

**ఆంధ్రప్రదేశ్ దర్శిని** ఇది ఆంధ్ర రాష్ట్రానికి చెందిన-నైసర్గిక స్వరూపం చరిత్ర-సంస్కృతి, సమాజం, రాజకీయాలు, శాస్త్ర విజ్ఞానం, విద్యా రంగం, కళలు-సాహిత్యం, రాష్ట్రంలోని 23 జిల్లాలకు సంబంధించిన సమాచారం, ఆంధ్ర ప్రముఖుల జీవిత చరిత్రలు మొదలైన అంశాలు 10 అధ్యాయాల్లో వివరించిన ప్రాంతీయ (రాష్ట్రీయ) విజ్ఞాన సర్వస్వం. విషయ వివరణలు విషయ క్రమ పద్ధతిలో ఉన్నాయి. అవసరమైన చోట్ల గణాంక పట్టికలు, రేఖా చిత్రాలు, చిత్ర పటాలు మొదలైన విజ్ఞాన సాధనాలు సమకూర్చ బడినాయి. వై.వి.కృష్ణారావు, ఏటుకూరి బలరామయ్య గార్లు సంపాదకులుగా వ్యవహరించారు. 1976లో విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, దీనిని ప్రచురించింది. దీని రెండవ ముద్రణ కొన్ని మార్పులు చేర్పులతో 1987లో వచ్చింది.

**ఆంధ్రదేశ చరిత్ర, భూగోళ సర్వస్వం** ఇది 1971లో వచ్చింది. దీనిని విషయ పరంగా చూస్తే-చరిత్ర-భూగోళం అనే అనుబంధ శాఖల విజ్ఞానాన్ని సమకూర్చిన గ్రంథంగా ఇది ప్రత్యేక విజ్ఞాన సర్వస్వాల వర్గంలోకి వస్తుంది. ప్రాంతాల పరంగా చూస్తే-ఆంధ్ర ప్రాంతానికి సంబంధించినదిగా ఇది ప్రాంతీయ విజ్ఞన సర్వస్వాల్లోను చేరుతుంది.

యుగాయుగాల ఆంధ్రదేశ చరిత్రను, నైసర్గిక స్వరూపాలను సమగ్రంగా చిత్రించేందుకు ఉద్దేశించిన గ్రంథమిది. దీని రచనా ప్రణాళిక, దాని కనుగుణంగా సమీకరించిన విషయాలు పరిశీలిస్తే ఆంధ్ర ప్రాంతాలకు చెందిన చారిత్రక విషయాలు, భౌగోళిక విషయులు సమగ్రంగా విశ్లేషణాత్మకంగా వివరించేందుకు ఉద్దేశించిన గ్రంథంగా తెలుస్తుంది. అక్షర క్రమంలో నిర్మించిన ఈ విజ్ఞాన సర్వస్వం ఏ కారణాల వల్లనో మూడు సంపుటాలు మాత్రమే వెలువడి అసమగ్రంగా ఆగిపోయింది.

ఖండవల్లి లక్ష్మీరంజనం గారి అధ్యక్షతన మామిడిపూడి వెంకట రంగయ్య, పల్లా దుర్గయ్య, చలంచర్ల రంగాచార్యులు ఇరివెంటి కృష్ణమూర్తి, వి.విశ్వనాథం గార్లతో సంపాదక మండలి ఏర్పడింది. ఆంధ్ర రచయితల సంఘం హైదరాబాదు వారు ప్రచురించారు.

మొదటి సంపుటం 1971లో వచ్చింది. అంక తెలగరిశెట్టి నుంచి అల్లా ఉద్దీన్ వరకు ఆరోపాల వివరణ లున్నాయి. రచయితల సంఖ్య 57. అవసరమైన చోట్ల ఫొటోలు, వర్ణ చిత్రాలు, రేఖా చిత్రాలు మొదలైన విజ్ఞాన సాధనాలు సమకూర్చడం జరిగింది. గ్రంథం చివర అనుబంధంలో ముఖ్య నామ సూచిక (Index) ఇవ్వడం జరిగింది.

రెండవ సంపుటం 1974లో వచ్చింది. "అల్లిదొడ్డి మొదలు ఆంధ్రేతిహాస పరిశోధక మండలి" వరకు గల ఆరోపాలు వివరింప బడినాయి. ఇందులోని ఆరోపాలకు వివరాలు విస్తృతంగా విశ్లేషణాత్మకంగా సమకూర్చడం జరిగింది. ఫొటోలు, చిత్రపటాలు మొదలైనవి కూడా ఇవ్వబడినాయి.

మూడవ సంపుటం 1976లో వెలువడింది. "ఆకరాపల్లి కోదండరాములు మొదలు ఉదయగిరి చరిత్ర" వరకు గల ఆరోపాల వివరణ లున్నాయి. మొత్తం 28మంది రచయితలు 317 వ్యాసాలను ఇందులో ప్రచురించారు. ఈ రెండు సంపుటాల్లోను చివరి అనుబంధాల్లో (1) నామ సూచిక (Index) (2) ఆచూకీ గ్రంథాల పట్టిక (Bibliography) ఇవ్వడం జరిగింది.

తెలుగు వాళ్ళ ప్రశస్తిని దేశదేశాల చాటేందుకు ఈ విజ్ఞాన సర్వస్వాన్ని, దాని కమర్చిన ముఖ పత్రాన్ని తీర్చిదిద్ది నట్లు ఈ విజ్ఞాన సర్వస్వాన్ని చూచిన వారికిట్టే తెలిసి పోతుంది. ఇంతటి ఉన్నతాశయంతోను, ఉన్నత ప్రమాణాలతోను నిర్మితమైన ఈ విజ్ఞాన సర్వస్వం అసంపూర్తిగా ఆగిపోవడం దురదృష్టం.

**మండల సర్వస్వాలు** మన ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వాల్లో ఇవే ఎక్కువగా కనిపిస్తాయి. దాదాపు అన్ని జిల్లాలకు వచ్చి ఉంటాయి. విజ్ఞాన సర్వస్వాలకు సంప్రదాయ బద్ధమైన అక్షర క్రమంలో గాక ఇవన్నీ విషయ క్రమ పద్ధతిలో ఉన్నాయి. ఒక్క వరంగల్ జిల్లా విజ్ఞాన సర్వస్వం మాత్రమే అక్షర క్రమంలో ఉంది.

విషయ క్రమ పద్ధతిలో-విక్రమ సింహపురి మండల సర్వస్వం. నల్గొండ, ఆదిలాబాదు, మహబూబ్ నగర్, మెదక్,వరంగల్ మొదలైన జిల్లాలకు సర్వస్వ గ్రంథాలు వెలువడి ఉన్నాయి. వీటన్నిటిలోను ఆయా జిల్లాలకు సంబంధించిన చరిత్ర, నైసర్గిక స్వరూపం,శాసనాలు, ఉద్యమాలు, విద్యా, వైద్యం, పర్యాటక రంగాలు, కళలు,సాహిత్యం, రాజకీయాలు, ప్రభుత్వ పాలనా యంత్రాంగం, ప్రభుత్వ కార్యాలయాలు. మొదలైన అన్ని శాఖల సమాచారాన్ని సేకరించి విషయ క్రమంలో వివరించడం జరిగింది. విషయక్రమ పద్ధతిలో వచ్చిన దాదాపు అన్ని మండల సర్వస్వాల్లోను ఏవో కొద్ది మార్పులు చేర్పులతో విషయ ప్రతిపాదన ఒకే విధంగా కనిపిస్తుంది.

ముఖ్యమైన మండల సర్వస్వాల్లో మొదట విక్రమసింహపురి (నెల్లూరు) మండల సర్వస్వం 1983లో వచ్చింది. ముఖ్య సంపాదకుడు నల్లపురెడ్డి చంద్రశేఖరరెడ్డి, ఇది. మూడు విభాగాలుగా ఉంది.

నల్గొండ మండల సర్వస్వం (1986) ఆదిలాబాదు జిల్లా సర్వస్వం (1990) మహబూబ్‌నగర్ జిల్లా సర్వస్వం (1993)లో వచ్చాయి. రచయిత, సంపాదకులు బి.యన్. శాస్త్రిగారు, మూసి పబ్లికేషన్స్ హైదరాబాద్ వారు ప్రచురించారు. ఆయా జిల్లాల చారిత్రక, భౌగోళికాంశాలతో బాటు, ప్రజా పరిషత్తులు, కార్యాలయాలు మొదలైనవన్నీ అయిదారు అధ్యాయాలుగా విభాగించి, వాటిలో వచ్చే వివిధాంశాలను శీర్షికలు, ఉప శీర్షికల కింద విభజించి వివరించడం జరిగింది. గ్రంథం చివర ఆచూకి గ్రంథాల పట్టిక, ముఖ్య పదానుక్రమణిక (Index) సమకూర్చ బడినాయి. ఇవన్నీ ఆయా జిల్లాల సమాచారాన్ని వీలైనంత సమగ్రంగా అందించిన మండల సర్వస్వాలు. అవసరమైన చోట్ల ఫోటోలు, చిత్ర పటాలు, పట్టికలు ఇవ్వడం జరిగింది.

మెదక్‌జిల్లా సర్వస్వం-రచయిత శ్రీశాస్త్రుల రఘురామ శర్మ. ప్రచురణ మౌలికా గ్రాఫిక్స్, హైదరాబాదు. ప్రచురణ 2001. చరిత్ర సంస్కృతి, పాలనా రంగం, స్థానిక స్వపరిపాలన, పర్యాటక రంగం, సాంస్కృతిక రంగం అనే విధంగా 12 అధ్యాయాల్లో జిల్లాకు సంబంధించిన సమాచారాన్ని చాలా వరకు సమగ్రంగ సమకూర్చిన గ్రంథమిది. అవసరమైన చోట్ల చిత్రపటాలు, ఫొటోలు పట్టికలు మొదలైనవి సమకూర్చబడినాయి.

వరంగల్‌జిల్లాకు సంబంధించి వరంగల్ దర్శిని (1986) సంపాదకులు కొండబత్తిని జగదీశ్వరరావు. వరంగల్ జిల్లా సర్వస్వం (1998) రచయిత విద్వాన్ తెన్నేటి. ఇవి రెండు విషయ క్రమంలో వచ్చిన మండల సర్వస్వాలు. ఇందులో మొదటిది వరంగల్ జిల్లాకు చెందిన వివిధాంశాలను 39వ్యాసాల్లో పొందుపర్చిన గ్రంథం. రెండవది 13ప్రకరణాల్లో ఆయా శాఖల సమాచరాన్ని సమకూర్చిన గ్రంథం.

**వరంగల్ జిల్లా విజ్ఞాన సర్వస్వం** (2008) ప్రధాన సంపాదకులు డా॥గుంజి వెంకట రత్నం (ఈ గ్రంథ రచయిత). ఇదొక్కటే మన ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వాల్లో అక్షర క్రమంలో నిర్మించిన విజ్ఞాన సర్వస్వం. ఈ జిల్లాకు సంబంధించిన వివిధ రంగాలకు చెందిన విజ్ఞానాన్ని ఓరుగల్లు ప్రశస్తి, నైసర్గిక స్వరూపం, చరిత్ర సంస్కృతి, శాసనాలు, దేవాలయాలు-దర్శనీయ స్థలాలు. సాహిత్య రంగం, కళలు-కళాకారులు, ఉద్యమాలు, విద్యా రంగం, వైద్యం, ఆరోగ్యం, న్యాయ వ్యవస్థ, పత్రికలు-ప్రసార మధ్యామాలు, జానపద గిరిజన విజ్ఞానం, వ్యవసాయం, నీటి పారుదల, వాణిజ్యం, క్రీడా వినోదాలు, సేవా సంస్థలు, రాజకీయాలు, మత సంప్రదాయాలు, ప్రభుత్వం-పాలనా యంత్రాంగం అని 20 ప్రకరణాలుగా విభజించి, ఏ విభాగానికా విభాగంలోని విజ్ఞానాంశాలను ప్రాకరణికాక్షర క్రమంలో వివరించిన విజ్ఞాన సర్వస్వం. వివరణలు సంక్షిప్త సమాచారంతో కూడి ఉన్నాయి. భాషా శైలీ సరళ వ్యవహారంలో సాగింది. అవసరమైన విజ్ఞాన సాధనాలు కలర్ ఫోటోలు నంబర్లు ఇచ్చి గ్రంథం మొదట్లోనే సమకూర్చడం జరిగింది. గ్రంథం చివరి రచయితలపేర్లు సంజ్ఞా పద వివరణలు (తెలుగు మరియు ఇంగ్లీషు) సమగ్ర అకారాది పదసూచిక (Index) ఇవ్వడం జరిగింది. ముఖపత్రం చూడగానే ఇది వరంగల్‌కు సంబంధించిన గ్రంథమని తెలిసే విధంగా కాకతీయుల కీర్తి తోరణం వర్ణ చిత్రం ఉంది. దాని మధ్యలో చిత్రించిన వికసించిన పద్మం (కాకతీయ శిల్పం) దాని చుట్టూ లిఖించిన పోతన భాగవత సూక్తి చూస్తే ఇది విజ్ఞాన సర్వస్వమని తెలుస్తుంది. ఆ విధంగా ముఖపత్రం చూడగానే ఇది వరంగల్ జిల్లా విజ్ఞాన సర్వస్వం అని తెలిసేటట్లు రూపొందించడం జరిగింది. దీనికి 19మంది సభ్యులతో సంపాదక మండలి ఏర్పడింది.మన ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వాల్లో రాష్ట్రానికి సంబంధించి-ఆంధ్ర చరిత్ర-భూగోళ సర్వస్వం, జిల్లాలకు సంబంధించి వరంగల్ జిల్లా విజ్ఞానసర్వస్వం. ఇవి రెండు మాత్రమే అక్షర క్రమంలో వచ్చిన విజ్ఞాన సర్వస్వాలు.

**ప్రత్యేక విజ్ఞాన సర్వస్వాలు** ఒక శాఖ లేదా అనుబంధ శాఖల విజ్ఞానాన్నంత క్రమ పద్ధతిలో సంగ్రహించి చెప్పిన ఉద్గ్రంథాలు ప్రత్యేక విజ్ఞాన సర్వస్వాలు. తెలుగు భాషా సమితి నిర్మించిన విజ్ఞాన సర్వస్వ సంపుటాలు గాని, లేదా ఇప్పుడు తెలుగు విశ్వవిద్యాలయం నిర్మిస్తున్నవి గాని, ఏ సంపుటానికా సంపుటం వేరు వేరుగా చూస్తే, అవి దేనికదే ఒక ప్రత్యేక విజ్ఞాన సర్వస్వంగానే కనిపిస్తుంది. ఉదా: విశ్వసాహితి ఈ సంపుటంలో కేవలం ప్రపంచ దేశాల సాహిత్యాంశాల వివరాలే ఉంటాయి. అదే విధంగా భౌతిక రసాయన శాస్త్రాలు, ఈ సంపుటంలో రెండు అనుబంధ శాస్త్రాల విజ్ఞానమంతా సంగ్రహించడం జరిగింది. ఇలా చూచినప్పుడివి ప్రత్యేక విజ్ఞాన సర్వస్వాలు. వీటన్నిటిని కలిపి ఏక మొత్తంగా చూచినప్పుడిది తెలుగులో వచ్చిన ఒక గొప్ప సామాన్య విజ్ఞాన సర్వస్వంగా చెప్పవచ్చును.

ఈ క్రమంలో తెలుగు విశ్వవిద్యాలయం నిర్మించిన History and Culture of Andras, (1995) భారత భారతి (1999) నాటక విజ్ఞాన సర్వస్వం (2008) రసాయన శాస్త్రం (2012) మొదలైనవన్నీ ఏదో ఒక శాఖ లేదా అనుబంధ శాఖల విజ్ఞానాన్నంతా పొందుపర్చిన గ్రంథాలవడం చేత వీటిని ప్రత్యేక విజ్ఞాన సర్వస్వాలుగా కూడా పరిగణించవలసి ఉంటుంది. (చూ. విజ్ఞాన సర్వసంపుటాలు-తెలుగు విశ్వవిద్యాలయం)

వస్తుగుణ దీపిక (1940) రచన, కూర్పు ఎర్రా వెంకటస్వామి నాయుడు. వస్తు గుణ ప్రకాశిక (1958) రచన, కూర్పు ఏటూరి వాసుదేవ శాస్త్రి. వస్తు గుణ చంద్రిక (1970) రచన, కూర్పు చెరుకుమిల్లి వెంకటరామయ్య.

ఇవి మూడు ఉద్గ్రంథాలు ఒకే కోవకు చెందినవి. ప్రకృతి లోని వివిధ వస్తువుల గుణ రూపాదులను ఆయుర్వేద శాస్త్ర పరంగా సంక్షిప్తంగా వివరించిన విజ్ఞాన సర్వస్వాలు. ప్రకృతిలో మనకు లభించే అభ్రకం, స్వర్ణం, రాగి మొదలైన ఖనిజాలు, ఇంగిలీకం, కస్తూరి, కచూరాలు, ఖర్జూరాలు, పగడం, ముత్యం, సాంబ్రాణి, కర్పూరం, మైసాక్షి, మైలతుత్తం మొదలైన వేలకొలది వివిధ వస్తువులు, వాటి గుణాలు, అవి దొరికే ప్రదేశాలు, వాటి

ప్రయోజనం మొదలైన అంశాలను ఆయుర్వేద వైద్య శాస్త్ర పరంగా సంక్షిప్త రూపంలో చెప్పిన గ్రంథాలివి. ఒక్కొక్క వస్తువును ఒక ఆరోపంగా తీసుకొని, వాటినన్నిటిని అక్షర క్రమంలో కూర్చి, అకారాద్య క్రమణికలో నిర్మించిన విజ్ఞాన సర్వస్వాలు.

**సంగీత సంప్రదాయ ప్రదర్శిని** దీని ద్వితీయ ముద్రణ 1973లో వచ్చింది. రచయిత సుబ్బారాయ దీక్షితులు, పర్యవేక్షకులు రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు. ఇందులో వాగ్గేయ కార చరిత్ర, సంగీత లక్షణ ప్రాచీన పద్ధతి. సంగీత లక్షణ సంగ్రహం. సంగీత సంప్రదాయ ప్రదర్శిని అనే విభాగాలున్నాయి. ఒక్కొక్క విభాగానికి సంబంధించిన విషయాలన్నీ విషయక్రమ పద్ధతిలో వివరించడం జరిగింది. చివరి భాగంలో రాగాలు, రాగ బేధాలు, రాగ లక్షణాలు, మేళాలు, మేళకర్తలు మొదలైన వాని వివరాలు ఇవ్వడం జరిగింది.

**బాలల విజ్ఞాన సర్వస్వాలు** బాల బాలికల విజ్ఞానవలోడనానికి తగినట్లుగా ప్రత్యేకంగా వారి కోసం నిర్మించే గ్రంథాలు బాలల విజ్ఞాన సర్వస్వాలు. వీటిలో అన్ని శాఖల విజ్ఞానాంశాలు గాని లేదా కొన్ని శాఖల విజ్ఞానాంశాలుగాని, సంక్షిప్త రూపంలో, కథాకథన శైలిలో వివరించడం జరుగుతుంది. తెలుగులో అన్ని శాఖల విజ్ఞానాంశాలను సమకూర్చిన Children's Britanica లాంటి సమగ్ర బాలల విజ్ఞాన సర్వస్వం ఇప్పటి వరకు రాలేదు. పాశ్చాత్య దేశాల్లో బాలల విజ్ఞాన సర్వస్వాలు కోకొల్లలుగా వెలువడి ఉన్నాయి. అమెరికా, ఇంగ్లాండులాంటి అగ్ర దేశాల్లో బాలల విజ్ఞాన సర్వస్వాలు తరగతి గదుల్లో బోధనా పరంగా కూడా వాడుతున్నారంటే వాటి ఉపయోగ మెంత వరకున్నదో మనమూహించుకోవచ్చును. బాలల విజ్ఞాన సర్వస్వాలుగా చెప్పదగిన గ్రంథాలు. కొన్ని తెలుగులోను వెలువడి ఉన్నాయి.

**బాలల విజ్ఞాన సర్వస్వం** (1956) ఇందులో భూగోళ శాస్త్రం, భూగర్భ శాస్త్రం, ఖగోళ శాస్త్రాలకు సంబంధించిన వివిధాంశాలున్నాయి. ఆయా విషయాలను కొన్ని శీర్షికలుగా విభజించి వ్యాస రూపంలో పొందుపర్చారు. సంపాదకులు

మహమ్మద్ కాసీంఖాన్, ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ 1956లో దీనిని ప్రచురించింది. ఇది ఒక విజ్ఞాన సర్వసవంగా చెప్పదగిందిగా లేదు.

**చిల్డ్రన్స్ నాలెడ్జి బ్యాంకు** (1983-84) ఇంగ్లీషులోని Children's Knowledge Bank అనే గ్రంథం ఆధారంగా అదే పేరుతో తెలుగులో వెలువడిన బాలల విజ్ఞాన సర్వస్వమిది. మూడు సంపుటాలుగా ఉంది. దీనిని పుస్తక మహల్, ఢిల్లీ వారు ప్రచురించారు. మొదటి సంపుటం 1983లోను, మిగిలిన రెండు 1984లోను వచ్చాయి. ముదిగొండ వీరభద్రశాస్త్రి గారు సంపాదకులు.

**సచిత్ర విజ్ఞాన సర్వస్వం** (1990) చిన్న పిల్లల కోసం ప్రత్యేకంగా నిర్మించిన గ్రంథమిది. ఆకర్షణీయమైన చిత్ర పటాలతో సుసాన్ బోసాంకో మొదలైన వాళ్ళు నిర్మించిన ఈ విజ్ఞాన సర్వస్వాన్ని బి.గోపాలం, వసంతరావు వెంకటరావు, పి.చంద్రశేఖర్, సాంబశివరావు గార్లు తెలుగులోని కనువదించారు. ఇందులో-భూగోళం, జీవ ప్రపంచం, మానవ శరీరం, శాస్త్ర విజ్ఞానం. సంఖ్య (గణితం) సౌర మండలం అనే ఆరు విభాగాలున్నాయి. ఈ విభాగాల్లోని వివిధాంశాలు 311వ్యాసాల్లో పిల్లల అవగాహనకు వీలుగా పొందుపర్చడం జరిగింది. అవసరమైన చోట్లల్లా వీలైనంత ఎక్కువగా చిత్ర పటాలు, ఫోటోలు మొదలైన విజ్ఞాన సాధనాలు సమకూర్చ బడ్డాయి. ఇది అక్షర క్రమంలో లేక పోయినా గ్రంథం చివర ఇందులోని ఆరోప పదాలు'అ-హ' వరకు అకారాదిగ 'సూచిక' (Index)లో ఇవ్వబడినాయి.

**బాల విజ్ఞాన సర్వస్వం-సంస్కృతీ విభాగం** (1991) సంస్కృతీ విభాగానికి సంబంధించి, ప్రపంచ విజ్ఞానాన్ని వీలైనంత సమగ్రంగా చెప్పిన బాలల విజ్ఞాన సర్వస్వమిది. అకారాద్యను క్రమణికలో నిర్మించిన ఈ గ్రంథంలో 'అంగోలా మొదలు హెూంరూలు ఉద్యమం' వరకు గల ఆరోపాలకు సంక్షిప్త వివరణలున్నాయి. అవసరమైన చోట్ల ఫొటోలు, రేఖా చిత్రాలు, మాపులు మొదలైన విజ్ఞాన సాధనాలు సమకూర్చ బడినాయి. ఇది అక్షర సమీకరణ పద్ధతిలో నిర్మించబడి ఉన్నా, సంపాదకుడు విషయ ప్రాధన్య పరంగా

ఇందులోని విజ్ఞానాన్నంతా 11విభాగాలుగా విభజించి, ఆయా విభాగాల్లో వచ్చే విజ్ఞానాంశాలను పుటలతో సహా వర్గీకృత విషయ సూచికలో వివరంగా ఇచ్చాడు. ఇది ఒక విధంగా విజ్ఞాన సర్వస్వాల్లో చివర ఇచ్చే పద సూచిక (Index) లాంటిది. సంపాదకుడు బుడ్డిగ సుబ్బరాయన్ అభినందన పబ్లిషర్స్ విజయవాడ వారు దీనిని 1991లో ప్రచురించారు.

ఇప్పటి వరకు తెలుగులో వచ్చిన బాలల విజ్ఞాన సర్వస్వాలను పరిశీలిస్తే ఇదొక్కటి మాత్రమే సంస్కృతీ విభాగానికి సంబంధించిన బాలల విజ్ఞాన సర్వస్వంగా చెప్పదగి ఉన్నది. వీటన్నిటిని బట్టి చూస్తే తెలుగులో ఒక చక్కని బాలల విజ్ఞాన సర్వస్వాన్ని నిర్మించ వలసిన అవసరం కూడా కనిపిస్తున్నది. ప్రభుత్వ సంస్థలు, విశ్వ విద్యాలయాలు ఈ దిశగా కృషి చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది.

**సాహిత్య పర విజ్ఞాన సర్వస్వాలు** సాహిత్య మంతా లేదా ఒక యుగ సాహిత్యంలోని లేదా ఒక సాహిత్య ప్రక్రియలోని లేదా ఒక కావ్యంలోని విజ్ఞానాంశాలనన్నిటిని సమీకరించి, ఒక క్రమ పద్ధతిలో కూర్చి వివరించిన ఉద్గ్రంథాలు సాహిత్య పర విజ్ఞాన సర్వస్వాలుగా పేర్కొనడం జరిగింది. ఇటువంటి వర్గీకరణ పాశ్చాత్య విజ్ఞాన సర్వస్వాల్లో కనుపించదు. తెలుగులో మాత్రం పురాణ నామ చంద్రిక, వర్ణన రత్నాకరం, అర్ష విజ్ఞాన సర్వస్వం. శ్రీకృష్ణ దేవరాయాంధ్ర సాహిత్య విజ్ఞాన సర్వస్వం, పూర్వ గాథాలహరి, ఆర్య విజ్ఞాన సర్వస్వం, మహాభారతం-విశ్వ విజ్ఞాన కోశం, హంసవింశతి-విజ్ఞాన సర్వస్వం, ప్రాచీన సమాజ విజ్ఞాన సర్వస్వం మొదలైన ఇలాంటి గ్రంథాలు దాదాపు 10వరకు వచ్చి ఉన్నాయి. వీటిలో చివరి రెండు గ్రంథాలు తప్ప మిగిలినవన్నీ విషయ క్రమ పద్ధతిలో ఉన్నాయి. పురాణ నామ చంద్రిక, పూర్వ గాథాలహరి అనే రెండు అకారాది క్రమంలో ఉన్నా, పురాణ విజ్ఞానాన్ని వీలైనంత సమగ్రంగా సమీకరించిన గ్రంథాలు కావు. వర్ణన రత్నాకరం, శ్రీకృష్ణ దేవరాయాంధ్ర సాహిత్య విజ్ఞాన సర్వస్వం అనే గ్రంథాలు రెండు,

సాహిత్యంలోని విజ్ఞానాంశాలను యధాతథంగా పద్యాలనే సమకూర్చిన గ్రంథాలు. మహాభారతం-విశ్వవిజ్ఞాన కోశం అనేది కూడా మహాభారతంలోని వివిధ విజ్ఞానాంశాలను వీలైనంత సమగ్రంగా వివరించిన గ్రంథంగా కనిపించదు. (చూ. తెలుగు విజ్ఞాన సర్వస్వాల చరిత్ర)

**ఆర్ష విజ్ఞాన సర్వస్వం** (1965) రచయిత శీలప్ప రామ కృష్ణశాస్త్రి. అర్ష విజ్ఞానమంటే "అర్ష మహర్షులు జగద్ధిత కాంక్షతో లోకానికి ప్రసాదింప గోరి వేద, వేదాంగ, పురాణేతిహాస, స్మృత్యాది గ్రంథాల్లో నిక్షేపించిన జ్ఞాన, విజ్ఞాన పరంపర. అని ఆచార్య దివాకర్ల వెంకటావధాని, ఈ గ్రంథానికి రాసిన పీఠికలో పేర్కొన్నారు. అంటే ఇది వేద వాఙ్మయంలోని వివిధ శాఖల విజ్ఞానాన్ని వివరించిన గ్రంథమన్నమాట. ఈ విజ్ఞాన సర్వస్వం రెండు సంపుటాలుగా ఉంది. అక్షర క్రమంలో గాక విషయ క్రమ పద్ధతిలో నిర్మించిన విజ్ఞాన సర్వస్వం.

మొదటి సంపుటంలో 2గుచ్ఛాలు (భాగాలు)న్నాయి. రెండు గుచ్ఛాలు 10కాండలుగా విభజించడం జరిగింది. (ధర్మకాండ, అర్థకాండ, నీతికాండ, కామకాకండ, వేదాంగ కాండ మొ॥) ఈ కాండల్లో పురుషార్థ నిరూపణం. భూగోళ స్వరూపం, త్రివర్గం, చతష్షష్టి కళలు, స్త్రీ పురుష జాతి వివేచన,, వేదాంగాలైన శిక్ష వ్యాకరణ జ్యోతిషాది శాస్త్ర విషయాలు, ప్రత్యక్ష అనుమాన ప్రమాణాలు, మీమాంస శాస్త్ర విషయాదులెన్నో వివరింపబడినాయి.

రెండవ సంపుటం 1967లో వచ్చింది. ఇందులోను రెండు గుచ్ఛాలున్నాయి. ఇవి మళ్ళీ ఆరు కాండలు (దేవతా విజ్ఞాన కాండ, సమన్వయ కాండ, పరమత నిరాకరణ కాండ, వైరాగ్య కాండ,ఉపసంహార, మోక్ష కాండలు)గా విభజించ బడినాయి. ఈ ఆరు కాండల్లో ఉపాసనా పద్ధతులు, విద్యా విశేషాలు,సాధన చతుష్టయం తర్క, సాంఖ్య, బౌద్ధ, జైనాది మత విషయాలు వివరించడం జరిగింది. ఈ విధంగా ఈ విజ్ఞాన సర్వస్వం వేద పురాణేతిహాసాది వాఙ్మయంలోని విజ్ఞానాన్నంత, విషయ క్రమ పద్ధతిలో చెప్పిన విజ్ఞాన సర్వస్వంగా చెప్పవచ్చును.

**ఆర్య విజ్ఞాన సర్వస్వం** ఆర్ష విజ్ఞాన సర్వస్వం లాగానే ఇది కూడా వేద వాఙ్మయంలోని వివిధ శాస్త్ర సాంకేతికాంశాలను వివరించిన విజ్ఞాన సర్వస్వం. ముఖ్య సంపాదకులు రఘునాథాచార్యులు. తిరుపతి తిరుమల దేవస్థానం వారు ప్రచురించారు. ఇది వైదిక వాఙ్మయంలోని వర్ణాశ్రమ ధర్మాలు. నీతి శాస్త్ర విషయాలు, రాజధర్మాలు, ప్రజాధర్మాలు, చంధో, మంత్ర, వైద్య గణితాది శాస్త్ర విషయాలు, జన జీవితంలోని సామాజికాంశాలు యజ్ఞ యాగాదులు, ఆచార, వ్యవహారాలు మొదలైన వైదిక విజ్ఞానాన్నంతటిని వివిధ శీర్షికలుగా విభజించి వివరించిన విజ్ఞాన సర్వస్వం.

**హంసవింశతి-విజ్ఞాన సర్వస్వం** (1989) రచన, కూర్పు డా॥ గుంజి వెంకటరత్నం (ఈ గ్రంథ రచయిత) హంస వింశతి విజ్ఞాన సర్వస్వాల లక్షణాలు గల ఒక కథా ప్రబంధం. దీనిలోని వివిధ శాస్త్ర సాంకేతికాంశాలను 14వర్గాలుగా విభజించి ఏ వర్గాని కావర్గంలోని ఆరోపాలకు ప్రాకరణికాక్షర క్రమంలో సమాచారాన్ని సంగ్రహించిన గ్రంథం హంస వింశతి-విజ్ఞాన సర్వస్వం (చూ. 2వ ప్రకరణం) ఇందులో దాదాపు 4000 ఆరోపాలను సంక్షిప్తంగా వివరించడం జరిగింది. ఇది నాలుగు సంపుటాలుగా ఉంది. మొదటి రెండు సంపుటాలు ముద్రితాలు. మిగిలిన రెండు అముద్రితాలు.

మొదటి సంపుటం 1989లో వెలువడింది. ఇది రెండు భాగాలుగా ఉంది. మొదటిది సిద్ధాంత ప్రకరణం. ఇందులో హంస వింశతి విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల కావ్యంగా సిద్ధాంతీకకరించడం జరిగింది. రెండవ భాగం వివరణ ప్రకరణం. ఇది రెండు వర్గాలుగా ఉంది. కళా వర్గం, విద్యావర్గం, కళావర్ణంలో నాట్య కళ, వాద్య కళ, గాన కళ, అనిమూడు విభాగాలున్నాయి. ఈ విభాగాల్లోని వివిధాంశాలను ఆరోపాలుగా ఎంచుకొని (హంసవింశతిలోనివి మాత్రమే) వాటిని ప్రాకరణికాక్షర క్రమంలో సంక్షిప్తంగా వివరించడం జరిగింది. అదే విధంగా విద్యా వర్గంలో ఆనాడు బహుళ ప్రచారంలోనున్న విద్యా రంగానికి సంబంధించి హంస వింశతి పేర్కొన్న మేరకు వేద, వేదాంగాలు, పురాణేతిహాసాలు, షట్శాస్త్రాలు, పంచ సిద్ధాంతాలు

మొదలైనవన్నీ ప్రాకరణాక్షర క్రమంలో వివరింపబడి ఉన్నాయి.గ్రంథం చివరనున్న అనుబంధాల్లో (1) హంస వింశతి గ్రంథ సంస్కరణము (2) పద సూచిక (Index) (3)ఉపయుక్త గ్రంథ పట్టికలున్నాయి.

రెండవ సంపుటం 1995లో వచ్చింది. ఇందులో (1)భౌగోళిక విజ్ఞానం. (2) వృక్ష విజ్ఞానం (3) క్రీడా వినోదాలు అనే విభాగాలున్నాయి. భూగోళ సంబంధమైన ద్వీపాలు, వర్షాలు, పుణ్య క్షేత్రాలు మొదలైన ఆరోపాల వివరణలన్నీ మొదటి విభాగంలో ఉన్నాయి. రెండవ విభాగంలో వృక్ష శాస్త్ర సంబంధమైన చెట్లు, మొక్కలు, తీగలు, పొదలు, కంపలు, పూలచెట్లు మొదలైనవన్నీ ప్రాకరణికాక్షర క్రమంలో వివరించడం జరిగింది. మూడవ ప్రకరణంలో ఆనాడు బాల బాలికలాడుకొనే ఆటలు, పాటలు మొదలైన వినోదాలు అక్షర క్రమంలో వివరించ బడినాయి. గ్రంథం చివర అనుబంధాల్లో సాంకేతిక పద సూచిక, అకారాద్యనుక్రమణిక (Index) ఉపయుక్త గ్రంథ పట్టికలున్నాయి. మిగిలిన రెండు సంపుటాలు అముద్రితాలు. ఇందులో 6నుండి 14వరకు గల వర్గాల వివరణలున్నాయి. (చూ. 2వ ప్రకరణం)

ఈ విజ్ఞాన సర్వస్వంలో వివరించిన పదాలకు, రూపాంతరాలు,పర్యాయ పదాలు, వ్యవహార నామాలు, కూడా చూపడం జరిగింది. కొన్నిటికి, ఎక్కువగా వాడుకలో ఉండే ఇంగ్లీషు పదాలు సూచించడం కూడా జరిగింది. ముఖ్యంగా వృక్ష విజ్ఞానానికి సంబంధించి శాస్త్రీయ నామాలు (Botanical names) సమకూర్చడం జరిగింది. ఇది పాఠకుల్లో ముఖ్యంగా విద్యార్థుల్లో భాషా, విషయ పరిజ్ఞానం పెంచేందుకు దోహదపడుతుంది.

**ప్రాచీన సమాజ విజ్ఞాన సర్వస్వం** ఈ విజ్ఞాన సర్వస్వం ప్రస్తుతం ముద్రణలో ఉంది. రచన, కూర్పు డా॥ గుంజి వెంకటరత్నం (ఈ గ్రంథ రచయిత)

ఆంధ్ర మహా భారతం మొదలు హంస వింశతి వరకు వచ్చిన మన ప్రాచీన కావ్యాల్లో ఆయా కాలాల్లో పరిఢవిల్లిన శాస్త్ర సాంకేతి కాంశాలెన్నో చోటు చేసుకొని ఉన్నాయి. ఆంధ్ర మహా భారత మొక్కటే ఒక విజ్ఞాన సర్వస్వంగా

(అనేక సంపుటాల్లో) నిర్మించదగి ఉన్నది. మిగిలిన కావ్యాల్లోను అక్కడక్కడ విజ్ఞానాంశాల ప్రతిపాదన కనిపిస్తుంది. అయితే పాల్కురికి సోమనాథుని రచనలు, ముఖ్యంగా పండితారాధ్య చరిత్ర, ఆ తర్వాత వచ్చిన సింహాసన ద్వాత్రింశిక, శుకసప్తతి, వాణీ విలాస వన మాలిక, హంస వింశతి కావ్యాల్లో ఆయా కాలాల్లోని వివిధ శాఖల విజ్ఞానాంశాలన్నీ అధికంగాచోటు చేసుకొని ఉన్నాయి. ఇవి తెలుగు కావ్యాల్లో విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల రచనలుగా ప్రసిద్ధి గాంచాయి. (చూ. 2వ ప్రకరణం) ఈ అయిదు కావ్యాల్లోని విజ్ఞానాంశాలన్నిటిని ఏర్చికూర్చి అక్షర సమీకరణ పద్ధతిలో (Unit letter sustem) నిర్మించిన బృహద్గ్రంథం ప్రాచీన సమాజ విజ్ఞాన సర్వస్వం.

ఇందులో "అంకగణితం మొదలు హౌజులోళ్ళు" వరకు గల ఆరోపాలను అక్షర సమీకరణ పద్ధతిలో క్రోడీకరించి, సంక్షేప రూప వివరణలివ్వడం జరిగింది. ఈ గ్రంథంలో వివరించిన అనేకానేక విజ్ఞానాంశాలకు అవసరమైన అనుబంధ సమాచారం, అధిక సమాచారం పాఠకులు తెలుసుకునేందుకు వీలుగా 18అనుబంధాలను సమకూర్చడం జరిగింది. మొదటి 14అనుబంధాల్లో పైన చెప్పిన పండితారాధ్య చరిత్ర మొదలు హంసవింశతి వరకు గల కావ్యాల్లో కవులు వివిధ విజ్ఞాన శాఖలకు సంబంధించి ఇచ్చిన పద పట్టికలు సమకూర్చ బడ్డాయి. అనుబంధం 15లో ఆనాటి ప్రజల వేషధారణకు సంబంధించిన వర్ణణలున్నాయి. అనుబంధం 16 సంకేతాక్షర పదసూచిక. అనుబంధం 17 ముఖ్యమైన ఆచూకీ గ్రంథాలు. అనుబంధం 18 పద సూచిక (Index) లు ఇవ్వడం జరిగింది.

ఈ విజ్ఞాన సర్వస్వాన్ని నిర్మించడంలో ముఖ్యంగా రెండు ప్రయోజనాలను ఆశించినట్లు రచయిత 'భూమిక'లో స్వయంగా చెప్పుకున్నాడు. మన పూర్వ తరాల వారి సామాజిక, సాంస్కృతిక, శాస్త్ర సాంకేతిక విజ్ఞానాన్ని మన సమకాలీనులకు, ఉత్తరోత్తర తరాల వారికి సంక్షిప్తంగా నైనా పరియం చేసి, తద్వారా మన సాంస్కృతిక వారసత్వంలో ఏర్పడుతున్న ఎడాన్ని (gap) కొంత వరకైనా తగ్గించగలమనే ఆశ మొదటి ప్రయోజనం.మన ప్రాచీన కావ్యాలు కేవలం కథలకు, వర్ణనలకు మాత్రమే పరిమితం కావు. ఆయా

కాలాల్లోని విజ్ఞానాంశాలు కూడా చోటు చేసుకొని ఉన్నాయి. వాటిని అధ్యయనం చేయడం ద్వారా మన పూర్వుల సంస్కృతీ సంప్రదాయాల విలువలు తెలుసుకోవడమే గాక, మన పూర్వ సమాజాల స్థితి గతులు అంచనా వేసేందుకవసరమైన సామాగ్రి ఎంతో ఉన్నదని చెప్పడం రెండో ప్రయోజనం.

రచయిత ఆశించినట్లుగానే ఈ విజ్ఞాన సర్వస్వంలో సమకూర్చిన సమాచారం సంక్షిప్త రూపంలో పాఠకులకు సులభ గ్రాహ్యంగా ఉంది. భాష-శైలి, సరళ వ్యవహారంలో గ్రంథం సాంతం ఒకే విధంగా సాగింది. ఈ గ్రంథం విజ్ఞాన జిజ్ఞాసులైన పాఠకులకు, ముఖ్యంగా విద్యార్థులకు, అధ్యాపకులకు పరామర్శ గ్రంథంగా ఉపయోగ పడుతుంది.

ఇంతవరకు తెలుగులో వచ్చిన విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల గ్రంథాలను విజ్ఞాన సర్వస్వాలను రేఖా మాత్రంగా చిత్రించడమే గాక, అందులో కొన్ని ముఖ్యమైన వాటిని సమీక్షించడం కూడా జరిగింది. ఇప్పటి వరకు వచ్చిన మన విజ్ఞాన సర్వస్వాలన్నీ కూడా నేటి మన విజ్ఞానావసరాలను తీర్చేవిగా లేవనే చెప్పాలి. ముఖ్యంగా బాలల విజ్ఞాన సర్వస్వాల నిర్మాణంలో ఈలోటు ఎక్కువగా కనిపిస్తున్నది.

ఒక జాతి సంప్రదాయ వ్యవస్థ ద్వారా సామాజిక సాంస్కృతిక, శాస్త్ర సాంకేతిక విజ్ఞానమంతా ఒక తరం నుండి తర్వాతి తరానికి సంక్రమించడం సహజం. అయితే జ్ఞాన సంపద పరిమితంగా ఉన్న పూర్వ కాలంలో ఎలా ఉన్నా, నేడు అన్ని రంగాల్లో జరుగుతున్న పరిశోధనల ద్వారా విజ్ఞానం పరుగులు తీస్తున్నది. విశ్వ వ్యాప్తమైన ఈ విజ్ఞానాన్ని మన కవసరమైనంత మేర సమీకరించి నేటి మన సమాజాని కందించవలసిన అవసరమెంతైనా ఉంది. ఆ దిశగా మన ప్రభుత్వ సంస్థలు, విశ్వ విద్యాలయాలు కృషి చేసి ఆయా స్థాయి పాఠకుల విజ్ఞానావలోడనానికి అనువైన విజ్ఞాన సర్వస్వాలను నిర్మించాలి. అప్పుడే మన విజ్ఞానావసరాలు తీరుతాయి. వీటి ప్రయోజనం నెరవేరుతుంది.

## అనుబంధం-I



మానవ విజ్ఞానం-ఫ్రాన్సిస్ బాకన్ వర్గీకరణం (Learning)
చరిత్ర
(History)
జీవశాస్త్రం
(Natural)
పౌర విజ్ఞానం
(Civil)
ఆచార వ్యవహారాలు
సాహిత్య విషయాలు
(Litarary)
కావ్యము / సాహిత్యము
(Poetry)
కథా సాహిత్యం
(Narrative)
నాటక సాహిత్యం
(Dramatic)
హితోపదేశాత్మక సాహిత్యం
(Parabolic)
దైవ సంబంధ విషయాలు (ధర్మ విజ్ఞానం)
(Theology)
దైవ సంబంధం
(God)
ప్రకృతి సంబంధం
(Natural)
మానవ సంబంధం
(Man)
మానవ విజ్ఞానం
( Human Philosophy)
సమాజ విజ్ఞానం
(Civil Philosophy)
శారీరక విజ్ఞానం
(Body)
ఆత్మ విజ్ఞానం
(Soul)
వైద్య శాస్త్రం
(Medical
అలంకరణ శాస్త్రం
(Cosmotic Arts)
వ్యాయామ శాస్త్రం
(Atheletic Arts)
(కామ శాస్త్రం) శృంగార కళలు
(Erotic Arts)
శాస్త్ర సిద్ధాంతాలు
(Philosophy)
గణిత శాస్త్రం
(Mathematics)
యంత్ర శాస్త్రం
(Machanics)
ఇంద్రజాలాది విద్యలు (Magic)
సిద్ధాంత ప్రకరణం
(Speculative)
ప్రయోగ ప్రకరణం
(Practical)
శుద్ధ గణితం
(Pure Mathematics)
మిశ్రమ గణితం
(Mixed Mathematics)
భౌతిక శాస్త్రాలు
(Physics)
(రూపాంతర) భౌతిక శాస్త్రాలు
(Meta Physics)

## అనుబంధం-II

# మానవ విజ్ఞానం-మాత్యూస్ మర్తిని వర్గీకరణం (Arslibaralis alia est)



## అనుబంధం-III

# విజ్ఞాన సర్వస్వాల వర్గీకరణం



## అనుబంధం-IV

# సంకేతాక్షర పద సూచిక

అ.ప-ఆది పర్వం

ఆ.వి.స-ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం

ఉపో.-ఉపోద్ఘాతం

చూ.-చూడు

తె.భా.స-తెలుగు భాషా సమితి

దీ.ప్ర-దీక్షా ప్రకరణం

ప.ప్ర-పర్వత ప్రకరణం

మాం.వృ.ప.కో-మాండలిక వృత్తి పద కోశాలు

వ.గు.చం.-వస్తు గుణ చంద్రిక

వ.గు.దీ.-వస్తు గుణ దీపిక

వ.గు.ప్ర.-వస్తు గుణ ప్రకాశిక

వి.ప.-విరాట పర్వం

వి.స.-విజ్ఞాన సర్వస్వం

సంగ్రా-సంగ్రాహకులు

సహా-సంగ్రా-సహాయ సంగ్రాహకులు

సం.ఆ.వి.కో-సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం

A.D.H.E.- The American Heritage Dictionary of English Language

C.D.E.L-Classical Dictionary of English Language

S.O.E.D-Shorter Oxford English Dictionary

C.L- Circle of Learning -A Study in Encyclopadia Making

E.B-Encyclopaedia Britanica

## అనుబంధం-V

# పరామర్శ గ్రంథాలు

1. ఆంధ్ర విజ్ఞాన సర్వము

2. ఆంధ్ర విజానము

3. విజ్ఞాన సర్వస్వ సంపుటాలు
(తెలుగు భాషా సమితి, తెలుగు విశ్వవిద్యాలయం)

4. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాలు

5. వ్యాస పీఠం

6. రత్నమాలిక (నిఘంటు-విజ్ఞాన సర్వస్వాల విశేష సంచిక)

7. విజ్ఞాన సర్వస్వాలు-విశ్లేషణాత్మక అధ్యయనం

8. ఆంధ్ర మహాభారతం

9. పండితారాధ్య చరిత్ర

10. సింహాసన ద్వాత్రింశక

11. శుక సప్తతి

12. హంస వింశతి

13. హంస వింశతి-విజ్ఞాన సర్వస్వం

14. వాణి విలాస వన మాలిక

15. ఇంచార్జి డైరక్టరు కేంద్ర పని ప్రగతి నివేదిక కొమర్రాజు వెంకట లక్ష్మణ రావు విజ్ఞాన సర్వస్వ కేంద్రం, (తెలుగు విశ్వవిద్యాలయం) హైదరాబాదు.

16. Encyclopaedia Britanica

16. Encyclopaedia Americana

16. World Book of Encyclopaedia

16. Circle of Learning A Study in Encyclopaedia making

